శ్రీరస్తు.

# కిరాతార్జునీయము.

---

## ప్రథమాశ్వాసము.

శా. శ్రీరామామణియంకమందలరఁగాఁ ♦ జెల్వొందువక్షస్స్థలిన్
సారశ్రీకుచలిప్తకుంకుమవిరా ♦ జత్కౌస్తుభంబొప్పఁగాఁ
గారుణ్యామృతపానమత్తనిజభ ♦ క్తవ్రాతముల్గొల్వఁగా
నారూఢింగరుడాద్రినుండునరసిం ♦ హస్వామిఁగీర్తించెదన్. ౧.

సీ. అఖిలలోకాలోక ♦ నానందకరములౌ, కరములు నాఁగటా ♦ క్షములు వెలయ
నంతరపరిదృశ్య ♦ మైనట్టికందు నాఁ, జెలువైనకస్తూరి ♦ తిలకమమర
నిర్ణిద్రధవళితో ♦ న్నిద్రచంద్రిక నాఁగ, దరహాసవిస్ఫూర్తి ♦ దనరుచుండ
వరసుధారససము ♦ త్కారవిస్ఫురద్ధాళి, ధళ్యంబునాజిగి ♦ దలఁకుచుండ
వఱలుసంపూర్ణశశిమాడ్కి ♦ వదనమొప్ప, హరినిజకామినీదృక్చ ♦ కోరతృప్తి
గొఱలఁజేయుచునాభళి ♦ గిరివసించి, చెలఁగుదేవుండుకృతిసాఁగఁ ♦ జేయుఁగాత.

ఉ. చల్లనిపుట్టినిండ్లుగల ♦ చానలురంబున మేనమోమునం
దెల్లపుడున్వసించికడు ♦ నింపులుగుల్కఁగఁ బ్రేమమీఱను
త్ఫుల్లమనోజ్ఞతన్ బ్రకట ♦ మూర్తియునైనగమైపలీసమై
తెల్లమినుండుమూర్తులను ♦ దీర్ఘతపోనుతియింతుమువ్వురన్. ౩.

సీ. వ్యాసవాల్మీకిసం ♦ యమివరప్రోక్తవ, ర్ణిష్ణుతత్త్వార్థసం ♦ దీప్యమాన
సకలేతిహాసశా ♦ స్త్రపురాణసంఘవి, స్ఫూర్జితాన్వయసము ♦ ద్భూతరాజి
తామలవిగ్రహ ♦ వ్యాప్తనిర్మలశార, దాంబుదహీరనీ ♦ హారభూధ్ర
గంగాజటాజూట ♦ కైలాసతారకా, నీకాధినాథస ♦ న్నిభయశంబు
కరణి నెమ్మేనిసత్కాంతి ♦ వఱలుచుండ, పరముఖాంభోజమాత్మని ♦ వాసమగుచు
వెలయుజగదంబశారద ♦ వేడ్కతోన, భీష్టసంసిద్ధిమత్కృతి ♦ కిచ్చుఁగాత. ౪.

సీ. తాటంకమణిగణ ♦ ధగధగరోచులు, గండభాగములపైఁ ♦ దాండవింప
దరహాససంజాత ♦ ధళధళదీప్తులు, కౌముదీకాంతులఁ ♦ గ్రమ్ముచుండ

నిరుపమమధురోష్ఠ ♦ నిగనిగాయతరుచుల్, విద్రుమద్యుతులను ♦ వేఁగనెత్త
సలలితాలకసాంద్ర ♦ చకచకదీధితుల్, హరినీలములజిగిఁ ♦ బరిభవింప
విభుఁడుదనమీఁదఁగలకూర్మి ♦ వెలయఁజేయు, కరణినెప్పుడువరునియం ♦ కముననిల్చి
సిరులు వెలయంగభక్తుల ♦ నరయుచుండు, కలిమిచూపులసిరిభామఁ ♦ దలఁతుఁబ్రేమ. ౫.

సీ. చెలువొప్పుకైలాస ♦ శిఖరభాగంబున, నిర్మలమణిమయ ♦ హర్మ్యమునను
విలసితశశికాంత ♦ వేదిపైసకలశృం, గారంబుమీఱఁగా ♦ గారవమున
సురసిద్ధసాధ్యకి ♦ న్నరమూనిగంధర్వ, వరులుప్రమథులు ♦ వరుసఁగొల్వ
మేఘంబుమీఁదిక్రో ♦ మ్మించుతేజంబునా, భూషణద్యుతి మెఱఁ ♦ బొల్పుమీఱ
నిండుగొల్వుండికన్నుల ♦ పండువుగను, నచ్చరలయాటపాటల ♦ నలరుచుండు
మందమలపట్టిహరుఁడును ♦ న్నించురాణి, పార్వతీదేవికతిభక్తిఁ ♦ బ్రణతి సేతు.

చ. ఘలుఘలుమంచుఁబాదకట ♦ కంబులుమ్రోయుచుఁదాళమానముల్
దెలుపఁగగండపాళికలఁ ♦ ద్రిమ్మరుచుండుమదాళిఝుంకృతుల్
తెలియఁగగానసౌష్ఠవము ♦ తీరుగనొప్పఁగఁబాదఘట్టనల్
వెలయుమృదంగనాదముల ♦ వీఁకఁజెలంగఁగమత్పరిబంధమం
దెలమినటించుచుండెడుగ ♦ ణేశునిభక్తినిమ్రొక్కికొల్చెదన్. ౬.

క. వల్మీకజనితసుచరితుఁ, గల్మషవిరహితునినాది ♦ కావ్యవిరచితున్
వాల్మీకిభక్తిఁగొల్చెదఁ, గేల్మోడ్చుచుమ్రొక్కివినయ ♦ కీలితమతినై. ౭.

క. భూసురకులసంజనితుని, భాసురనిగమార్థవేదిఁ ♦ బరతత్త్వజ్ఞున్
వాసిష్ఠపౌత్రువేద, వ్యాసునిమదిఁగొల్చిభక్తి ♦ వర్ణనసేతున్. ౮.

క. ద్వాదశనామస్కంధో, త్పాదితభాగవతదివ్య ♦ తరుశాఖలపై
వేదార్థమెనిశ్చయమని, వాదించుశుకాఖ్యమౌని ♦ వలగొనికొల్తున్. ౧౦.

తే. అరయగీర్వాణకవివర్యు ♦ లైనకాళి, దాసభవభూతిమాఘస ♦ త్కవిమయూర
దండిబాణాదులైనట్టి ♦ దండికవులఁ, దలఁచికీర్తించిమతియుసం ♦ తసమునొంది. ౧౧.

తే. శబ్దశాసనబిరుదుచే ♦ జగతిమీఁదఁ, బ్రాథిఁగాంచిననన్నయ ♦ భట్టుఁగొల్చి
సోమయాజినిగీర్తించి ♦ సుస్థిరముగ, భాస్కరాహ్వయుమదిలోనఁ ♦ బ్రస్తుతించి.

ఆ. పరమభాగవతుని ♦ బమ్మెరపోతన, నాత్మలోపలఁగొని ♦ యాడిమటియు
నంధ్రకృతులకర్త ♦ లైనట్టిసుకవుల, మనసులోఁదలఁచిన ♦ మస్కరించి. ౧౩.

క. భారవిభట్టురచించిన, భారవియనుకావ్యమవనిఁ ♦ బ్రఖ్యాతిగనే
నారూఢిని దెనిఁగించెద, ధారుణినాచంద్రనిత్య ♦ తారార్కముగాన్. ౧౪.

చ. లాఁడితెడుపొట్టకై యొరుల ♦ లుబ్ధత నెప్పుడుఁ గొల్చియున్న యా
జడమతి యంతయుం దొలఁగ ♦ జన్మమునన్ మఱియన్యవాయమున్
బుడమిఁ బవిత్రమై వెలయ ♦ భూరిశుభంబుల నెల్లఁ బొందఁగా
గడఁగి యహోబలేశునకుఁ ♦ గట్టుదు నీకృతి నేను బట్టమున్. ౧౫.

క. పంచాంబక జనకునకును, బంచాయుధ ధారునకును ♦ బలిసుతకరటీ
పంచాననవిక్రమునకుఁ, బంచాననసన్నుతునకును ♦ బరమాత్మునకున్. ౧౬.

క. శరనిధినిమగ్ననిగమో, ద్ధరణునకును మందరాద్రి ♦ ధారునకును భూ
భరణునకుఁ గనకకశ్యప, హరణునకును నిఖిలదైవ ♦ తారాధ్యునకున్. ౧౭.

క. వటువేషధారునకుఁ బ్ర, స్ఫుటతరసత్క్షత్రియౌఘ ♦ భూరుహదహనో
ద్భటపరశుధారణునకును, బటుతరహలధారునకును ♦ బలధీరునకున్. ౧౮.

క. దశకంఠకంఠలుంఠన, దశరథవరనందనునకు ♦ దాశార్హునకున్
నిశితాసిదళితవరపా, రశికాద్భుతభావికల్కి ♦ రాహుత్తునకున్. ౧౯.

క. శ్రీస్తనకుంకుమచిహ్నిత, కౌస్తుభవక్షునకు వికచ ♦ కంజాక్షునకున్
దుస్తరఖలశిక్షునకును, బ్రస్తుతయోగీంద్రశిష్ట ♦ పరిరక్షునకున్. ౨౦.

వ. సమర్పితంబుగా నా రచియింపం బూనిన కిరాతార్జునీయం బను మహాకావ్యంబునకుం
గథాక్రమం బెట్టి దనిన. ౨౧.

శా. శ్రీరంజిల్లు విచిత్రభూరుహలతా ♦ శ్రేణీసమాకీర్ణమై
శారీకీరమయూరకోకిలకుల ♦ శ్రావ్యోత్కటారావమై
సారాబ్జాసవమత్తభృంగవిలస ♦ ఝ్ఝంకారకాసారమై
మీఱుం ద్వైతవనంబు చూడ మునిస ♦ మ్మిశ్రోజ్జ్వలావాసమై. ౨౨.

క. అమ్మహితవనమునందవ, తమ్ములు సతి గొల్వ నుండు ♦ ధర్మతనూజుం
డమ్మహిదుర్యోధనునకు, సమ్మతి జూదమున నోడి ♦ సమయముకొఱకై. ౨౩.

క. అతఁడొక్కనాఁడు తమ్ములుఁ, హితులును దను బలసి కొలువ ♦ నెలమి దలిర్పన్
జతురతరవచనరచనలఁ, గుతుకము మీఱంగ నిండు ♦ కొల్వుండు తఱిన్. ౨౪.

ఉ. శ్రీయును రాజ్యపాలనముఁ ♦ జిత్తనివృత్తిజనానురాగముం
బాయనియా సుయోధనుని ♦ పాలికి మున్న రహస్యవృత్తిమైఁ
బోయి యెఱింగి రమ్మనుచుఁ ♦ బూనిక నంప వనేచరుండు దా
నాయెడ కేగి యాత్మనది ♦ యంతయు నారసి వచ్చెఁ గ్రమ్మఱన్. ౨౫.

తే. వచ్చి ధర్మజుఁ గాంచియా ♦ వనచరుండు, సవినయంబుగ సాష్టాంగ ♦ మవనిజాఁగి
మ్రొక్కి వేలేచి కరములు ♦ మోడ్చి నిలిచి, విన్నవింపంగఁదొణఁగెను ♦ విశదముగను.

సీ. అవధారు దేవ మీ ♦ రానతిచ్చిన యట్లు, కరినగరంబున ♦ కరిగి యచటి
వృత్తాంత మెల్లను ♦ విశదంబుగా బ్రహ్మ, చారివేషముఁ దాల్చి ♦ సరగఁ దెలిసి
చెచ్చెఱ వచ్చితిఁ ♦ జిత్తగింపుము మన, రాజ్యమెల్లను ధార్త ♦ రాష్ట్రుఁడాక్ర
మించెనంచును బల్కె ♦ మేదినీశునితోడ, నేమని చెప్పుదు ♦ నిట్టి మాట
యనుచు మనమున శంకయిం ♦ తైన లేక, యవనిపతితోడ నాప్తులై ♦ నట్టివారు
లరసి చూడంగ దబ్బర ♦ యైనమాటఁ, బూని వినిపింపఁగారాదు ♦ గానయపుడు. ౨౮.

క. ఈరీతిఁ బల్కి మఱియును, నారూఢార్థోక్తి మీఱ ♦ నాజ్ఞాపితుఁడై
వైరివిదారణశీలుం, డౌరాజునకిట్టులనుర ♦ హస్యమునందున్. ౨౯.

సీ. జననాథ విను ప్రయో ♦ జనములందు నియుక్తు, లైనట్టి భృత్యుల ♦ కరసి చూడఁ
జారచక్షువులైన ♦ జగతీశ్వరునకు పం, చనచేసి మాటలాడఁ ♦ జంగరాదు
కానఁ బల్కితి నిమీ ♦ మానసంబునకిది, ప్రియమైనఁ గానియ ♦ ప్రియముగాని
సైరణ సేయుమో ♦ స్వామి యిదియు గాక, యతిహితంబులు మనో ♦ హరములైన
పలుకులరయంగఁ గడుదుర్ల ♦ భములు గాక, హితవు వినిపింపకుండువా ♦ రేటిహితులు
హితులమాటలు విననిఁ దేఁ ♦ డేటి రాజు, రాజు మంత్రులుఁ గాదు చోఁ ♦ దేజమగును.

వ. అదియునుం గాక నిసర్గదుర్బోధంబు లైనరాజచరిత్రంబులెక్కడ, మావంటి యజ్ఞాన జంతువు లెక్కడ! ఇపుడు నిగూఢార్థంబైన విపక్షనీతిమార్గంబుఁ దెలిసివచ్చుట భవదీయసామర్థ్యవిశేషంబెయైనను, నాపోయివచ్చిన కార్యంబు సవిస్తరంబుగా విన్నవించెద సావధానుండవై యాకర్ణింపుము. 30.

సీ. దుష్టాత్ముఁడైనయా ♦ దుర్యోధనుండు జూ, దముచేత గెల్చిన ♦ ధరణియెల్లఁ
బట్టాభిషిక్తుఁడై ♦ పాలించుచుండియు, వనమున నున్నమి ♦ మ్మునుదలంచి
మనమున భయపడి ♦ మహియెల్ల మీకంటె, నీతివిచక్షణ ♦ ఖ్యాతి మీఱఁ
బాలించి తనకను ♦ కూలంబుగాఁ జేసి, కొనెదనంచుఁ బ్రయత్న ♦ మొనరఁ జేయు
చున్నవాఁడుగాని ♦ యున్మత్తుఁడై యున్న, వాఁడుగాఁడు రాజ ♦ వర్యయిట్టి
వానికిట్లు సుజన ♦ వైరమేలయటంచు, ననియెదేని వినుము ♦ వార్తయిపుడు. 3౧.

క. గొనకొని భూమిని సంపద, ఘనతరముగఁ జేయునట్టి ♦ ఘనవిద్వేషం
బొనరఁగ దుర్జనసంగము, మునకన్నను పరముగాదె ♦ భూవరముఖ్యా. 3౨.

క. ఈరీతినీతిపద్ధతి, వారక పాలించి భూమి ♦ వశముగఁ జేయం
గోరుట భయాపహమటయుఁగా, కారయఁ బౌరుషము విధమె ♦ యనియం టేనిన్. 33.

మ. అరిషడ్వర్గముముందె గెల్చి జనమా ♦ త్రాగమ్యమైనట్టియా
పరమస్వాదులపద్ధతిన్నడుపఁగా ♦ వాంఛించి తారేవగల్
వెరవుల్ గార్యవిభాగపౌరుషములన్ ♦ విఖ్యాతమానట్లుగాఁ
బరఁగం జేయుము జాగరూకుఁడగుచున్ ♦ బాలించెదున్ భూవరా. 3౪.

వ. అని మఱియును బ్రజాపాలనవిధంబును, ద్రివర్గోపాయవ్యాపారంబును, బలపరాక్రమ
సంపత్తియు నెఱింగించువాఁడై యిట్లనియె. 3౫.

చ. కొలిచిన భృత్యకోటినను ♦ కూలతవొప్పెదుమిత్రులట్లుమి
త్రులమఱి బంధువర్గముల ♦ తోసరిగాఁగను బంధుజాలమున్
వెలయఁగృతాధిపత్యమున ♦ విశ్రుతమైతనఁ బోలెనాదరం
బలరగ తస్మయుండగుచు ♦ నారయు లెస్సగ సంతతంబునున్. 3౬.

తే. అలరుధర్మార్థకామంబు ♦ లను త్రివర్గ, మతఁడు సమభక్తి విభజించి ♦ యరయునట్టి
గుణవిశేషతసఖ్యంబుఁ ♦ గోరిచేసి, నట్టులనోన్యము నుగూడి ♦ యలరునధిప. 3౭.

ఉ. సామము దానవర్జముగ ♦ సల్పుటలేదల భూరిదానమున్
దామఱి సత్క్రియావిరహి ♦ తంబుగఁ జేయఁడు సద్గుణాంచితం
బామహనీయసత్క్రియయు ♦ నర్హ మెఱుంగక సేయఁడెన్నఁడో
సామి సుబోధనుండతని ♦ జాగ్రత యేమని విన్నవించెదన్. 3౮.

మ. ధనకాంక్షన్మతికోపకారణమునన్ ♦ దండింపఁడెవ్వారినిన్
దనరాజోచితనీతిమార్గమునశా ♦ స్త్రజ్ఞుండు బోధించిన
ట్లనయంబున్మఱి సూనుఁడేని యఁబరుం ♦ డౌనేని యొందుర్ణయం
బునవర్తించినదండనంబు సలుపున్ ♦ భూమీశనిర్లోభతన్. 3౯.

సీ. పరరాజులకుమది ♦ భయమందియెంతయుఁ, బరభేదనప్రౌఢిఁ ♦ బరఁగుగూఢ
చారులసకలదే ♦ శములందునియమించి, పరులకుఁదాభయ ♦ పడుటగాన
రాకుండునట్టిని ♦ జాకారముననుండి, పరరాజులోపలి ♦ వారినెల్ల
వశులఁగాఁజేసియ ♦ వ్వారిలోవారెయొం, డొరులభేదింప ♦ నొనరఁజేసి
చారులంపుపనులు ♦ సఫలంబులొనరించి, వచ్చినపుడెవలయు ♦ వస్తువిచ్చి
మెచ్చిజనులుతన్ను ♦ మేలుమేలుకృతజ్ఞుఁ, డనఁబొగడ్తమెలఁగు ♦ నయ్యయెపుడు.

చ. పరఁగుసుపాయముల్ దగిన ♦ పట్టున నెంచుచు దానియోగముల్
సరసతఁ జేయుచేయు నెడు ♦ సత్క్రియ నొందిపరస్పరంబుఁ దా
మొరయుచు సేయులీలనుమ ♦ హోత్తరకాలయుతార్థసంపదల్
తఱుచుగఁ గూర్చుఁబోతమకుఁ ♦ దామెయజస్రముముందుముందుగన్. ౪౧.

వ. అదియునుంగాక. ౪౨.

సీ. అగణితరాజన్య ♦ హయరథాందోళిప, ల్యంకికాగజసైన్య ♦ సంకులంబు
నిఖిలదేశాయాత ♦ నృపతిభూషణకర్ష, ణావిర్భవత్స్వరా ♦ గావృతంబు
నతఫాలతిలకస ♦ త్కృతమృగీమదలిప్త, పాదపీఠప్రభా ♦ భాసురంబు
వేత్రహస్తోద్భట ♦ వేత్రవిన్యాసని, శ్చలపార్శ్వజనసాల ♦ విలసితంబు
నైనయట్టియతని ♦ యాస్థానమంటపా, జిరముకాన్కలిచ్చు ♦ కరిఘటౌఘ
దానసేకమున నె ♦ ధరణీశపంకిలం, బగునిఁకేమిచెప్ప ♦ నతనిసిరిని. ౪౩.

తే. మఱియునాతండుపాలించు ♦ మహిమచేత, మహితగుణవృద్ధిచేనదీ ♦ మాతృకంబు
లగుచుహాలికులుకృషి సేయ ♦ కలరఁబండు, సస్యసంపత్తిచే నొప్పు ♦ జనపదములు.

క. నిరుపప్లవముగసదయత, నురుయశుఁడై పాలనమున ♦ నుదయముపొందన్
నెఱిగొనుధనదనిభుండగు, కురువిభునకు ధనముదానె ♦ కురియున్ మహియున్. ౪౪.

క. మానధనుల్ ధానుష్కులు, భూనుతధనికులునభేద ♦ బుద్ధులురణకే
ళీనిపుణులుమఱిసమయం, బైనను బ్రాణములనిత్తు ♦ మందురు భటులున్. ౪౫.

సీ. అదిగాకమఱియును ♦ సాంగమాపెరరాచ, కార్యముల్ వంచకుల్ ♦ గానియట్టి
చారులచేసవి ♦ స్తరముగావించుతాఁ, జేయుకార్యముబ్రహ్మ ♦ సృష్టిఁబోలె
ననుకూలఫలయుక్త ♦ మైనయప్పుడెఱుంగు, నట్లుగాఁ జేయుచు ♦ నతఁడుఁదాను
విల్లందియొకనాఁడు ♦ విక్రమించకయుయ్యెఁ, గోపమొక్కింతయుఁ ♦ జూపకయ్యె
మాన్యచారిత్రతనగుణ ♦ మహిమచేతి, మహితమైనట్టినవపుష్ప ♦ మాలఁబోలె
ధరణిపతులెల్లతనయాజ్ఞఁ ♦ దలనుమోచి, నడవఁగాఁజేసియతఁడొప్పు ♦ నరవరేణ్య.

వ. వెండియు నివ్విధంబున నప్రతిహతశాసనుం డగు నా దుర్యోధనుండు ధర్మార్జకుండై
నవయౌవనోద్ధతుండును, రాజ్యభారవహనయోగ్యుండును నగుదుశ్శాసనుని యువ
రాజ్యభారంబునకు నియమించి, నిజపురోహితానుమతుండై హవిర్భాగంబుల నగ్ని దేవుం
దనుపుచుండు ; నివ్విధంబున నుత్తరకాలఫలసుస్థిరంబగు నా సముద్రపర్యంత మహీ
మండలంబు నిష్కంటకంబుగాఁ బాలించుచు సార్వభౌముండైయుండియుఁ ద్వదా
గమనభయచింతితుండైయుండు నింకేమని విన్నవింపనేర్తు! బలవద్విరోధంబు దురి

తంబైనదిగాదె! అదియునుంగాక సభాసదులైన జనులు కథాప్రసంగంబుల మిమ్ముం జేరఁగొనిన విని యాఖండలసూనువిక్రమంబు మనంబునం దలంచుకొని విషవైద్య మంత్రపదంబునం దోఁచు వైనతేయపాదవిక్షేపానుస్మృతం బగు దుష్టోరగంబుచందం బున నతముఖుండగుచు మనఃపరిపీడితుండై మీ మీఁదఁ గపటంబు సేయ నుద్యోగించు చుండు; నట్లుగావున మీరును నా దుర్యోధనునిమీఁదం జేయవలయు ప్రతిక్రియ శీఘ్రంబునం జేయం దగుంగాని యితరంబుగాదు. నా యెఱింగినయంతయును దేవర కెఱింగించితి. ఇటమీఁదటి కర్తవ్యంబు మీరే యెఱుంగుదురు. మా చేయు ప్రయో జనం బింతియకాదే యనిన విని ధర్మనందనుండు సముచితసత్కారంబున బహూక రించి నిజనివాసంబునకుం బొమ్మని యాజ్ఞాపించిన నవ్వనేచరుండును సాష్టాంగ వినతుండై నిజనికేతనంబున కరిగె. ఆ ధర్మసూనుండును గొలువువీడ్కొని యనుజ సమేతంబుగా ద్రౌపదిమందిరంబునకుం జని తద్వృత్తాంతం బంతయు వివరించిన. ౪౮.

క. ఆపల్కులువినియప్పుడు, ద్రౌపదితనపాట్లుదలఁచి ♦ తాళుకొనంగా
నోపకకోపోద్యోగో, ద్దీపకముగఁబల్కెనాయు ♦ ధిష్ఠిరుతోడన్. ౪౯.

మ. అనఘా మీరునయజ్ఞులైననిపుడే ♦ నాత్మన్ విచారించిప
ల్కినపల్కుల్ పరికించిచూడమిమునా ♦ క్షేపించినట్లుండున
ట్లనియున్నన్ సమయాపహంబులగునా ♦ యాత్మవ్యథల్ పల్కఁగా
ననుఁబ్రేరేచెడిఁజిత్తగింపుఁడుమదిన్ ♦ నామీఁదఁగోపింపకన్. ౫౦.

మ. చిరకాలంబుననుండితావకకుల ♦ శ్రేష్ఠుల్ మహేంద్రోపముల్
భరతాదుల్ తగనేలుభూమివిడువం ♦ బాలయ్యెనీచేతనేఁ
డరయంగామదగంధసింధురముదా ♦ నాత్మీయహస్తంబుచే
ధరియింపంగనలేకవీడుసుమనో ♦ దామంబుచందంబునన్. ౫౧.

వ. అది యెట్లంటేనిం జెప్పెద నాకర్ణింపుము. ౫౨.

శా. మాయోపాయులతోడ నెవ్వరిలలో ♦ మాయల్ తగంజేయరో
యాయజ్ఞానులచేఁబరాభవముప్రా ♦ ప్యంబౌనదెట్లన్న నా
మాయాశీలురుమాయవాదులునవ ♦ ర్మస్థంబులౌనంగము
ల్దాయంగూల్చెడువాఁడిబాణములలీ ♦ లంగూర్తురుర్వీశ్వరా. ౫౩.

క. కావునఁగపటాత్ములయెడ, నీవింతయుఁగపటబుద్ధి ♦ నెరపనికతనన్
నీవలనమాకునిటువలెఁ, దావలమైయీయపస్థ ♦ దలకొనియెన్నృపా. ౫౪.

శా. కాకున్నన్ స్వకులాభిమానులనుర ♦ క్షస్థైర్యసాహాయ్యులా
భూకాంతుల్మఱినీవుదక్కనితరుల్ ♦ బుద్ధిన్విచారించినన్
శ్రీకాంతన్ బెఱవారిచేతనుగుల ♦ స్త్రీఁబోలెఁగోల్పోదురే
లోకంబంగుఁగులాభిమానముయశో ♦ లోపంబునుంగాన్పపా. ౫౫.

వ. అని మఱియును గోపం బుత్కటంబుగాఁ జేయఁ దలంచి యిట్లనియె. ౫౬.

క. భూరమణయిపుడుకోపము, ధీరులునిందించునట్టి ♦ తెరువునఁజనుని
న్నేరీతిఁగాల్పకున్నది, నీరసమగుజమ్మిచెట్టు ♦ నిప్పుంబోలెన్. ౫౭.

క. అంతశ్శత్రువుకోపము, చింతింపఁగనని పరిత్య ♦ జించితినన్నన్
కౌంతేయాగ్రజవినుమిపు, డెంతయువివరించిచూడ ♦ నిద్ధరలోనన్. ౫౮.

మ. ఫలితక్రోధియునాపదాఘ్నుఁడుననం ♦ బ్రఖ్యాతుఁడౌవానికిన్
వలనొప్పందమయంతెఁదామెవశులై ♦ వర్తింతురీలోకులుం
దలపంగోపములేనివాఁడుహితుఁడై ♦ నన్ద్వేషియైనన్వృథా
ఫలమున్ లేదుభయంబుఁజెందదుగణిం ♦ పన్మానవాధీశ్వరా. ౫౯.

వ. అదియునుంగాక. ౬౦.

మ. క్రమమొప్పంగమహారథుండునులస ♦ ద్రక్తాంగరాగోచితో
రుమహోరస్కుఁడుభీముఁడిప్డుపదచా ♦ రుండైమహారణ్యదే
శములన్ రేణువికీర్ణదేహుఁడగుచున్ ♦ సంచారముల్సేయఁగా
నమరంజూచితపింపదేమనసుస ♦ త్యాత్ముండవౌనీకిటన్. ౬౧.

చ. ఒనరఁగవాసవోపమితుఁ ♦ డుత్తరపున్ గురుభూములెల్లభం
జనమునగెల్చినీకలధ ♦ నంబులుదెచ్చినయాధనంజయుం
డెనయఁగవల్కలాంబరము ♦ లీగతిఁదాల్చిచరింపఁగాఁగనుం
గొనియిపుడెట్లునీమదిని ♦ గోపముబుట్టదుపాండవాగ్రజా. ౬౨.

చ. అడవులనేలపాల్గఁగతి ♦ నాకృతులైకురులెల్లచిందఁగాఁ
బొడవగుపర్వతంబులను ♦ బుట్టుగజంబులలీలఁజూడనొ
ప్పెడుసహదేవునిన్నకులుఁ ♦ బ్రీతిఁగనుంగొనియెట్టునీమదిన్
బొడమదుఖేదమానియమ ♦ బుద్ధియువీడదొకింతయుంగటా. ౬౩.

వ. అనిపల్కి వెండియు నా ద్రుపదరాజనందన యతనియాత్మ దుర్దశ ప్రకటింపఁ దలఁచి
యిట్లనియె. ౬౪.

క. ఎటువంటిదో నీమదియు, న్కటమాయీ నీయవస్థఁ ♦ గన్గొనమదిపం
కటపడెడు నాకు సహితము, కటకటమతిచిత్రగతులు ♦ కడుచిత్రములౌ. ౧౫.

సీ. వెండియువినుమున్ను ♦ విప్రభోజనశేష, రాజితరాజాన్న ♦ భోజనమున
రమణీ యమూశరీ ♦ రము నేఁడువన్యఫ, లాహారములకుఁబా ♦ లౌచునిపుడు
కీర్తిఁ గోఁగూడమి ♦ క్కిలి కార్శ్య మొందెను, రత్నపీఠస్థమై ♦ రాజమాళి
సుమమాలికాపరా ♦ గమునఁదోఁగెడుపాద, యుగళంబు సద్ద్విజ ♦ మృగవిలూన
బర్హిశాటవిఁజరియింపఁ ♦ బాలుపడియెఁ, గలితసుమశయ్యమాగధ ♦ గానములను
మేలుకొను నిద్ర నేఁడుస్పృ ♦ గాలరవము, వలనఁగుశశయ్య మేల్కాన ♦ వలసెనకట.

ఆ. అఖిలజీవులకును ♦ నాపదయొక్కటే, తలఁచిచూడనింత ♦ తథ్య మెందు
నిపుడుమనసులోన ♦ నేటికినీవిట్లు, పరితపించెదనుచుఁ ♦ బలికె దేని. ౧౬.

మ. వినురాజోత్తమయీయవస్థమతివి ♦ ద్వేషప్రభూతంబుగా
పుననాచిత్తము పెల్లగించినటుల ♦ న్వోందిందుఁజింతింపఁగా
ఘనులైమానధనాఢ్యులై పరభిదుల్ ♦ గానట్టిమీవంటిశూ
రనికాయంబులకెల్ల నుత్సవసమా ♦ రంభంబె కాఁబోలుఁగా. ౧౭.

వ. అనియునుం గాక కర్తవ్యం బెద్దియని యంటివేనిం జెప్పెద నాకర్ణింపుము. ౧౮.

క. ఘనుకొని శాంతి నివిడువుము, మనమున ధైర్యంబునిలుపు ♦ మాస్తజనుఁ పక్
గొనకొని యుత్సాహింపుము, కనికనియిబులూరకుండ ♦ ఘనులకుఁ బగు నే. ౨౦.

ఆ. అరయఁగార్యసిద్ధి ♦ యగుశాంతిచేతనె, యనుచుఁదలఁచెదేని ♦ యనఘవినుము
ధరణినిస్పృహుఁడగు ♦ తపసికినగుఁగాని, మనుజపతికిఁగాదు ♦ మఱియువినుము.

శా. తేజోవంతులలోనసగ్రచరులై ♦ ధీమంతులై శూరులై
రాజత్కీర్తివిరాజమానులగుచున్ ♦ రంజిల్లుమీవంటిస
ద్రాజన్యావళియిట్టిసేఁగితమకుం ♦ బ్రాపింపఁగాసైఁచినన్
నేఁజెప్పంగలదేమిమానముప్రథా ♦ నిష్ఠాలమానకట్టూ. ౨౨.

క. అటుగనుక శౌర్యము చితము, దిటముగనీవుత్సహించి ♦ తేజోనిధివై
చటులగతివిక్రమించిన, ఘటియించును గార్యసిద్ధి ♦ ఘనముగమనకున్. ౨౩.

శా. కానున్నంగతవిక్రమంబువోలఁకన్ ♦ గాంతేయశాంతిన్ సుఖ
శ్రీకింగారణభూతమంచు నెప్రశుం ♦ జింతింపుదల్లేనియా
భూకాంతాంకితమైనకాస్తికముని ♦ ష్ఠాలంబు గావించినీ
వాకల్పంబుగనీవనాంతరమునన్ ♦ యాగంబులం జేయుమా. ౨౪.

మ. ఇదిగాకన్సమయంబుభంగమగునం ♦ చెంతేభయంబందితే
నదితేదెంత్రయుశత్రురాజులపకా ♦ రాయత్తులై యుండఁగా
మదయంబొందఁగఁగోరునీకురిపునా ♦ శోపాయమూహింపకే
మదిలోనన్సమయావరోధముఁదలం ♦ పంబాడియేభూవరా. ౨౫.

చ. సమయముచేతనన్విధిప ♦ శంబుననీవిపదంబురాశిలో
భ్రమనుమునింగితేజమును ♦ బాయుచుసావసువృత్తిహీనమై
తమసముపంటిశత్రుబల ♦ దర్పమునుగెల్చువృద్ధిబొందుని
న్నమరదిసాదిలక్ష్మియుద ♦ యాద్రినిబోలెనుబొందుఁగావుతన్. ౨౬.

వ. అని పల్కి యా ద్రుపదరాజనందన యుపసంహరించిన. ౨౭.

ఉ. అంతటభీముఁడిట్లనియె ♦ నాద్రుపదాత్మజపల్కులన్నియ
త్యంతహితార్థబుద్ధికము ♦ లంచుమనంబుననిశ్చయించియా
త్యంతరబాధలేకమహి ♦ తార్థనిగుంభనయుక్తిమీఱఁగా
నెంతయునీతిపద్ధతిగ ♦ నిద్ధయశుండగుధర్మరాజుతోన్. ౨౮.

ఉ. ధర్మజవింటివాయిపుడు ♦ ద్రౌపదియెంతయుఁబ్రేమదృష్టిఁదా
నిర్మలబుద్ధినెంచిసని ♦ నీతిగఁబల్కినపల్కులెంతయే
నర్మిలినెంచిచూచినబృ ♦ హస్పతికైననువాగతీతమై
మర్మమెఱుంగరాకయును ♦ మానుగవిస్మయమందఁజేసెడున్. ౨౯.

ఉ. నీతిగ్రహింపదుస్తరము ♦ నేరుమనట్టియుపాయబోధయా
నాతఁడుచెల్పఁగావినిజ ♦ లాశయముందగఁజొచ్చినట్లియా
నీతిగ్రహింపవచ్చుమతి ♦ నేర్చెడివారలుజ్ఞానబోధయా
నాతేఁడుగల్గుటబ్రమిది ♦ యాత్మనెఱుంగుముధర్మనందనా. ౩౦.

ఉ. హీనబలాఢ్యులౌనరుల ♦ కెల్లనుసంగ్రహణవ్యధానుసం
ధానకమాచునంత్యఫల ♦ దాయకమైమతిసూక్ష్మనామహా
యానయయుక్తియందమది ♦ నెంచమహాశాపధమందునుంబలెన్
గానఁగనయ్యెడున్గుణవి ♦ కాసబహుత్వముగాఁగధర్మజా. ౩౧.

చ. అతిరుచిరార్థయుక్తియిది ♦ యావరణీయమునిశ్చయంబుగా
నతులగుణాఢ్యనీకునిది ♦ యంగనపల్కినియొప్పదంటివా
మతిగలపండితోత్తములు ♦ మాటలలోపలియర్థమేవిని
శ్చితముగనాదరింతురల ♦ చెప్పెడివారివిశేషమెంతురే. ౩౨.

వ. అని మఱియు రోషసంసక్తమానసుండగు మనిశ్చలహృదయారవిందుండైన ధర్మనందను
దూఱం దలంచి యిట్లనియె. ౫౩.

ఆ. తనరుదండనీతి ♦ త్రయివార్తలనియెడు, విద్యలందుఁబ్రౌఢి ♦ వెలయుబుద్ధి
యెట్టులణఁగియున్న ♦ దిదియేమిపంకని, ర్భగ్నమైనకరిణి ♦ మాడ్కినధిప. ౫౪.

ఉ. ఇంతననేలనీవుమన ♦ కేమిగొఱంతనియంటివేనినీ
వెంతయుఁబెంపుతోమనుపు ♦ హెచ్చుగుసంపదనుండియిప్పుడ
త్యంతముశత్రుసంఘటితత ♦ హానినలంగుచులోకనింద్యతన్
జింతిలుచుండుకంటెమఱి ♦ సేఁగివలంపఁగనెందుగల్గునే. ౫౫.

చ. ఇదిసమయంబుగాదనుమ ♦ నెంచెదవేనిప్రతాపశాలురై
పొదలెడువారికిన్ రిపువి ♦ భూతిమహోత్తరమైనదేనితా
నదితుదిముట్టకుంటమది ♦ నారసియోర్వఁగవచ్చునెంతయున్
గుదిసినసద్విభూతితుద ♦ గొప్పగునేనదియోర్వవచ్చునే. ౫౬.

చ. అదియునుగాకయిద్దఱకు ♦ నారయసంక్షయమొక్కవేళనే
యొదవనివేకియౌనృపున ♦ కుత్కటమైరిపువేగఁబొందఁగాఁ
బదపడికొంచెమైతనకుఁ ♦ బ్రాప్తముగాఁగనియోర్వవచ్చుఁగా
కదియిటువట్టులైనతఱి ♦ నాశుగతిన్ బ్రతిసేయఁగాఁదగున్. ౫౭.

చ. వినుమదియట్టులుండెఁబ్రబలి ♦ వీరవిభుత్వమువర్ధమానమై
తనరను పేక్షచేసియది ♦ తారుసహించునృపాలకోటికిన్
జనములనిందచేతఁబలె ♦ సంపదలెల్లనుశీఘ్రమేచెడున్
మనమునసెంచిచూడజన ♦ మాన్యచరిత్రనిజంబుగామహిన్. ౫౮.

క. బలహీనుఁడైననృపతికిఁ, జలమునశాత్రవులనెట్లు ♦ సాధింపంగా
నలవడునని యనెదేనియుఁ, దెలియఁగవినుమేనునీకుఁ ♦ దెలిపెదనఘా. ౫౯.

క. హీనబలుఁడైననరపతి, తానుద్ధతుఁడగుమసహజ ♦ ధర్మముపూనన్
మానవులుగొల్తురాతని, భూనుతుఁడగుబాలచంద్రుఁ ♦ బోలెనరేంద్రా. ౬౦.

వ. అది యట్లుండెఁ బ్రభుశక్తి హీనుండైనవానికి నుత్సాహశక్తి యెట్లు సిద్ధించునని యంటి
వేని చెప్పెద నాకర్ణింపుము. సామదానభేదదండంబులనియెడు చతురుపాయప్రారం
భంబును, సహాయరూపంబైన బలద్రవ్యసంపత్తియు, దేశకాలవిభాగనిర్ణయంబును,
వినిపాతప్రతీకారంబును, కార్యసిద్ధియు ననఁ బ్రసిద్ధంబులైన పంచాంగంబులను నిర్ణ
యింపం బడునట్టిది నీతి. అట్టినీతియె మంత్రశక్తియనం బడు నదియును గోశజతు

రంగబల సముదాయ సంపదరూపంబైన ప్రభుశక్తికిం గారణంబు. అట్టినీతియు సాధనో పాయంబులయందు హాలికుండు కృషిసేయుటకు దైవంబు ననుసరించుతెఱంగున, నుత్సాహశక్తి ననుసరించుచున్నయది. ఇట్లు మంత్రశక్తికి మూలంబైన యుత్సాహశక్తి ప్రభుశక్తికిం గారణంబగుటయేమి యనిన దట్లుగావున నీ వెల్లభంగుల నుత్సాహశక్తి యుక్తుండవైన సకలకార్యసిద్ధియును జేకూడు నైన నుత్సాహశక్తియుక్తుండైనవానికి సహాయంబులేక కార్యసిద్ధి యెట్లయ్యెడునని యంటివేని యభిమానశాలియు శౌర్యవంతుండునై రాజ్యాధిరూఢుండుగా నిశ్చయించినవానికిఁ దనపురుషకారంబె యుత్తుంగపశ్వారూఢుండగు వానికనుచరహస్తం బవలంబనంబైనవిధంబున సహాయంబగుం గావున. ౯౧.

ఆ. పురుషకారహీనుఁ ♦ బొందునాపదలెల్ల, నట్టివానిఁజెంద ♦ దాయతియును
నాయతియునులేమి ♦ కతిలఘుత్వమువచ్చుఁ, జులకనైనపతికిఁ ♦ బోలఁగునికియు.

క. కానసమున్నతికహితం, బైనదియుత్సాహహీన ♦ మదిచాల్వదుమీ
మానుగహీనోత్సాహుని, తోనెట్లొదగూడుశౌర్య ♦ ధుర్యసమృద్ధుల్. ౯౩.

క. అదిగాకయిపుడుసమయము, మదిఁదలఁచితివేనితడవు ♦ మహీయుల్లనునె
న్నదినేలివిడువఁబడునే, తుదిసులభతఁగుటిలుఁడైన ♦ దుర్యోధనుచేన్. ౯౪.

క. అదిగాకమనకునాతఁడె, యిదెకొమ్మనిరాజ్యభాగ ♦ మిచ్చినమతినీ
వదిగొనిననీయనుతమ్ముల, పదములభుజశక్తులేల ♦ సౌజన్యనిధీ. ౯౫.

సీ. సామముచేతనన్నియును ♦ జక్కనయయ్యెడువేగిరింపఁగా
నేమిటికంటివేనిధర ♦ ణీశ్వరవిన్ముభుజాహతోన్మదే
భాభిమజీవితంబగుమృ ♦ గాధిపమట్టులెకాకశూరుఁడున్
దామదిఁగోరునేప్రబల ♦ దర్పవిహీనవిభూతినెంతయున్. ౯౬.

ఆ. కానమనకుదండ ♦ కార్యంబెయుచితంబు, దండమునసులక్ష్మి ♦ తగునిజంబు
గానుపాయభేద ♦ గతినిశ్చయంబుగా, నగునటంటివేని ♦ యధిపవినుము. ౯౭.

చ. అతులితవిక్రముండునయ ♦ శోర్థియుమానధనుండునైనభూ
పతికిమనంబునందలఁపఁ ♦ బ్రాణముమీఁదటవచ్చునేనియుం
వితతయశంబెముఖ్యఫల ♦ వేదితమామతియానుషంగికం
బితరతటిత్స్వభావసిరి ♦ యిద్ధరనెన్నఁగమానవేశ్వరా. ౯౮.

ఆ. అయినవల్పమైన ♦ యభిమానమునకుగా, వెలయుప్రాణములను ♦ విడుచుటెట్టు
లనుచనంటివేని ♦ వినుమహీవరముఖ్య, విన్నవింతునీకు ♦ విశదముగను. ౯౯.

చ. అరయఁగభస్మరాశిజనుఁ ♦ డంటినయట్టులుప్రజ్వలాగ్నిఁదా
వెఱచునుబట్టఁగాదహన ♦ భీతినిగావునశూరుఁడు౯యశో
హరణవిభీతినెంతయును ♦ బ్రాణములైననువీడుఁగానితాఁ
జిరతరకీర్తిఁబీడఁడిది ♦ సిద్ధముసుమ్ముమహీవరోత్తమా. ౧౦౦.

వ. ఇట్లుసేయుటకుం బ్రయోజనం బేమని యంటివేని చెప్పెద నాకర్ణింపుము. ౧౦౧.

క. గర్జద్ఘనములఁగనియే, మార్జించెదననుచునెగయు ♦ హర్యక్షముదా
నిర్జితశత్రుసమున్నతి, కర్జంబుగదామహాత్మ ♦ ఘనులకునెల్ల౯. ౧౦౨.

క. కావుననజ్ఞానమువిడు, భూవరవిక్రమమునందె ♦ బుద్ధినిలుపుమీ
నీవుమతివిక్రమించిన, నావైరులనిజముగాను ♦ నాపదలందు౯. ౧౦3.

ఉ. కాకపరాజయంబనెడు ♦ కార్యముదక్కుముదిగ్విభావ్యమా
నైకచతుఃపయోధిసమ ♦ దేభచతుష్టయదృశ్యమానమై
పాకహరోధివిక్రమతఁ ♦ బాటిలునగ్గురనీదుతమ్ముల౯
దీకొనిశత్రులంబొకఁడు ♦ నిల్చిరణంబునగెల్చునేనృపా. ౧౦౪.

ఆ. నృపవరేణ్యయిపుడు ♦ రిపుకృతంబయినీదు, మదినిమందుచున్న ♦ మన్యువహ్నిఁ
జల్లఁజేయుఁగాక ♦ శత్రునారీనయ, నాంతశోకవిగళి ♦ తాశ్రుసమితి. ౧౦౫.

ఉ. నావుడుధర్మజుండురిపు ♦ నాశముసేయుమటంచునీగతిం
దావివరించుచుండుతన ♦ తమ్మునిఁగోపపరీతమానసుం
డైవిలసిల్లుభీముఁగని ♦ యాత్మమదద్విరదంబునుంబలెం
దావివరించిశాంతికిని ♦ దార్చెదనంచుఁదలంచియిట్లను౯. ౧౦౬.

చ. అనిలజనీవుపల్కినన ♦ యప్రతిపాదకవాక్యమందుల
న్ననుమమనోజ్ఞము౯శుచియు ♦ నిర్మలముంగడుమంగళప్రదం
బునునగునద్ధమందుబలె ♦ బుద్ధిఁదలంపఁగనీతియుక్తమై
పనుపడునట్టినీమతియుఁ ♦ బ్రస్ఫుటమైకననయ్యెనెంతయు౯. ౧౦౭.

సీ. అదిగాకమతియును ♦ మదినెంచిచూచిన, మృదుపదసందర్భ ♦ విదితమగుచు
నర్థగౌరవమున ♦ నతిశయంబగుచును, బునరుక్తియొకటను ♦ బొరయనీక
యాకాంక్షకెంతయు ♦ ననుకూలమగుచును, ఘనశాస్త్రయుక్తితో ♦ ననుగమించి
విక్రమాశ్రయమున ♦ వెలయుచుశూరత్వ, నీతివిచక్షణ ♦ ఖ్యాతిమీఱ
నెంతయునునొప్పుచుండెడు ♦ నిట్టిపల్కు, లిప్పుడీరీతినన్నియుఁ ♦ దప్పకుండ
నరసిపలుకంగనెవ్వరి ♦ కలవియగును, నవనిలోనెన్ననీకుఁగా ♦ కనఘచరిత. ౧౦౮.

క. ఒప్పదమున్నదియెంతయు, నిప్పుడు నీపల్కినట్టి ♦ యీయర్థము నీ
విప్పగిదినైనఁజేయుము, తప్పకయనియంటివేని ♦ ధన్యవిచారా. ౧౦౯.

క. చతురత నీవిపుడెన్నిన, హితకార్యంబింతవినియు ♦ హృదయంబవిత్ర
స్తతనిపుణునిర్ణయము నే, వెతకెడు ధ్వాంతమునను ♦ వినుమనఘాత్మ. ౧౧౦.

వ. అదియునుం గాక సంధివిగ్రహయానాసనద్వైధీభావసమాశ్రయంబులనెడు నదుపా యంబులం బ్రయోగించునట్టి విశేషోపాయంబులునుం దోఁపకున్నయవి. ఎట్లైనను నేమి కార్యప్రవర్తకుండవు గమ్మని యంటివేనిం జెప్పెద నాకర్ణింపుము. ౧౧౧.

క. ఆలోచించక క్రియలను, బాలసుఁడై చేయునేని ♦ పరమాపదకు
న్మూలముగుఁ దెలిసిచేసినఁ, జాలగుణాశ్రయములైన ♦ సంపదలంగున్. ౧౧౨.

క. గొనకొని సాహసికునకును, ననువుగ ఫలసిద్ధి గానె ♦ యొనని యనినన్
నినుకాకతాళనిర్ణయ, మును బోలెను నొక్కవేళఁ ♦ బొందును నిజమే. ౧౧౩.

చ. వలనుగ నిర్మలోదకము ♦ వంటివివేకము చేతనిర్ధరన్
తెలియఁగ నెవ్వఁడైనఁదన ♦ విత్తులవంటియుపాయముల్ ప్రవ
ర్తిలఁగను జేసినన్ గృషివి ♦ ధిన్ హాలికుండు సమగ్రవర్షస
త్ఫలమును గాంచినట్లతఁడు ♦ తానును గాంచుసదాఫలక్రియన్. ౧౧౪.

క. అనిమతియును ధర్మజుఁడి, ట్లనుఁ దావచియించునర్థ ♦ మనిలసుతునకున్
వినవింపుపుట్టుకొఱకై, మనమునఁదలపోసినీతి ♦ మార్గము మీఱన్. ౧౧౫.

చ. అనిలజ సంప్రదాయసుచి ♦ రైపెను పొందెదు శాస్త్రమిప్పుడీ
తనువునలంకరించుమతి ♦ దానికలంకరణంబు శాంతిదా
వినుమతి శాంతికిన్ సమయ ♦ విక్రమమాభరణంబు దానికిన్
అనువగు భూషణంబగువ ♦ యార్జితసిద్ధి దలంప నెంతయున్. ౧౧౬.

ఆ. వినుప్రయోజనముల ♦ వేగిరించకలెస్స, తెలిసిసేయుమనుచుఁ ♦ బలికితిప్పుడు
తెలివియెందువలనఁ ♦ గలదనియంటివే, ననిలతనయవినుము ♦ సాదరమున. ౧౧౭.

చ. బెరసితమంబువంటిమతి ♦ భేదముగప్పఁగసద్వివేకికిన్
జొరఁగనశక్యమైపరఁగు ♦ చుండును పాయములందు శాస్త్రమే
తిరముగఁ జీఁకటింటికడ ♦ దీపము బోలెడునర్థదర్శనం
బిరవుగఁజేయుఁగానమతి ♦ యింతకుమూలము శాస్త్రమేసుమీ. ౧౧౮.

వ. ఇవ్విధంబున విచారించి సేయువానికి దైవవశంబున నొక్కయవాంతరంబు ఘటిల్లెనేని, నేమగునంటివేని లోకపూజ్యులైన మహాత్ములు వర్తించుపథంబున నడవనిశ్చయించు

వానికి విధిపశంబున నిర్హేతుకంబుగా నవరోధప్రాప్తియైన నదియును, నౌన్నత్య సమానంబగుంగాని యితరంబుగా దదియునుంగాక, యిపుడు విచారించి సేయు ప్రకారంబునుం జెప్పెద. విజిగీషుండై ప్రవర్తిల్లువాఁడు, విజితక్రోధుండై గరిష్ఠంబైన భావికార్యంబు ఫలవంతంబగునట్లుగా విచారించి తనపురుషకారం బనుకూలోపాయ విషయప్రవర్తకంబుగాఁ జేయునది. అది యట్లుండె. సమర్థుండైనవాఁడు విజితక్రోధుండు గావలయుసేయని యుంటివేని. ౧౧౯.

చ. ఉదయముఁ బొందఁగోరినన్న ♦ హోత్తముఁడొప్పు వివేకబుద్ధిచే
మొదల నెరోషజంబగుత ♦ మోగుణముద్వ్యజయించుటుత్తమం
బదియెటులంటివేనియుద ♦ యంబగుభానుఁడుముందుగానెతా
సదమలకాంతిచేఁదిమిర ♦ సంఘముఁబాపుచువృద్ధినొందుగా. ౧౨౦.

క. బలహీనుఁడైనవానికి, నలవడునీరీతిఁజేయ ♦ నధికబలుండై
వెలసెడువానికిఁగ్రోధము, వలనసెజయుమానటంచుఁ ♦ బలికెద వేనిన్. ౧౨౧.

మ. బలవంతుండగునేనియెవ్వఁడిలఁగో ♦ పప్రాప్తహూతాసనం
బులయంబొందఁగఁజేయఁడో యతఁడెపో ♦ మూర్తిశశాంకాంశువుల్
పొలియంజేసెడుకృష్ణపక్షముక్రియం ♦ బోఁగొట్టుఁనానెంతయున్
లలితంబైనత్రిశక్తిసంపదలనె ♦ ల్లంగార్యహీనంబుగాన్. ౧౨౨.

వ. ఇట్లుంగాక విచారించి సేయుప్రకారంబునుంజెప్పెద. ౧౨౩.

క. సమయంబగుతఱిసెవ్వఁడు, సమముగమృదుతీక్ష్ణవృత్తి ♦ సలుపునతఁడుదాఁ
గమలాప్తుపగిదిలోకము, విమలంబగుతేజమునను ♦ వినుమువసించున్. ౧౨౪.

సీ. ఈరీతి నెంతయు ♦ నెంచిసేయకయున్నఁ, జిరకాలమునువశీ ♦ కరములగుచుఁ
నొలఁగకసంపదల్ ♦ నిలుచుటయెక్కడ, కల్లరితేజీల ♦ కరణిఁజంచ
లములైనపంచేంద్రి ♦ యములవశ్యంబేడ, రెండునునొకచోట ♦ నుండవరయ
నదియెట్టులన్నను ♦ నతిచంచలతబహు, వ్యాజప్రవర్తనం ♦ బరఁగుచుండు
సంపదలనిర్జితేంద్రియ ♦ సమితిచేత, నరసిలె స్సగరక్షింప ♦ నలవిగావు
పురుషమినొకవేళఁబొందిన ♦ పొందుగాని, నిలిచియుండవువినుమవి ♦ నీతునొద్ద.

ఆ. ఇట్లుగావునసమ ♦ యేతరంబగువేళ, నుదరిపడుచుఁగ్రోధ ♦ ముత్కటముగఁ
జేయుచీవుధైర్య ♦ జితపయోనిధివిష్ణు, పెద్దజేసెదేల ♦ బేలవగుచు. ౧౨౫.

ఆ తనకుఁజెల్లియుండెఁ ♦ దానిట్టులేటికి, నింద్రియములనిగ్ర ♦ హింపవలయు
ననుచుఁబల్కెదేని ♦ యనిలతనూభవ, వినుము తెలిపెదేను ♦ విశదముగను. ౧౨౬.

మ. ధరశాస్త్రజ్ఞులునయ్యుదేహజనితాం ♦ తశ్శత్రులైనట్టియా
యరిషడ్వర్గము నెవ్వరేనణఁపరో ♦ హంకారత న్వారెపో
మతిదుష్కీర్తినిబొందఁజేయుదురు సం ♦ పల్లక్ష్మిశీఘ్రంబుగా
నరిషడ్వర్గము గెల్వనట్టిపతికి న్ ♦ బ్రాపింపవా సంపదల్. ౧౨౮.

వ. అట్లుగావున. ౧౨౯.

చ. సమయముగాని వేళభువి ♦ సాధనభూతములౌ యుపాయమీ
నముగను స్వాత్మవిగ్రహము ♦ నఃపరితాపకమై జనించుక్రో
ధమును బరిత్యజింపుమఱి ♦ తక్కినయట్టిజనుండునుం బలెన్
విమలతఁగార్యసిద్ధిఁగను ♦ విక్రమశాలికి నీకు నర్హమే. ౧౩౦.

వ. అని మఱియును సాధనోపాయంబు వివరించువాఁడై యిట్లనియె. ౧౩౧.

చ. ఎనయఁగభావికాలఫల ♦ హేతుకమైరిపునాశకారియై
తనరుచు భూరికర్మఫల ♦ దాయకమైయనపాయయుక్తమౌ
ఘనతరసాధనంబుమఱి ♦ కల్గదుబోమది నెంచిచూడఁగా
వినుము తితిక్షకున్ సమము ♦ వీరవరోత్తమ వాయునందనా. ౧౩౨.

క. మనమిపుడుశాంతినిశ్చయ, మనియున్నవిలంబమాట ♦ నవనిపులెల్లన్
వినుమీలోన నెచుర్యో, ధనునకువశులౌదురంచుఁ ♦ దలఁచెద వేనిన్. ౧౩౩.

చ. మనమునవీడనాడిమఱి ♦ మానధనాఢ్యులులోకపూజ్యులున్
అనఘులునైనయట్టియుల ♦ యాదవవీరులునమ్రపూర్వులై
మనమునవేఱులేకెపుడు ♦ మక్కువతోడుతనాసుయోధనుం
గొనకొనికాలమున్ గడుపు ♦ కోసముగాకను సూర్చియుందురే. ౧౩౪.

చ. ఎలమినివారుగల్గమన ♦ కెద్దియుసాధ్యముగానియట్టిదిం
గలుగదటుండనిమ్మదియుఁ ♦ గాకతదాప్తులుమిత్రవర్గమున్
గులజులువారుమాటకను ♦ కూలురయిప్పుడుజీవితార్థమై
కొలుతురుధార్తరాష్ట్రునను ♦ కూలురఁబోలెఁబ్రతీక్ష్యచిత్తులై. ౧౩౫.

క. ఎనయఁగనిటువలెనయినన్, మనకునుసమయంబుగాదె ♦ మాస్తుఱమీఁదన్
గొనకొనికార్యముసేయఁగ, ననువుగదండెత్తనిప్పు ♦ డనియంటేనిన్. ౧౩౬.

సీ. చలమునమనతోడ ♦ సమయనిర్ణయుఁడైన, దుర్యోధనునిమీఁదఁ ♦ దొడరిమనకు
నెప్పుడుసమయమా ♦ నప్పుడుదండెత్తి, నిపుడుచెప్పినరాజు ♦ లెల్లఁగూడి

తరణిచేతవిభాగ ♦ తనుబొందుకమలాక, రములుబోలెనుభేద ♦ గమితులగుచు
మనతోడనిలుతురు ♦ మఱియుదక్కినరాజు, లనుకూలమగుదురే ♦ య నెదవేని
కడఁగిదుర్యోధనునిమద ♦ గర్వమునను, జులకగాఁజూచునటుగాన ♦ సులభముగను
భేదపఱుదురదెట్లన్నఁ ♦ బృథివిలోన, బ్రకృతిజనుఁడునునవమాన ♦ పడఁడుగాన.

ఆ. శౌర్యవంతులైన ♦ జననాథులైనచోఁ, జులుకదనము నోర్చి ♦ కొలిచియుండ
రనుచుఁజెప్ప నేల ♦ యటుగానవారల, భేదపుచ్చవచ్చు ♦ వేగిరంబె. ౧౩౮.

చ. కరము సుయోధనుండుమద ♦ గర్వముచేతను గొల్చువారలన్
గురుతరవృత్తిఁజూడఁడని ♦ కొంకకపల్కితిపిష్టమున్వనే
చరుఁడటు దెల్పఁడేతనదు ♦ సభ్యులనుంబలెఁజూచునంచున
ట్లరసెడువాఁడు నేఁడుమద ♦ హంకరుఁడెట్లగునంటివేనియున్. ౧౩౯.

ఉ. ఆరసికృత్యవర్తనము ♦ సాంగతఁజేయనియట్టియాయహం
కారులసంపదల్వినుము ♦ కార్యవశంబున నాదరార్థమై
వారితవేగమామదము ♦ వర్థితమైకనుపట్టఁజేయఁగాఁ
గారణమానుసమ్మదియుఁ ♦ గాకను వెండియు నెంచిచూడఁగన్. ౧౪౦.

ఆ. చనమదాత్తమాన ♦ సమున వెంగలియగు, నృపతిమూఢుఁడగును ♦ నిజముగాను
నృపతిమూఢుఁడైన ♦ నీతిహీనుండగు, నీతిరహితుఁజులుకఁ ♦ జూతురవని. ౧౪౧.

వ. అట్లు గావున. ౧౪౨.

ఉ. ఓలిమదంబుచేవికల ♦ మొందితనంతపలాయమానమా
మూలబలంబుగల్గురిపు ♦ భూపతినిన్నతిమారుతాహతిన్
మూలము లెల్లఁగూలఁగను ♦ బొందిచలించెడుభూరుహంబునుం
బోలెసహిష్ణుఁడమ్మెయినె ♦ ముట్టివధింపవలంతియోఁగడున్. ౧౪౩.

క. అంతర్భేదముఁబొందిన, యంతనెరిపులెట్లుసాధ్యు ♦ లౌదురటంచున్
జింతించిపల్కితేనది, యంతయువివరింతుఁ దెలియు ♦ మనిలతనూజా. ౧౪౪.

చ. అరయఁగనాప్తవర్గజని ♦ తాగ్రహ మెంతయునల్పమైననున్
జెఱచును భూపతిన్నిజము ♦ శీఘ్రము గానదియెట్టులంటివా
తరునికషప్రభూతశిఖి ♦ తప్తముగాఁగమహీధరంబుదా
నురువడిఁగాల్పదేవినువృ ♦ కోదరయంతయుమూలముట్టుగన్. ౧౪౫.

క. ఎనయఁగనిటువలెనైనను, మనుకొనిశాత్రవుఁడువృద్ధి ♦ పొందుచునుండిం
గనుఁగొనుచునూరకుండఁగ, నొనరునెయానియంటివేని ♦ యనువినుమనఘా. ౧౪౬.

క. మతిమంతుఁడనీతిరిపుఁ, గ్రతియోర్చునునీతిహీన ♦ నరనాథసము
న్నతిమతివిపదంతమగుఁగ, నతనిజయింపంగసుకర ♦ మయ్యెడికతనకా. ౧౪౭.

వ. ఇట్లు దుర్నీతుండైన శాత్రవుఁ డెట్లు సాధింపవచ్చునని యంటివేని. ౧౪౮.

చ. వెలయులఘుత్వవృత్తికడు ♦ భేదితులౌసుహృదాదిబాహ్యులుఁగ
అలసచివాదులైనతన ♦ యాప్తులుగల్గువిపక్షభూపమం
డలముసమీపజైత్రనర ♦ నాయకుఁడాఁగినదీరయంబుదా
గులగులలై నెరల్విడుచు ♦ కూలమునుంబలెఁదాహరించుఁగా. ౧౪౯.

క. ఈకరణిరిపులఁదునుమఁగ, నాకులపడుభీమునకున ♦ నాకులముగఁదా
సాకల్యంబుగనయబో, ధాకరణము సేయుచుండు ♦ ధర్మజుకడకుఁగ. ౧౫౦.

సీ. అతులితకరుణార ♦ సార్ద్రవీక్షణముల, వివిధమామృగపక్షి ♦ వితతినెల్ల
వశముగాఁజేయుచుఁ ♦ బాపసంచయుదాహ, కంబునుదర్శనీ ♦ యంబునగుచు
దిక్కులవెలుఁగొందు ♦ దివ్యతేజంబును, ధరియించియాశ్చర్య ♦ కరముగాఁగఁ
బుణ్యసంచయమెల్ల ♦ మూర్తివహించిని, ల్చినరీతివాంఛిత ♦ సిద్ధిఁబోలె
నాగమోద్ధారియుతులత ♦ పోధికుండు, పరమతత్త్వజ్ఞుఁడగుపరా ♦ శరతనూజుఁ
డర్థి నేతెంచినిలిచెఁబ్ర ♦ త్యక్షముగను, ధర్మసూనుండుజూచిసం ♦ తసమునంద.

వ. ఇట్లేతెంచిన వేదవ్యాసమహామునిం గాంచి యా ధర్మనందనుండు సంతోషభరితాంతఃకరణుం డగుచు, మేరుమహీధరశిఖరంబునఁబొల్చునరుణకిరణ ప్రభాభిరాముం డగు భానుండునుంబోలె, విధూతతరుణపల్లవాగ్రుం డగుచు సమున్నతకాంచన సింహాసనంబు దిగ్గన డిగ్గి యప్రమత్తుండై యమ్మహానుభావు విధ్యుక్తప్రకారంబునఁ బూజించి యనంతరంబ తదనుజ్ఞాతుండై శాస్త్రంబుల నలంకరించుశాంతియునుంబోలె, నాత్మసింహాసనాసీనుండై దరహాసప్రభావిభాసితాధరోష్ఠుండును, వికీర్ణధాముండునునై చెలువొందు నత్తపోధనసత్తమున కభిముఖుండై తేజోవిరాజితుండైన బృహస్పతిసన్నిధానంబున నొప్పుసంపూర్ణచంద్రు ననుకరించుచు నాహ్లాదకరోర్ధ్వప్రసారితాంశుజాలోన్నతుండును, పిశంగానిలజటాధరుండును, విద్యుత్సంకలితాంబుదసంకాశదేహుండును, సమగ్రసౌమ్యతావిటపిచ్ఛాయాశీతలుండును, వపుఃప్రకర్షతాపరిచితజనమనస్సంజాతస్నేహార్ద్రభావుండును, శాంతస్వరూపప్రకటితవివిక్తాంతఃకరణవ్యాపారుండును, ధర్మప్రతిపాదకాఖుచ్ఛిద్రశ్రుతిస్వరూపుండును, సుఖోపవిష్టుండును, కరుణాకటాక్షవిరచిత కుశలప్రశ్నుండునుంబోలెఁ బ్రకాశించు నమ్మహానుభావు రాకకుం గారణంబు తెలియ నిశ్చయించినవాఁడై యిట్లనియె. ౧౫౨.

క. మునినాథపుణ్యహీనుల, కనయముఁబొందంగరాక ♦ నపగతరజమై
కనుపట్టుమీదుదర్శన, మొనరెనుపితాభవప్రాప్తి ♦ యనుబోలెఁగడున్. ౧౫౩.

సీ. క్రతుకర్మములుకోరి ♦ కలనీగసాగెను, బ్రహ్మాశీర్వాద ♦ ఫలితులైరి
భవబంధములనెల్లఁ ♦ బాసినేనెంతయుఁ, బూజ్యుండనైతిని ♦ బుడమిలోనఁ
బరమేష్ఠివలెజగ ♦ ద్గురువనైవిఖ్యాతి, నెలకొన్నవరతపో ♦ నిధినిబరమ
శాంతుసాక్షాద్భగ ♦ వంతునాగమవిభా, గునినిన్నునేఁడుగ ♦ న్గొనుటకతన
సంపదలుహెచ్చెఁబాపముల్ ♦ సమసెసుఖము, లెదురుకొనెఁగీర్తిదిక్కుల ♦ నెల్లనిండె
నేమిఫలమింకరానున్న ♦ దోమహాత్మ, మిన్నకయెపోవునేనేను ♦ మిమ్ముఁగనుట.

చ. అమృతమరీచిఁజూచియును ♦ హర్షముఁబొందనిచక్షురింద్రియం
బమరఁగనిన్నుఁజూచిముద ♦ మందెడినేఁడిదెచిత్తముంగడున్
బ్రమదముఁబొందెబంధువులఁ ♦ బాసినదుఃఖముఁబోవనాడుచున్
శమదమసత్యతత్త్వరుచి ♦ సారపరాశరమానినందనా. ౧౫౫.

ఆ. నిస్పృహాత్ములైన ♦ నీయట్టితపసుల, కేమునేయునట్టి ♦ దేమిలేదు
ఐననీదుపలుకు ♦ లతిశుభంబులునాకు, హితముగానవినఁగ ♦ నిచ్చపుట్టె. ౧౫౬.

క. అనవుడుఁగృష్ణద్వైపా, యనుఁడిట్టులువిజయకాంక్ష ♦ నతివినయమునన్
గొనియాడుచుండునయ్యమ, తనయునితోఁగూర్మిమీఱఁ ♦ దానిట్లులనున్. ౧౫౭.

వ. ఇట్లు పలుకందొడంగినవాఁడై యా తపోధనుం డాత్మీయంబైన యానుధ్వస్తదోషంబు
పరిహారంబుసేయువాఁడై యిట్లనియె. ౧౫౮.

సీ. వినుధర్మనందన ♦ మనమునసిహపరం, బులయశోభూషణ ♦ మునుఘనంబు
నైనసంపదఁబొంద ♦ నభిలషించినవారి, కాత్మబంధువులందు ♦ ననవరతము
నొప్పఁగాసమవృత్తి ♦ నుండుటయుడియుక్త, మందులోఁదపసుల ♦ కరసిచూడ
నిజముగావలయును ♦ నెటెనట్టులయిననేఁ, డనఘనీగుణవిశే ♦ షాతిశయము
కతననీమీఁదికూరిమి ♦ గడలుకొనఁగ, నిరుపమానందవైభవ ♦ భరితమగుచు
నిలిచియున్నదియిట్టట్టు ♦ చొలఁగకిపుడు, నాదుహృదయంబునీయుధీ ♦ నమునుజెంది.

ఆ. ధరవిరక్తులైన ♦ తపసులకిట్లెల్ల, పక్షపాతమనుచుఁ ♦ బలికెదేని
మొనసినిస్పృహులకు ♦ మోక్షకాములకును, నరయఁబ్రీతిగుణుల ♦ యందెకాదె.

వ. అని మఱియును నా ధర్మనందనుగుణాతిశయంబును, ధృతరాష్ట్రదుశ్చరితంబునుం
బ్రకటించి యుత్సాహంబుపుట్టించువాఁడై యిట్లనియె. ౧౬౧.

క. మీరలుధృతరాష్ట్రునకుఁగు, మారులుమతిఁగారొబుద్ధి ♦ మంతులుగారో
యూరకవిడనాడెనుమిముఁ, బోరుచుభోగేచ్ఛమోహ ♦ మునుజేయునెకా. ౧౬౨.

మ. అనయంబీగతిమూఢచిత్తునకున ♦ ర్థావాప్తియత్నానదే
ట్లనిసన్ సౌబలకర్ణముఖ్యకృత ♦ కార్యాధీనుఁడైనాఁడుదు
ర్జనసంసర్గజితాంతరాయమునుని ♦ స్సారంబునాపత్వదం
బునుగాన న్నతియర్థహానియులయం ♦ బుంబొందునాకష్టునిన్. ౧౬౩.

చ. పాడిఁదొఱంగిద్రౌపదిని ♦ బాములఁబెట్టఁగవద్దనంగనో
రాడకయూరకేసభికు ♦ లందఱునుండఁగనీవువారిపైఁ
గీడుదలంపకుండితివి ♦ కేవలశాంతినయిట్టినీకుఁజే
కూడదెకార్యసిద్ధినయ ♦ కోవిదపాండవవంశవర్ధనా. ౧౬౪.

చ. నిరుపమశాంతశీలునకు ♦ నీకునమిత్రులునాత్మలీనమై
పరఁగుమహోపకారమునఁ ♦ బ్రాప్తమెఱుంగకక్రూరబుద్ధిమై
నెరయఁగఁజేసిరందునను ♦ నీమతిశీలమతిప్రకాశమై
కరముప్రసిద్ధికెక్కెనుప ♦ కారులెపోమతినీకువారలున్. ౧౬౫.

చ. చటులపరాక్రమంబునవ ♦ శంబగుభూమియదెట్టులంటివా
పటుబలశౌర్యబాణములఁ ♦ బ్రస్తుతికెక్కినవారుశత్రులీ
వటువలెఁగావునన్వినుమ ♦ హత్తరయత్నముసేయనొప్పను
త్కటమగుబల్మిగల్గునెడఁ ♦ దావిజయావహలక్ష్మిబొందుగా. ౧౬౬.

వ. అదియునుంగాక. ౧౬౭.

చ. ఇరువదియొక్కమాఱుధర ♦ ణీశులఁగొట్టినయట్టిమేటిస
ద్గురుఁడనిజామదగ్న్యునకుఁ ♦ గొంకకెదిర్చియునంబకైకడున్
దురమునఁబాఱఁదోలితన ♦ దోర్బలమాగురుఁడాత్మలోనన
చ్చెరువడియెంచునట్లుగను ♦ జేసినభీష్మునిగెల్వశక్యమే. ౧౬౮.

మ. అదిగాకాతనికెంచిచూచిననిజా ♦ త్మాయత్తపంచత్వమం
చెదలజ్జించుచుశక్తిలేకజముఁడు ♦ న్నెంతేపరాభూతుఁడై
మదిభీతిల్లునునట్టిభీష్ముఁడనిభీ ♦ మంబైనవిల్ద్రిప్పుచున్
గదియన్భీతిఁదొలంగకేరునిలువం ♦ గానోపువారీధరన్. ౧౬౯.

చ. రణమునను గ్రసాయకప ♦ రంపరలన్నిణుఁగుల్గ్రక్కుచున్
గణఁకనుజంచలోజ్జ్వలశి ♦ ఖల్ఘనజిహ్వలయట్లుగాఁగఁదాఁ

గణఁగి జగంబు భ్రమింగు బలు ♦ కాంతునమండు యుగాంతవహ్ని నాఁ
దొణఁగి మహోద్ధతిన్ నడుచు ♦ ద్రోణుని నైనను నోర్వ శక్యమే. ౧౭౦.

మ. పరమాటోపనిరస్తధైర్యరిపుభూ ♦ పాలుండు శూరుండు స
ద్గురుభావాశ్రితజామదగ్న్యుఁడు లస ♦ త్కోదండుఁ డాకర్ణునిన్
బరఁగం జూచి సుసంస్తుతంబగు భ ♦ య్యప్రాప్తిన్ వెసం బొందుచున్
బసు వెత్తున్మతి మృత్యువే నియతని ♦ న్మర్దింపఁగా వచ్చునే. ౧౭౧.

వ. అనిపల్కి తదనంతరకరణీయంబగు కృత్యంబును నిజాగమనప్రయోజనంబునుం దేట
పఱుచువాఁడై యిట్లనియె. ౧౭౨.

మ. విను దేవాధిపమంత్రరూపమగు నీ ♦ విద్యన్ దపోవర్తివై
ఘనమౌ పాశుపతాదిదివ్యశరశి ♦ క్షం బొంది శూరుండవై
పెనుపన్ శక్రతనూజు చేత నిపుడీ ♦ భీష్మాదులెల్ల న్రణం
బున ప్రమందంగల రీవు జూడఁగను ని ♦ ర్మూలంబుగా నందఱున్. ౧౭౩.

మ. ధరణీనాయక నీకు నేఁడు సుమహ ♦ త్త్వప్రాప్తికై దేవతా
వరమంత్రాంకితమున్ మహత్తరసుర ♦ వ్రాతప్రసాదోదయ
స్థిరసామర్థ్యము నైన విద్య ఫలసి ♦ ద్ధింబోలె నే నీయఁగా
నరయం బాత్రుఁడ వీవె యంచు మదిలో ♦ హర్షించి యేతెంచితిన్. ౧౭౪.

శా. ఈరీతిం దగ నెంచి పల్కుచును నెం ♦ తే నింబ్రసన్నాత్ముఁడౌ
పారాశర్యుని సన్నిధానమునకున్ ♦ బ్రత్యుద్గతస్వాంతుఁడై
శూరుండగ్రజుఁ డేగుదెంచెఁ బ్రియశి ♦ ష్యుండుం బలెం బొమ్ము చే
కూరం జేయుమటంచు ధర్మజుఁడు దాఁ ♦ గూర్మిం దగం బల్కఁగన్. ౧౭౫.

వ. ఇట్లేతెంచిన యనంతరంబున. ౧౭౬.

ఉ. వ్యాసముఖంబున న్వెడలి ♦ వహ్నికణోజ్జ్వలగౌరవర్ణమై
వాసవమంత్రరూపమున ♦ వార్తకు నెక్కిన విద్య యగ్రజనో
ద్భాసితవక్త్రమధ్యమునఁ ♦ బర్వుచుఁ బొందె దినోదయంబునన్
భాసిలు సూర్యదీప్తి విరి ♦ పద్మమునుం బలెఁ గాంతిపుంజమై. ౧౭౭.

చ. ప్రకటముగాఁగఁ దన్నియమ ♦ భాసురయోగవిధోపదేశమున్
అకలుషసత్ప్రభావమున ♦ నప్పుడె సేసెఁ దదీయసిద్ధిచేఁ
బ్రకృతిమహత్తులన్విదిత ♦ భావము గన్పడె మూలముట్టుగా
వికసితమయ్యె నానగువి ♦ వేకము దృష్టియు నద్భుతంబుగన్. ౧౭౮.

చ. ఒనరఁగ నామునీంద్రుఁడుజ ◆ యోదయ మైనతపస్సమాధిఁబా
ననువుగఁ గూర్పఁగాఁ దలఁచి ◆ యాత్మకు నెంతయుసానుకూల మై
తనరుచు భూరిలాభకథి ◆ తంబగు నాకృతిఁ దాల్చియున్న య
ర్జునునకు నిట్లనున్నియమ ◆ సూచక మైతగునట్టులెంతయున్. ౧౨౯.

శా. ఏనీ చెప్పినయోగమార్గమున నెం ◆ తేసుప్రకాశుండవై
మౌనాభ్యాసులపద్ధతిన్ దెలిసినీ ◆ మార్గంబ దెవ్వారికి
న్గానన్రాకనిగూఢ మైపరఁగఁగా ◆ స్నానోపవాసవ్రతా
నూనంబైనజపంబులన్ సలుపుమీ ◆ సోగ్రాస్త్రిశస్త్రుండవై. ౧౩౦.

చ. పరభసవృత్తినింద్రునిప్ర ◆ సన్నతఁ గోరుచు యోగనిష్ఠచేఁ
బరఁగఁగ నీవు సేసెదుత ◆ పంబున కుందగు నింద్రకీలమున్
సురగిరిదానినీక్షణమె ◆ చూపఁగలండి దెవీఁడెయక్షుఁడం
చను దుగఁ బల్కి నిల్చె నొక ◆ యక్షుఁడు దానపుడద్భుతంబుగన్. ౧౩౧.

క. ఇప్పగిదినప్పగించుచు, నప్పుడెయామానియరిగె ◆ నంతర్హితుఁడై
తప్పకమునియాజ్ఞయుఁబలె, నప్పార్థుని ప్రోలనిల్చె ◆ నయ్యక్షుండున్. ౧౩౨.

వ. అంత. ౧౩౩.

మ. నయమొప్పంగను యక్షుడుం బ్రణతుఁడై ◆ నవ్యానురాగంబుచేఁ
బ్రియవాక్యంబులు పల్కుచుండు నరుతోఁ ◆ బ్రీతాత్ముఁడై స్నేహమున్
నియతాత్ముం దగఁ జేసె నంతట నెయా ◆ నే సంగమం బెట్టు సం
శయమున్న న్మతి సాధుసంగమమునన్ ◆ సమ్యక్కృతంబౌఁగదా. ౧౩౪.

ఉ. అంతట నింద్రసూనుఁ డుద ◆ యాస్థితికై యెడఁబాయుచుండ భా
స్వంతుఁడు నట్ల నేచనఁగఁ ◆ జారు బృహద్ద్యుతి మేరుపీరుధా
భ్యంతరసీమలం బలెయ ◆ మాత్మజుఁడాదిగఁ బొందవేయులన్
గొంతతమంబు బొందెమది ◆ గొంకుచుఁదాఁ బ్రసభాత్మలాభమై. ౧౩౫.

సీ. రమణీయ కార్యగా ◆ రవవిలోకనతము, స్పరిహరింపంబడి ◆ తిరుగ భ్రాతృ
వాత్సల్యమునఁ బొందఁ ◆ బడివారియందువి, భాజ్యమానంబుగాఁ ◆ బ్రాప్తమైన
యాదుఃఖమతిభార ◆ మైనదేనివిభాగ, ములఁబొందుకతమునఁ ◆ జులక నైన
యట్లువారికిఁ దోఁచి ◆ యతిధైర్యమునఁ బరా, శరవాక్యసామర్థ్య ◆ గరిమ నెమ్మిఁ
బరుల చేఁబుట్టుతీవ్రకో ◆ పమునవరుని, శూరతయు నెంచుకొనుచుండు ◆ వారియందు
నెంచిచూడంగనాస్పద ◆ మింతయైనఁ, గలిగివసియింపఁగాలేక ◆ తొలఁగెనపుడు.

తే. తొలఁగిశోభిల్లువారల ♦ నలుగురినిని, బగటిజాములనాల్గింటి ♦ బలెనువిడిచి
యంధకారంబునిశిఁబొంది ♦ నట్లుకృష్ణ, నేక మైపొందెనాఖేద ♦ మెల్లఁగూడి.

మ. అపుడా ద్రౌపదిచూచు ప్రేమయధికం ♦ బైనన్ సబాష్పంబునై
చపలోత్ఫుల్లతుషారతోయకణసం ♦ చ్ఛన్నోత్పలాభంబునై
విపులంబౌకనుదోయిమీలనము గా ♦ వింపంగలేదయ్యెఁబా
ష్పపరిస్రావముబుట్టదానదొసఁగుల్ ♦ ప్రాపించునానెన్నుచున్. ౧౮౮.

చ. అకలుషితానురాగసుర ♦ సాంచితమున్ లలనార్పితంబునున్
బ్రకటితదృక్ప్రియంబునగు ♦ ద్రౌపదిచూపపుడగ్రజుండుదా
వికసితమానసాంజలిని ♦ వేడుకతోడుతఁగూర్మిమీఱఁగా
సకలమునుం గ్రహించెఁబథ ♦ సంబలముంబలెవాంఛితాత్ముఁడై. ౧౮౯.

వ. ఆ సమయంబున నవ్విజయుఁ న కభిముఖంబుగా నిలిచి కోపం బుత్కటంబుగాఁ జేయం
దలంచి. ౧౯౦.

తే. వనగజముచేతనాశర ♦ ద్వ్యాపినిబలె, విగతధృతిచేతమాలిన్య ♦ వేషయైన
ద్రుపదరాట్పుత్రికనీరు ♦ గ్రుక్కుకొనుచు, వరునితోఁబల్కెగద్గద ♦ స్వరముదొలఁక.

ఆ. పంకసన్నిభంబు ♦ పరులుచేసినయట్టి, కపటముననుమునుఁగు ♦ గౌరవంబు
నొగినిసంపదలను ♦ నుద్ధరింపఁగలవు, నీవుమమ్ముఁబాసి ♦ నిర్మలాత్మ. ౧౯౨.

క. ఆధులనెల్లనుదొలఁగఁగ, బాధించెడునీతపంబు ♦ పరిపక్వంబై
సాధింపఁబడినదాఁకను, మాధవుఁదలపోయుచుండు ♦ మదిఁగలఁగకుమీ. ౧౯౩.

చ. అతులయశంబుఁబొందసుఖ ♦ మందఁగనైనమనుష్యసంఖ్యదా
నతకరియింపనైనమది ♦ నాస్థదలిర్పఁగనిర్మలాత్ములై
సతతమునుండువారలకుఁ ♦ జయ్యనఁబొందునునర్థసిద్ధిదా
మతిననురాగియైనయల ♦ మానినియుంబలెఁదన్నిజాంకమున్. ౧౯౪.

సీ. వినులోకరక్షణ ♦ మునకుబ్రహ్మసృజించు, క్షత్రతేజంబెల్ల ♦ సమసిపోవ
నధికతేజోవంతు ♦ లనుమాటప్రాణనం, కాశాభిమానంబు ♦ నాశమొంద
నాప్తకృత్యంబంచు ♦ నచటిరాజులునంశ, యించినప్రమతనిచ్చ ♦ గించిమాడ
నతిదిగ్వికీర్ణమై ♦ యలభూవితానంబు, లెల్లనొప్పుయశంబు ♦ లేర్పడంగ
శూరకర్మంబువిఖ్యాతి ♦ చూఱఁబోవ, నాయతులుదూలమనకిపు ♦ డరులుసేయు
పరిభవమునిన్నునేఁడెడఁ ♦ బాయుకతనఁ, దలఁచిమదినుచ్చరింపను ♦ దరముగాదు.

తే. పాఁతగాయంబునలపునః ♦ ప్రహరణంబుఁ, గలసిబాధించుగతిదుఃఖ ♦ గతినిబొంది
పొనుఁగుపడుచున్న నాచిత్త♦మనఘ నేఁడు, కలఁచి వెతనొందఁగాఁజేయుఁ♦గలిగెమటల.

వ. అని మఱియును. ౧౯౯.

సీ. కొమ్ములుబోయిన ♦ కుంజరంబునుబోలె, విగతాభిమానత ♦ వికృతినొంది
రిపురాట్ప్రతాపాంత ♦ రితతేజమునశార, దాంబుదావృతవాస ♦ రాదిఁబోలి
స్వనిరర్థకతనజ్ఞ ♦ తనుబొందినట్లున్న, దివ్యాస్త్రములుబూని ♦ తేజరిలక
ఘనయశఃక్షయముచే ♦ గతజలాబ్ధినిబోలి, యన్యాకృతినిదాల్చి ♦ నట్టులగుచు
నీదుశౌర్యంబుబలమును ♦ నీఱుగాఁగఁ, దులువదుశ్శాసనుండీవ్వ ♦ ధూళిబ్రుంగి
దిక్కులేకున్నయీకురుల్ ♦ తెలియఁజూచు, చున్నవాఁడవుతొలివిజ ♦ యుండవైన.

సీ. ఇలలోనసత్పురు ♦ షులనుసంరక్షించు, నాతండెక్షత్రియుఁ ♦ డనఁగఁబరఁగు
రణకర్మములసమ ♦ ర్థంబైనవిల్లెతాఁ, గార్ముకంబనెడువి ♦ ఖ్యాతిఁగాంచుఁ
గానియీయర్థంబు ♦ లేనియీశబ్దాభి, ధేయజాతంబెల్లఁ ♦ దెలియకెపుడు
మోఘుఁడైయీశబ్ద ♦ ములప్రవర్తిలఁజేయు, నాతండేయీశబ్ద ♦ ఘాతుకుండు
గావుననునీవుక్షత్రియ ♦ గరిమఁగార్ము, కంబువిఖ్యాతినిల్పుచుఁ ♦ గడఁగిమమ్ముఁ
గావకున్నట్టియీయప ♦ ఖ్యాతియెల్ల, గతముగాఁజేసివిఖ్యాతిఁ ♦ గాంచుమనఘ.

వ. అదియునుంగాక. ౨౦౦.

క. వినునీగుణములుతేజము, ననుఁబాయుమనిప్రయోజ ♦ నతనీయుదయం
బునుగోరెదుమత్స్వామ్యం, బునఁబొందెదుఁదుల్యదుఃఖ ♦ ములుగలవిబలెన్. ౨౦౧.

వ. ఇంత యేమిటికంటేనిఁ జెప్పెద నాకర్ణింపుము. ౨౦౨.

చ. విమతులచేఁబ్రమాదమున ♦ వేధతనొందిగజవ్రజంబుచే
బ్రమసిసటావిలూనమగు ♦ భాసురకేసరిఁబోలెనున్నని
న్నమరఁగఁగార్యభారమిపు ♦ డర్కునివాసరలక్ష్మియుంబలెన్
మమతనుబొందియున్నదిన ♦ మధ్యఁడవౌటనుగానదూఱెదన్. ౨౦౩.

వ. అని యిట్లు ద్రుపదరాజనందన నిజపరిభవద్యోతకంబుగాఁ బల్కి తదీయప్రయాణ నిర్వహణహేతుకంబుగా నిట్లనియె. ౨౦౪.

మ. ధరలోనెవ్వఁడుతక్కుమానవులచే ♦ తంబొందఁగారానియా
వరసంభావనవర్థవంతముగన ♦ ద్వైశ్యపారతంజేయున
న్నునినింబొందవుసత్సభాస్థలులలో ♦ నన్బూరుపాధిక్యముల్
కరమొప్పంగనులెక్కవెట్టగనుసం ♦ ఖ్యాద్విత్వమింద్రాత్మజా. ౨౦౫.

మ. మదినీవిప్పుడుమమ్ముఁబాసి చనఁగా ♦ మామీఁదివాత్సల్యతన్
గదియున్ విఘ్నములెన్ని యేనవియుమ ♦ గ్నంబొందఁగా భక్తినీ
హృదయంబందునుపాస్తి సేయుమలదే ♦ వేంద్రుండు నీకెంతయున్
సదయుండై వెసఁ జేయుఁగాకతపమున్ ♦ సాఫల్యతన్ బొందఁగన్. ౨౦౬.

క. జనరహితమంగళస్థల, మున నొకఁడ వెయుండి మోస ♦ మునఁబొందకుమీ
వినుమత్సరరాగాత్ములు, చెనఁటులు సాధువులనైనఁ ♦ జెఱుతురు జగతిన్. ౨౦౭.

మ. అదిగానన్ మఱియుప్రమాదముననా ♦ వ్యాసోపదేశంబున
న్ముదమొప్పంగను వేగఁ జేసిదయతో ♦ మాకోర్కెలీడేర్పుమీ
తెరుదంచత్ఫలసిద్ధి నీవుకృతకృ ♦ త్యత్వంబునున్ బొందిరా
ముదితాత్మన్నినుఁ గౌఁగిలింతుఁ గుచముల్ ♦ మోవంగ నేనత్తఱిన్. ౨౦౮.

క. అనిపరిభవంబు మఱినూ, తనకృతమై తోఁచనిట్లు ♦ ద్రౌపదివల్కన్
వినికసలి యుత్తరాయణ, దినకరుఁడుంబోలె నరుఁడు ♦ దీండ్రించెఁగడున్. ౨౦౯.

ఉ. అంతటశత్రులందనని ♦ జాగ్రమునంగనుఁగొన్నయట్లుదా
నెంతయుభీషణాకృతివ ♦ హించెఁబురోహితదత్తశస్త్రిఁడై
వింతగసౌమ్యుఁడయ్యు నిజ ♦ విగ్రహమందుల మారణక్రియన్
మంతుకునెక్కినట్టిఘన ♦ మంత్రముఁబోలెఁ బ్రచండమూర్తియై. ౨౧౦.

వ. అంత. ౨౧౧.

సీ. ధౌమ్యుండుమంత్రపూ ♦ తంబుగానట్టిచ్చు, నిశితఖడ్గముఁగేల ♦ నెఱయఁదాల్చి
ప్రథితాస్త్రసంధాన ♦ పటుతరజ్యాకర్ష, ణామోఘమైనవి ♦ ల్లమరఁబూని
కవదొనల్ బిగియించి ♦ నవరత్నఖచితమై, యింద్రాయుధక్షుతుల్ ♦ సాంద్రతేజ
మునఁగ్రిత్తిచేతఁబో ♦ లెనుసారెఁగడుపుచు, తారకోజ్జ్వలనభో ♦ తరముమాడ్కిఁ
దనరుకవచంబుధరియించి ♦ ధనదభృత్య, విదితమాంగల్యహిమశైల ♦ పదవినడచె
నచటిమానులుధర్మజుం ♦ డనుపలేక, కొంతవెతఁబొందఁగా వారి ♦ కంతమొక్కి.

ఎ. ఇవ్విధంబున నవ్విజయుండు ప్రయాణోన్ముఖుండై చనుసమయంబున. ౨౧౩.

క. కురిసెనుబువ్వులవానలు, మొరసెను సురలోకదుందు ♦ భులతో దిక్కుల్
శరనిధిప్రియసూచకుఁడయి, వరుడుంబలెఁబొంగి వెడలి ♦ వసుమతిఁగదిసెన్. ౨౧౪.

వ. తదనంతరకథాక్రమంబు విన్నవించెద. ౨౧౫.

క. కరనిశితనఖవిదారిత, పరకాంచనకశిపువక్ష ♦ పాండవపక్షా
కరిరక్షా ఖలశిక్షా, నరభక్షణహరణదక్ష ♦ నరహర్యక్షా. ౨౧౬.

మత్తకోకిల. రాజహంసను నేత్రకోసల ♦ రాట్సుతావరపుత్రవి
భ్రాజమానసుగాత్రకౌరవ ♦ రాజపన్నగవేత్రది
గ్రాజసన్నుతసత్యకీర్తివి ♦ రాజమానచరిత్రస
ద్భోజరాజసుతామనోహర ♦ పూజ్యమానదయానిధీ. ౨౧౭.

గద్యము. ఇది శ్రీమదహోబలలక్ష్మీనృసింహకటాక్షలబ్ధకవితావిచిత్ర మౌద్గల్యసగోత్ర గోపాలునికులపవిత్ర భాస్కరామాత్యపౌత్ర వీరనమంత్రిపుత్ర పరమభాగవతపూజావిధేయ సింగయనామధేయప్రణీతం బైనకిరాతార్జునీయంబను మహాకావ్యంబునందుఁ బ్రథమాశ్వాసము.

# ద్వితీయాశ్వాసము.



క. శ్రీరాజితఘనవక్షా, సారాంబుజసన్నిభాక్ష ♦ సంయమిరక్షా
ధారాగరుడాధ్యక్షా, నారాయణనయవిచక్ష ♦ నరహర్యక్షా. ౧.

వ. అవధరింపు మవ్విధంబున నా ధనంజయుండు శుభనిమిత్తంబులు గనుంగొనుచు ద్వైతవనంబు వెడలి శరత్కాలోపశోభితంబై కూజద్రాజహంసమాలికాకాంచికయుఁ బరిపక్వసస్యాహితపాండుతాగుణంబునం బరిపూర్ణయౌవనంబున సఖీపరివృతయై యొప్పు ప్రియురాలుం బోలెఁ బ్రకాశించు జనసమీపప్రదేశంబు డాయం జని వినమ్రశాలిప్రసవాభిరామంబై యుపగతపంకిలత్వంబునుం బొందుచు, సకలంకపంకరుహసంకలితాభంబులై యుపాయనీభూతశరత్కాలసంపదలం బొదలు నుదారంబులైన యకృత్రిమకేదారంబులం గని యానందించుచు విస్మయాకులత్వంబునను న్మీలితాంభోరుహలోచనంబులైన సరోవరంబులచేతం దిలకింపంబడుచు, నిజాంగనావిలోకనవిలాసవిభ్రమానుకారంబులుగాఁ బొరలు శఫరీవివృత్తంబులయందుఁ జిత్తంబు హత్తించుచు, మఱియు సవారిజంబైన కేదారవారియందు విరాజమానంబగు శాలికామణీముకంబవలోకించి సుదుర్లభంబైన యనురూపసంగమం బింత యొప్పునేయని యుత్కర్షలక్ష్మీవిలాసంబు నగ్గించుచు, కింజల్కవిష్కృతఫేనపుంజోదకంబైన కంజంబులయందు రంజితస్థలపంకేరుహాశంకాంకురితమానసుండై తత్క్షణపాఠీనోల్లుంఠితోపలక్షితాంబువుల వలన నశంకితుం డగుచు, ననుదినక్షీయమాణంబులై పర్యాయక్రమంబునం బ్రకాంతరయంబులైన తోయంబులచేతం గృతోర్మిరేఖాకారంబులై నెరికలఁ జెలువారు వెలిపట్టుపుట్టంబులమాడ్కి నతిశుభ్రంబులై కనుపట్టు విమలనదీపులినంబులం గని సంతోషించుచుం జని చని ముందట. ౨.

సీ. భ్రూమధ్యముననుబు ♦ ష్పొడిమీఁదవింతగాఁ, దాల్చినబంధూక ♦ దళముఁగాంచి
యావకరసయుక్త ♦ మగుచునింపులుగుల్కఁ, బల్లవాధరశోభ ♦ నుల్లసింపఁ
గుదురుచక్కనిగబ్బి ♦ గుబ్బలునిండఁగా, మాటికిజల్లుతా ♦ మరసరజము
నెరసినచెమటచే ♦ వరపద్మరాగసం, కలితమౌక్తికహార ♦ గరిమ నెఱపఁ
గలితకర్ణోత్పలద్యుతుల్ ♦ గలసివెలయుఁ, జారురుచినేత్రి శుభగాత్రి ♦ శాలిగోప్త్రిఁ
గాంచికడు మెచ్చె నాశర ♦ త్కాలమహిమ, నేఁడు సాఫల్యమును బొందెఁ ♦ జూడననుచు. ౩.

వ. వెండియు.

ఆ. పోవుబీళ్ల మేసి ♦ పొదుగులబరువున, వేగఁబఱవలేక ♦ లేఁగలందుఁ
గూర్మిమీఱవచ్చు ♦ గోగణంబులఁగని, యాత్మలోనఁజాల ♦ హర్షమొంది. ౫.
సీ. కంటికింపగుశర ♦ త్కాలఘాసము మేసి, పొగరెక్కి సంపూర్ణ ♦ పుష్టిఁదాల్చి
శిరముఁగొంతటువంచి ♦ చిఱచిఱలాడుచుఁ, గాలుదువ్వుచుఁ బ్రతి ♦ గా నెదుర్చు
పరవృషభంబును ♦ బాఱఁదోలిఘణిల్లు, రను చుఱంకెలు వైచు ♦ కొను చుమీఱి
తటినీతటంబులు ♦ దఱిసియోరగనిల్చి, సెలవికొమ్ములఁ గ్రుచ్చి ♦ చిమ్ముకొనుచు
ధరణిలోపలఁగలయట్టి ♦ దర్పమెల్ల, విగ్రహముఁదాల్చియీరీతి ♦ వెలసినట్టు
లుఱుతరాటోపముననొప్పు ♦ చున్నయట్టి, కడిఁదియాఁబోతునొక్కటిఁ ♦ గాంచి యవల.
తే. మంచు తెరమాడ్కి శుభ్రమై ♦ మందగతిని, విచ్చిపోవుచునుండుగో ♦ వితతితోడ
గళితసుక్షౌమజఘనవై ♦ ఖురులఁదనరు, వరశరత్సింధుసైకత ♦ వ్రజముఁగాంచి. ౬.
తే. అవలఁజనుచుండిపశువుల ♦ యందుసోద, రాభిమానంబుతోవిధే ♦ యత్వమొంది
యలరుగృహములలోబలె ♦ నడవినాల, సరసనున్నట్టిగోపాల ♦ వరులఁజూచి. ౭.
వ. ఇవ్విధంబునం గనుంగొనుచుఁ దద్వ్రజాజిరంబులు డాయం జని. ౮.
సీ. నెఱితుమ్మెదలుమూఁగి ♦ దరహాసవర్ధిత, దంతకేసరములై ♦ తరళకుండ
లోపశోభితవహాచు ♦ నుదయాతపామృష్ట, పుష్కరనిభములై ♦ ముఖములలరఁ
గళితనిశ్వాసనం ♦ చలితాధరోష్ఠతఁ, జలదేకదళలతా ♦ సామ్యమొంది
హస్తాభినయలీల ♦ నాకర్షణములొప్ప, ఘటములుమద్దెళ్ల ♦ కరణిమ్రోయ
జలదరవమంచునెమళులు ♦ చెలఁగియాడ, బడలిపసివాడులోచనో ♦ త్పలములమరఁ
జలకుచజఘనలయినాట్య ♦ సఖులఁబోలి, చల్లలటుసేయువల్లవీ ♦ జనులఁగాంచె. ౧౦.
సీ. గట్టిపాఱినయట్టి ♦ కర్దమంబులమీఁద, సరగఁదోలినబండ్ల ♦ జాడలమర
సంతతగతులవి ♦ స్తారమైవర్షర్తు, విషమపద్ధతులెల్ల ♦ విడిచిపసులు
గవిసియిఱుగడలఁ ♦ గలయమేసినసస్య, సంపదల్ గలిగిన ♦ సరణివట్టి
జనపదంబులుడాయఁ ♦ జనియచ్చటననింద్య, కర్మభావేంగిత ♦ కనకరత్న
భూషణంబులచేనొప్పు ♦ పురుషవరులు, వెలయునాశ్రమమంటప ♦ ములనుబోలి
పుష్పహాసంబులలరంగఁ ♦ బొలుచురచ్చ, పొదలువెసఁగాంచెనారాజ ♦ పుంగవుండు.
వ. తదనంతరంబ వ్యాసోపదత్తుండై యనుగతగమనంబునఁ జనుదెంచుచున్న యక్షుండక్షి
గోచరంబగు తచ్ఛరత్సంపదం గనుంగొని యింగితజ్ఞుండగు వాఁడు సమయావసరం
బున నూరకుండుసేయని యపృచ్ఛాపరిభాషణశంకం బోనొత్తుచు, శరత్కాలోదయా
వలోకన కుతూహలుం డగుచున్న యర్జునున కిట్లనియె. ౧౨.

మ. జనసాథోత్తమనిర్జలాభ్రయుతమై ♦ స్వచ్ఛాంబుకల్లోలినుల్
దనరంగాశుభప్రైవదానఫలకా ♦ లంబుంబలెన్ లోకముల్
ఘనసాఫల్యతనొందఁజేసెడుశర ♦ త్కాలంబునీకెంతయే
ననుకూలంబుగఁజేయుఁగాకవిజయో ♦ ద్యల్లక్ష్మినింద్రాత్మజా. ౧౩.

సీ. అదెచూచితేదేవ ♦ నదులెల్లనౌద్ధత్య, రహితలైకనుపట్టె ♦ రమ్యలగుమఁ
బరిపక్వఫలములై ♦ పైరులెంతయునొప్పె, ధరయెల్లరహితక ♦ ర్దమతఁబొంచె
వర్షాగమాసక్త ♦ వాంఛయంతయువీడి, శరదృతువతిగుణా ♦ సక్తమయ్యె
ఘనపదంబుబలాక ♦ గమనంబులునునింద్ర, చాపనీలాభ్రసం ♦ చారములును
సారిదిలేకున్ననిర్మల ♦ స్ఫూర్తిచేతఁ, దనరుచున్నదియెట్లన్నఁ ♦ దనకుఁదానె
వెలయుచున్నట్టివస్తువు ♦ వేఱొతలఁప, నన్యగుణములఁదాఁగోర ♦ దనఘచరిత. ౧౪.

సీ. విగళితటిల్లతల్ ♦ వెలయునంతరమున, గళితకాంచనహార ♦ గరిమనెరప
నిర్జలత్వంబున ♦ నెఱయునభ్రతదుర్భ, లతనుబొందినపాండు ♦ రతనుదెలుపఁ
దనరుచుండెడుపయో ♦ ధరములుకుచలీల, నమరఁగావర్షర్తు ♦ వనెడుపతిని
నెడఁబాసివిరహాన ♦ నెంతయుఁగృశియించు, లలనలవలెదిక్కు ♦ లలరుచున్న
పలఘుచారిత్రశుభ్రాభ్ర ♦ కలితమగుచు, నవిగొకన్నుఁగొంటెకడువిస్మ ♦ యంబయారె
తలఁచివర్ణింపనీశర ♦ త్కాలమహిమ, తరమెయెవ్వారికైనను ♦ మఱియువినుము.

మ. మనరాహిత్యతనెంతయున్ వికలమౌ ♦ మాయూరపుంబల్కుపై
నిదెనేఁడిప్పుడువాంఛసేయదుమనం ♦ బెంతేనినావీనులున్
మదహంసస్వరలగ్నలయ్యెనదియె ♦ న్నంగాగుణవ్రాతముల్
విదితంబైననవప్రియాస్పదములై ♦ వీడుంగదాస్నేహమున్. ౧౬.

మ. జననాథోత్తమచూడుపెన్బొదరులై ♦ సంపూర్ణపాకంబులన్
వినుతంబైనపిశంగతన్వెలయుచున్ ♦ గేదారతోయాంతరం
బునవిస్ఫారునవాసితోత్పలఘనా ♦ మోదేచ్ఛనుంబోలెరా
జనముల్పంటలవాలియున్నవిజనుల్ ♦ సంతోషముంబొందఁగన్. ౧౭.

సీ. కలమాబ్జబిసదళ ♦ కాంతిసమ్మిశ్రత, వరపిశంగారుణ ♦ హరితరుచులు
నెరయఁగాఁగలిగిన ♦ చరదింద్రచాపఖం, డాభంబులైనతో ♦ యములుగాంచి
యేడాకుటనఁటుల ♦ నెగయుపుష్పాడిజాలు, పైఁటబోలెనుసారె ♦ మాటుకొనుచుఁ
గాటుకద్దీర్చిన ♦ కన్నులల్లార్చెదు, గతినెల్లగెంటెనుల్ ♦ గదలుచుండ

వెలయుకుసుమంబులనునవ్వు ♦ లొలుకుచుండ, గురుకుచంబులగతిఁబువ్వు ♦ గుత్తులమర
నలరుకచలీలఫుప్పంధ ♦ యములందనర, వనితలనుబోలువనపఙ్క్తు ♦ లొనరఁజూచి.

సీ. తటిదగ్నిదీప్తియిం ♦ తయులేకశుభ్రాంబు, దచ్ఛదచ్ఛాదితా ♦ తపములొలయఁ
బంకజామోదనం ♦ పర్కవాతోద్గత, తనుసీకరావృతాం ♦ తరతనలరు
కడుశుభంకరమునా ♦ గగనమార్గముఁజూచి, మిఱితొలుచుఁజేరి ♦ బారుదీఱి
యటునిటునన్యోన్య ♦ మరుదెంచురాయంచ, పదుపుపల్కులరీతిఁ ♦ బ్రబలుచుండఁ
గడఁగిమేఘావరోధని ♦ ర్గతములగుచు, నేటికన్యోన్యమునుజూచి ♦ మాటలాడఁ
గలిగెనంచునుభాషించు ♦ గతినిదిక్కు, లలరుఁగనుఁగొంటివేపార్థ ♦ యనుచుమఱియు.

చ. గొదగొనిబీళ్లనుండినిజ ♦ ఘోషములందలివాంఛమీఱఁగాఁ
గదుపులఁబాసిముందరను ♦ గ్రక్కనవచ్చినధేనుజాలముల్
నదయతలేఁగలంగలసి ♦ చన్నులవెంటనుబాలుగాఱుపెన్
బొదుగులగాన్కలుంబలెను ♦ మూర్కొనియిచ్చెడుఁగంటివేన్నృపా. ౨౦.

క. జగదేకపావనంబై, జగదుద్భవహేతుకమును ♦ సద్వాత్సయుతం
బగుధేనుసమితియొప్పెను, నగణితఘనమంత్రసంయు ♦ తాహుతిరీతిన్. ౨౧.

క. జితబర్హిణీస్వనాంచిత, తతమగుగోపీసుగీత ♦ తత్పరతనువి
స్మృతిఁజెందిమృగకదంబము, లతులితసస్యములుమేయ ♦ వవెకనుఁగొంటే. ౨౨.

క. ఆనతమైననుబర్హిని, తానిక్కయనాస్థచేన ♦ ధఃకృతిసేయన్
సూనశరతప్తకైవడి, ధీనుతకలమములుపొందు ♦ దీధితినొందెన్. ౨౩.

క. సరసిజరజములుజలశీ, కరములుపరిగొనెడువాయు ♦ గతిఁజెందివిప
త్పరివృతులగుదుశ్చరితుల, కరణినిభ్రమరములుగతులు ♦ గానవుకంటే. ౨౪.

సీ. పవడంపుఁదునుకల ♦ భంగినొప్పెడుచంచు, వులశాలిశిఖలెల్లఁ ♦ గలయఁగొఱికి
కఱచుకొనిపోవు ♦ వరశుకంబులుశాలి, పాలికలదలింప ♦ నొలినెగసి
బారుగావిరిగివే ♦ పఱచుచుఁజూపట్టెఁ, బక్షదీధితులాకు ♦ పచ్చగాఁగ
నరిచంచువులజిగి ♦ వసుసరక్తిమగాఁగ, సరవిఁదద్గతమైన ♦ శాలిశిఖల
జిగిపిశంగతనొప్పంగఁ ♦ జిత్రవర్ణ, కలితసాంద్రేంద్రచాపసం ♦ కాశమగుచు
నవిగొకనుఁగొంటివేయని ♦ యత్తుఁడిట్లు, పలుకుచుండంగఁదత్సమీ ♦ పమునసంత.

సీ. వెలయుజగములలోఁ ♦ గలతేజమెల్లను, రాశియైయొకచుపట్టు ♦ రమణదోఁపఁ
దపనమండలనిరో ♦ ధకమునైచెలువొందు, శిఖరకాంతులునభో ♦ ల్లిఖితమైనయ

విగళితజలభార ♦ విశదాంబుముక్సంచ, యంబకోయనివిష్ట ♦ యమునఁజూపు
నానసన్న ఘూముల ♦ నలరునల్లనివన, చ్ఛాయనీలాంబర ♦ సామ్యమొంద
నుపరిభాగంబున ♦ నొప్పమంచుకరళ్లు, చేతగౌరత్వవి ♦ ఖ్యాతమగుచు
సీరపాణివిధంబునఁ ♦ జెలువుమీఱి, యమరకిన్నరగంధర్వ ♦ యక్షముఖ్య
విరచితావాసమై చూడ ♦ నొఱపుమీఱు, హిమగిరీంద్రంబుగనుపట్టె ♦ నింద్రజునకు.

వ. ఇవ్విధంబునం గనుంగొని డాయం జని మేరుమహీధరవిజయదిగంతావలోకనరభసనభో
విలంఘనేచ్ఛాసముత్పతితం బైన తెఱంగున సమున్నతంబై భానుమండలప్రభావిభాసిత
పురోభాగనిబిడాంధకారసమాచ్ఛాదితాపరభాగం బగుచు లలితాట్టహాసనిరస్తతమ
స్తోమాగ్రతలానుగతగజాజినశ్యామలపరిధానాలంకృతశంకరోపమితంబై, యితరేతరా
దర్శితనరనభశ్చరసురనికరకృతవితతరుచిరతరవివిధమణిరచితభాసురావాసంబును, భుజ
గభూషణప్రభావప్రకటనార్థాభినిర్మితజగత్త్రయప్రతిబింబానుకారంబును, నాగేంద్ర
ధవళితనభోవ్యాపితజాంబూనదరాజివిరాజమానాపహసితసౌదామినీసహితశారదనీరద
సముదయాంచితశిఖరసముచ్ఛ్రితంబును, వివిధమణిగణఘృణిజాలపతాకాంశుప్రదీపి
తామర్త్యోపభోగితలతికాగృహోదితలతాకాంతకాంతారోపలాంతరగోపురోపశోభిత
నగరసంకాశప్రదేశంబును, ననవరతప్రవర్షితజలభారపాండురితాపవర్జితతటిద్గర్జితోభ
యపార్శ్వకటకసంవ్యాపితాభ్రనిచయోదితపక్షలక్ష్మ్యుపలక్షితంబును, నాకజగజవ్రజా
హతసంరుగ్ణసమవతారసమవిషమతటస్ఫుటతద్వ్యోగోపలక్షితోదకవికసితనిష్యంద
మకరందబిందుసందర్శనానందపరిభ్రమితమిళితభృంగసందీపితారవిందసందోహసము
ద్దీపితవివిధవిహారానుకూలకూలసంజాతమంజులనికుంజపుంజోపరంజిత శీకరనిరర్గళప్ర
వాహాభిరామనిర్ఝరోపశోభితంబును, అభినవసమున్నిద్రజపాకుసుమసంకాశప్రభాభి
శోభితపద్మరాగమణిగణోపరంజితహాటకకుడ్యకాదాచిత్కసానుసంకల్పితసంధ్యారా
గాభిరామధామంబును, ఆలోలనీలతమాలమాలికావిలాసకదంబనికురుంబసముజ్జృం
భితంబును, నీహారతుషారపరిప్లుతంబును, విస్తీర్ణకర్ణవ్యాపారసంజాతవాతోద్ధూత
మదగంధానుబంధబంధురపుష్పంధయసంశోభితగండస్థలముక్తికాభిరచితతనుత్రాణాయ
మాననీహారబిందుసందోహసమావృతోత్తుంగాంగాభిరామసముద్దండశుండాదండవిఖం
డితతరుమండలప్రకాండమదవేదండతండోపమండితంబును, నానావిధానర్ఘ్యమణి
ప్రభాభిరామసముత్తుంగశిఖరోపశోభితంబును, అపరిమితకుసుమితలతాగృహసంకలిత
ఘనగహ్వరప్రదేశంబును, కూర్మప్రపాదరాజహంససంచారసైకతనితంబసరోవరనాభీ
వివరచక్రవాకోరోజకంబుగ్రీవబిసబాహుజలజాతకరాననోత్పలపత్త్రనేత్రరోలంబమా

లాలకవేణీవేణికావిలసితయువతిసమానసమంచితసరిత్సంశోభితంబును, కుసుమశరనికరప్రవాళకుతారబాలకగదాసంకలితసుకేసరసైంధవసంశోభితమన్మథరథాయమానానూనసహకారాశోకతరుప్రదీపితంబును, కలక్వణితకాంచీవిరాజితవిబుధయౌవతపృథునితంబసంక్షోభితనదీవిలసితంబును, దయితాయమానలతికాకేసరవిసరాశ్రితదర్వీకరనికరోపశోభితంబును, బహువిధానర్ఘ్యమణిప్రభావిభాసురహేమపాండునికరశంకాంకురితేంద్రచాపసంకలితవిరహితజలశుభ్రగర్జితసంసూచితాభ్రవిభ్రాజితంబును, అనవరతవికసితారవిందసందోహసమాశ్రితకలకలాయమానమత్తమరాళమాలికావిరాజమానామలమానససరోవరోపశోభితంబును, ప్రకుపితాయమానదాక్షాయణీప్రణయకలహాసంయుక్తమనోవ్యాపారానుకూలవిహారమాణప్రమథగణపరివృతశంకరవిహారాలంకృతంబును, స్వర్లోకాభిముఖప్రజ్జ్వలితాయమానాదిత్యాదినవగ్రహనభశ్చరవిమానజాతౌషధిసముద్భూతకృశానుప్రతిక్షపానుస్మర్యమాణత్రిపురదాహబహుముఖభవసేవ్యమానానూనప్రమథగణోపరంజితంబును, గండోపలావరోధావర్తితసముచ్ఛ్రితవితతశీకరనికరపరివృతజలవిరచితామలచామరధారణక్రమసముపలక్షితసమున్నతసానుసమాహితానర్గళప్రవాహసంశోభితజాహ్నవీవిరాజితంబును, ఘుర్ఘురధ్వానాభ్యుత్పతనశాబకసమూహకబళీనాగతతరక్షుకులఘలాయమానప్రతిఘటితసమాహృతపునరాయాతశాద్వలఘనవనకేళీసమాచరణశ్రమజనితజలపానార్థనదీసమాగతతత్ప్రదేశవిశుద్ధాభ్యంతరప్రలీనస్థితకిరాతనిశాతశరాహతసంజాతక్రోధోద్ధతధ్వనితనిజయూథానుధావద్బహువరాహనివహాంచితంబును, దర్పోద్రేకసముత్పాటితపటువిటపచ్ఛటాకలితశుండాదండవిమండితమందోద్దండవేదండతండోద్భటఘీంకారసంకులంబును, పరస్పరవిరోధాభిముఖీకృతాభిఘాతితరుధిరవినిస్సృతాన్యోన్యశృంగవిదారితజర్ఝరీభూతదవదహనసహితనీలశైలసంకాశదీర్ఘదేహోపశోభితమదలాలసలులాయసముదయవ్యాకీర్ణంబును, ఉద్ధతశార్దూలధ్వానపలాయమానపృథుకసమూహసహితాభ్యుత్పతితానుధావద్గవిదితవిలోకితకురంగకులాకులప్రదీపితంబును, కంఠీరవనఖవిదారితమదకుంభికుంభస్థలవిగళితముక్తాఫలవ్యాపితతారకాకీర్ణగగనసంకాశశాద్వలప్రదేశప్రభావిభాసితంబును, అత్యంతక్షుధాసంకలితానతముఖవల్మీకవివరాంతరస్థితపిపీలికాసంగ్రహణార్థప్రసారితదీర్ఘజిహ్వాంచితధ్వనితబహులభల్లూకనివహాంచితంబును, సముద్ధతనిర్ఝరప్రవాహధ్వానమృదంగనాదప్రాంతలతికాలతాంతసంవ్యాపితమదబంధురపుష్పంధయఝుంకారగానప్రవర్తితనర్తకీసమానపరివర్తితవిస్తారితబర్హిబర్హనివహప్రకాశితంబును, తండోపతండదర్పోద్దండగండభేరుండశరభచమరికస్తూరికాఖడ్గగవయానేకవృకాదివివిధమృగమండలమండితంబును,

మదనగోపాలాక్రీడక్రీడాసమానాంతరాంతరాంగనావిలాసపుష్పితలతాపతాసూపశో
భితకృష్ణానుకారితమాలమాలికాపరిరాజితంబును, కమలకల్హారవిలసితకమలాకరతటస్థ
ఘనసారకదలీకోటివ్యాసితగిరిమల్లికాకుందగోస్తనీలతాలవల్యేలావల్లీసముల్లసితకాయ
మానాభ్యంతరచంద్రకాంతవితర్దికాసమంచితఋష్యాశ్రమసమాకీర్ణంబును నై మఱియు
ననేకవిధవిలాసంబులం జెలువొందుచున్న యస్తాపరిధరాధరారోహణంబు చేసి చను
చున్న యుపరంబునఁ దద్వోలోకనవిస్మయమానమానసుండై యనుగతగమనంబున వే
తెంచుచున్న యత్తుం డయ్యగ్రజున కిట్లనియె. ౨౭.

సీ. శీతగౌరోన్నత ♦ శిఖరనిర్భిన్నాంబ, రంబైనయీమహీ ♦ ధ్రంబుఁజూచి
నంతనేజనులకు ♦ నఘములెల్లను బాపఁ, జాలుదుర్లభమైన ♦ శాస్త్రిసులను
నేతత్ప్రభావము ♦ క్కింతయేవర్ణింపఁ, బనుఁగాని సకలంబు ♦ నొడువఁబడదు
పరఁగదిగ్వ్యాప్తమై ♦ పరమపూర్షుఁడుబోలె, నతివిపినాక్రాంత ♦ మగుచునొప్పు
చున్నవీనిమహిమ ♦ యుర్వీపతేశ్వర, యబ్జయోనికైనఁ ♦ దఖిలమునను
నెఱుఁగఁగానియన్య ♦ లెఱుఁగఁగలేరనా, ధన్యచరితచూడఁ ♦ దథ్యమింత. ౨౮.

చ. అతిరుచిరప్రవాళకును ♦ మాంచితకుంజకుటీరరమ్యమై
సతతవికాసితాబ్జవిల ♦ సత్కమలాకరరాజిచేతసం
తతమునువల్లభాంతికము ♦ నర్ధ్యతినుండెడుమానినీతతిన్
మతిగఱఁగించుచున్ బ్రియుల ♦ మక్కువఁగూర్చెడుఁగంటివేన్నృపా. ౨౯.

చ. సతతవినీతిభాగ్యముల ♦ సన్నుతికెక్కినవాఁడుబొందఁగా
నతిసులభంబులైపరఁగి ♦ యక్షనిధీశమనోరమంబులౌ
వితతసువస్తుజాలముల ♦ విశ్రుతమైతగునిమ్మహాద్రిసం
వృతగతినాగలోకముఁద్రి ♦ విష్టపమున్ మహిమించిరొప్పెడిన్. ౩౦.

చ. సతతముమానవావిదిత ♦ సద్విభవుండుమహేశుఁడంచితాం
చితముగగౌరితోనధిప ♦ సించినయట్టిమహావిభూతిచే
నతులితమైనయీనగము ♦ హాత్వముచూడఁద్రిలోకవీరవి
శ్రుతిసరిపోల్పనెక్కుడగు ♦ చున్ గనుపట్టెడుఁజూడుమగ్రజా. ౩౧.

మ. పరమంబైకడునిష్కళంకమగుచున్ ♦ బ్రఖ్యాతమైపుట్టువున్
జరయుంజెందనియట్టిబ్రహ్మపదసం ♦ సక్తాత్ములౌవారికిన్

వరకా స్త్రంబులచేతఁబోలెనఘముల్ ♦ వారించునీయద్రిచే
నరసాధార్యభవచ్ఛిదంబులగువి ♦ జ్ఞానంబులుంబుట్టెడున్. 32.

* * * * * * * * * *

చ. జగములలోపలన్ మిగుల ♦ సన్నుతికెక్కినయీనగస్థితా
త్యగణితయోషధీతతియ ♦ హర్నిశముల్ధరనీతిపారగుం
డగుచ్యవనుండునొప్పెడుమ ♦ హత్తరసంపదలుంబలెంగడున్
సుగుణసమృద్ధిచేసవిగో ♦ శోభితమైకననయ్యెఁజూచితే. 33.

ఉ. శారికలింపుమీఱఁగను ♦ సారెకుఁబల్కఁగఁబుష్పభారతం
భూరుహరాజినమ్రతను ♦ బొందినవెంతయునబ్జయుక్తమై
నీరములొప్పఁగానలరు ♦ నిర్మలసైకతరాజహంసవా
నీరయుతంబులౌనదులు ♦ నెమ్మిఁగరేణులకింపునింపెడున్. 34.

చ. ఘనతరచూతపుష్పవన ♦ గంధనిభంబగుదానతోయవా
సనలకుఁదేంట్లుమూఁగినల ♦ సత్సురదంతికపోలకర్షముల్
గనుఁగొనఁగావసంతబుతు ♦ కాలముగానియకాలమందును
న్గొనసిపికాళికిన్మదము ♦ బుట్టఁగఁజేసెడుఁగంటివేన్నపా. 35.

లయవిభాతి.

మఱియుంగదెచూడుసురతరుణులుమెలంగుసురు, చిరకటకదేశములఁ ♦ బరఁగుఘనవిద్యా
ధరమధురగానముల ♦ కెరవగుచుమ్రోయుచును, బురుషనదులొప్పఁగను ♦ ధరవఱలునీభూ
ధరమునమహీంద్రునకు ♦ నరయహితమైనసుధ, ధరవిడిచియుండుటను ♦ గరమరుదుగాఁగన్
సురనగముకంటెగురు ♦ తరమగుచుఁదేజమున, మెఱసికనుపట్టెడిదె ♦ నరవినుతకంటే.

చ. అనుపగుసంపదంబొదలు ♦ నట్టిలతాగృహరాజియోషధుల్
తనరఁగఁబెట్టుదీపముల ♦ లాగుననొప్పఁగమించుదివ్యచం
దననవపల్లవోజ్జ్వలిత ♦ తల్పములొప్పసరోజవాతముల్
మనములదేవకామినుల ♦ మర్వఁగఁజేసెనునాకలోకమున్. 36.

చ. హరునిమనంబులోఁదలఁచి ♦ యద్భుతలీలజలంబులోపలన్
మెఱసితపంబుసేయుసల ♦ మీనవిలంఘనలోలనేత్రనా
గిరిజనుజూచిమేనుబుల ♦ కింపఁగనెంతయుసాత్త్వికోదయ
స్ఫురణదలిర్పఁగాభవుఁడు ♦ మోదముతోడుతఁదొల్లియిచ్చటన్. 37.

చ. కరమునజాఱుచుండునహి ♦ కంకణముంగనికంపమందిమే
గరుపొడువంగఁదాభయము ♦ గ్రమ్మఁగమాటికిఁజూచుచున్ యవాం
కురములుచేతఁబట్టికడు ♦ కూరిమిపెండిలికూఁతురైనఁదా
మురిపెముచుఁజెట్టబట్టెదన ♦ మోమునలేనగవంకురింపఁగన్. ౩౯.

వ. అదియునుంగాక. ౪౦.

మ. అరుదారంగసురాసురౌఘములుమ ♦ న్నర్థిన్ సుధాప్రాప్తికై
పరఁగంగానలవార్ధిభగ్నజలధి ♦ స్పష్టాహిలోకంబుగా
సారిదింద్రచ్చుచునాగత్రాడుగతినాఁ ♦ జుట్టుంపగఁజుట్టున
య్యుర్వరగేంద్రాంకితమూచుమందరనగం ♦ బొప్పారెడున్ జూచితే. ౪౧.

ఉ. భానుకరప్రసారపర ♦ భాగతలస్ఫురదింద్రనీలసం
తానవిరాజమానరజ ♦ తస్ఫటికాంచితకుడ్యదీధితుల్
మానుగనెంచిచూడదిన ♦ మధ్యమునందును గౌముదీభ్రమన్
భూనుతమాటిమాటికిని ♦ బుట్టఁగఁజేసెడుచూడుమీగిరిన్. ౪౨.

చ. మలయసమీరపాతమున ♦ మందగతిన్ జలియించుతామరల్
పొలఁతులభ్రూవిలాసముల ♦ పోల్కి తరంగితమైకొలంకులన్
బొలుచుజలాంతరంబునఁబ్ర ♦ ఫుల్లములై సవిలాసవైఖరిన్
దలఁకొనినృత్యమాడెడువి ♦ ధంబునఁగొప్పెడుఁజూడుమజ్జనా. ౪౩.

క. వినువీధికెదురునిగుడుచు, ననువగునీస్ఫటికకాంతు ♦ లర్కాంశులతో
నానకూడితత్సహస్రా, ఖ్యనుమిగులఁగఁజేయుకరణి ♦ నలరెడుఁగంటే. ౪౪.

చ. హరునకునంతనంబుగధ ♦ నాధిపుఁడున్నతమౌమహాపురం
బిరవుగఁజేసియుండినమ ♦ హీధరమారజతాద్రియల్లదే
మెఱసెనుమించిచూడుమున ♦ మీపమునంజరియించుచుండుభా
స్కరునకునస్తమానమున ♦ కాలమునంచునుబుట్టఁజేయుచున్. ౪౫.

ఉ. సానుచయంబులంబొలుచు ♦ చారుమణిద్యుతులీనగంబునన్
ధీనుతవప్రమధ్యముల ♦ నిద్దినగోడలాయంచుశంకలోఁ
బూనఁగఁజేసెడున్నదియుఁ ♦ బోనఁగనొత్తెడుమందమారుతం
బేనగమందునైనవిను ♦ మిట్టివిచిత్రముఁగంటివేనృపా. ౪౬.

సీ. రమణీయమగువిచి ♦ త్రంబింకనొక్కటి, వినుమీనగంబున ♦ ననఘచరిత
పల్వలస్థలులెల్లఁ ♦ బరిపక్వములెకాని, లేఁతలైమొనయుట ♦ లేదు చూడ
శ్యామలత్వమెకాని ♦ జలజాతవనములు, పాండుత్వమొందుటే ♦ ర్పడుటలేదు
వివిధభూరుహములు ♦ విస్తీర్ణశాఖాభృ, తంబులైయనవర ♦ తంబుకలయ
మొనసినవలెత్తిచిగిరించి ♦ పూఁచికాఁచి, ఘనముగాఁబండియుండుటే ♦ కానియరయఁ
బరిణతినిజెందియాపాండు ♦ భావమొంది, యాకురాలెడుదినమొక్క ♦ టైనలేదు.

చ. పరిసరభూములన్ మిగుల ♦ బాలశుకాభములైతనర్చునీ
గిరిగరుడాశ్మకాంతులుమ్న ♦ గీతతులన్ బ్రభవత్తృణాంకురో
త్కరమనుశంక మేఁతలకుఁ ♦ దార్కొనివంగఁగఁ జేయుచున్విభా
కరకరసంయుతంబగుచుఁ ♦ గన్గొననొప్పెడుఁజూడుమింద్రజా. ౪౮.

ఉ. చూచితెవింతయున్మిగులఁ ♦ జోద్యమునయ్యెడు రాజవర్యయీ
పూఁచినమెట్టదామరల ♦ పుప్పొడియాఁసుడిగాలిచేతఁదా
ఖేచరవీధికిన్నెగసి ♦ క్రిందటిరేఖయొకామభంగిగాఁ
బూఁచినువర్ణపుంగొడుగు ♦ పోల్కివిపర్తితమయ్యెనాపయిన్. ౪౯.

ఉ. ఆరయనిష్ఠతోడనుద ♦ యంబునశంకరుఁడీసురాపగా
తీరమునందునిత్యవిధిఁ ♦ దీర్చుచుసేయుప్రదక్షిణస్థలిన్
జారుసయావకోజ్జ్వలిత ♦ సవ్యపదవ్యతిరేకమార్గమా
గౌరిశరీరమందునికిఁ ♦ గ్రక్కునఁదెల్పెడుఁజూడువేడుకన్. ౫౦.

చ. చలితలతాగమాంతరల ♦ సద్రజతోజ్జ్వలకుడ్యదీప్తులన్
గలసిప్రచండభానుకర ♦ కాంతిచయంబిదెచూడనొప్పెడున్
సలలితలీలమాటికిల ♦ సద్ఘనదర్పణమండలాభమై
వెలసెడుఁగంటివేతెలియ ♦ వీరవరోత్తమయింద్రనందనా. ౫౧.

మ. దరిగోరాషుచుమండలీకృతలస ♦ ద్గాత్రంబులోశుభ్రమై
హాయిఁడెక్కన్నుమహోక్షమల్లదిగోది ♦ వ్యశ్రీమసోపీధులన్
బరఁగంబూర్ణశశాంకశంకజనియిం ♦ పన్ జేయుచున్ శృంగమం
దిరనెప్పున్ విహరించుచున్నయదిరా ♦ జేంద్రాకనుంగొంటివే. ౫౨.

చ. అవనివరేణ్యచిత్రశిఖ ♦ రాగ్రమణిద్యుతులంబుహీనసం
భవవిశదాల్పయుక్తఘన ♦ పఙ్క్తులమెల్లనెఖండరేఖలై

తపలిజనించునాబలభి ♦ దప్రథతాంచితచాపసంహతిన్
బ్రవిమలలీలనిండికను ♦ పట్టఁగఁజేయఁగఁజాలిపొల్చెడున్. ౫౩.
చ. హరునిశిరంబునందుఁజెలు ♦ వారుచునుండెడుచంద్రరేఖయీ
గిరివనమధ్యభూములను ♦ గృష్ణనిశీసమయంబునందునున్
వరతరువల్లికాభినవ ♦ పల్లవసిక్తసుధాస్రవత్ప్రభో
త్కరములచేతవెన్నెలలు ♦ గాసెడుఁగంటివెయీవిచిత్రమున్. ౫౪.
మ. అరుదైయొప్పెడుమూడుమల్లదెత్వదీ ♦ యంబైనయీరాకపున్
ఇరవైనట్టిదియున్ భవత్పితృమనో ♦ భీష్టంబునైక్రాలుభూ
ధరరాజంబలయింద్రకీలములస ♦ త్కాంతారసంవ్యాప్తకం
ధరభర్మద్యుతియుత్తరీయసుమహా ♦ ద్వాసంబెపోలెందగున్. ౫౫.
చ. హరిసుతయిమ్మహాద్రినని ♦ లాహతిచేలతికానుషంగముల్
విరియఁదదంతరంబులను ♦ వేగముతోద్విగుణీకృతంబులై
యురువడిఁజొచ్చుభాస్కరమ ♦ యూఖములన్ ఘనభర్మతీరవి
స్ఫురదురుకాంతులన్మెఱుఁగు ♦ శోభలఁబోలెడుఁబార్థచూచితే. ౫౬.
చ. భయపడిసర్పముల్ చెదరి ♦ పాఱెడునట్లుగఁగంపమొందనెం
తయునొరయంగనంటుకొను ♦ తన్మదవాసనకున్మదేభసం
చయములుచేరనట్టిహరి ♦ చందనముల్ పరికించిచూడని
శ్చయముగనింద్రునేనుఁగిట ♦ ఛాయకువచ్చినజాడఁదెల్పెడున్. ౫౭.
ఆ. గహ్వరాంతరముల ♦ ఘనబృందసాంద్రేంద్ర, నీలరుచివిభిన్న ♦ నిచయమగుచుఁ
గలయఁబర్వనట్టి ♦ గతినొప్పురవిదీప్తి, తిమిరయుతవిభాతి ♦ నమరెఁగంటె. ౫౮.
ఉ. శాంతుఁడవయ్యువ్యాసముని ♦ శాసనపద్ధతిశస్త్రిధారివై
యింతయుమోసపోకనిపు ♦ డీగిరిమీఁదఁదపంబుసేయుమీ
యెంతయునిష్ఠఁజేసినను ♦ నిర్ధరలోకశుభంబులొందన
త్యంతముదుష్కరంబవుమ ♦ హత్తరవిఘ్నములొందుఁగావుతన్. ౫౯.
వ. అని పల్కి నిజనివాసంబునకుం బోవం దలంచి యిట్లనియె. ౬౦.
సీ. అవనీశనీయింద్రి ♦ యాశ్వముల్ దుష్పథ, గాములుగాకుండుఁ ♦ గాకయెపుడు
నధికతపఃక్లేశ ♦ మైనచోసాధనో, త్సాహమిచ్చునుగాక ♦ శంకరుండు
నఖిలదిక్పాలకు ♦ లర్థితోనీతపో, బలముఁగాచుచుమహా ♦ త్ఫలయుతముగ
నిర్మలంబైయొప్పు ♦ నీమనోరథమును, ముదముతోడుతనుజే ♦ యుదురుగాక

నను చనీకీర్తి స్నేహాప్తుఁ ♦ డైవయత్నుఁ, డనుదీపించినిజనివా ♦ సమునకరిగె
నప్పుడేకకొంతచింతించె ♦ నర్జునుండు, ఘనవియోగంబు వెతఁ జేయుఁ ♦ గాదెయొందు.

తే. అంతశోభిల్లునన్నరుఁ ♦ డతులసార, వస్తుసంప్రాప్తినానన్న ♦ ఫలమురమ్య
మనతిశయనీయమౌన్నత్య ♦ మైనఁదున్న, గంబునిజపౌరుషముఁబోలెఁ ♦ గదిసెనప్పుడు.

చ. అతిరుచిరాకృతింబోలుచు ♦ నన్నరుఁడంతటభర్మసానుదీ
పితమగునమ్మహాద్రికడుఁ ♦ బ్రీతిని నెక్కెనునచ్యుతుండు దాఁ
బతగకులేంద్రు నెక్కుగతి ♦ భాసురలీలలసత్ప్రథానుసం
గతుఁడగుచున్ శుభంబులను ♦ గాంచుచుగంగకును న్ముఖంబుగన్. ౬౩.

వ. అప్పుడు. ౬౪.

ఆ. జయజయధ్వనిబలె ♦ షట్పదస్వనమొప్పఁ, బవనవిచలదగ్ర ♦ పాదపంబు
లవనతోత్తమాంగు ♦ లగువందిజనములు, జల్లుసేసలట్ల ♦ చల్లెవిరులం. ౬౫.

చ. వెలయఁగజాహ్నవీసలిల ♦ వీచికలన్విహరించి వేడ్కఁద
జ్జలజపరాగముల్గొనుచుఁ ♦ జారుగతి న్మెదురేగుదెంచియా
మలయసమీరమన్నరుని ♦ మక్కువతోడుతనాప్తమిత్రుఁడుం
బలెనలమెన్ శుభంబుఁదెలు ♦ పంజనుదెంచెఁ లీలనొప్పుచున్. ౬౬.

చ. ప్రతిచరిమీఁదనుండియుగు ♦ భాలురనంగనునున్నతోపల
ప్రతతులమీఁదటందుమికి ♦ పాఱుచుసారసహంసకూజితా
న్వితసురనిమ్నగాసలిల ♦ నిస్వనమాన్ప పయాళికెంతయున్
మతిననురాగమున్నినిచె ♦ మంగళతూర్యనినాదవైఖరిన్. ౬౭.

ఉ. అన్నరుఁడంతఁగన్గొనెని ♦ యాగ్రమునన్ ఘనదేవదారుసం
భిన్నసురాపగాసలిల ♦ వేణికకున్విననుంబురంజిల
న్నన్నగగౌరి వేతసవ ♦ నంబులుసేయుసమృద్ధిహేతువై
యున్నసమస్కృతిన్గుతుక ♦ మొప్పఁగనెంతయువిస్మితాత్ముఁడై. ౬౮.

క. సరసిజరజమునదోఁగుచు, నరుణంబైయూర్ములందు ♦ నలరుచుగంగా
సరిదుత్తరీయలీలం, గరమొప్పుమరాళరాజిఁ ♦ గదలకచూచెన్. ౬౯.

శా. కొమ్మల్బ్రేవఁగఁగుంజరంబులువెస ♦ న్గోరాడుచోనచ్చటన్
సమ్మోదంబునషట్పదీతతిమద ♦ స్రావంబుకై మూఁగుతీ
రమ్ముంగాంచిప్రమోదమందెనపుడా ♦ రాజన్యుఁడెట్లన్నలో
కమ్మందెన్నఘనుండుసేయురుజయు ♦ త్కర్షాహవంబేకదా. ౭౦.

చ. సలలితమైనతత్కనక ♦ సానుమరీచులచేతరక్తిమం
బొలుచుతరంగసామ్యమునఁ ♦ బొందినవల్లభుఁగానలేకతాఁ
బలుమఱుఁబ్రేమమీఱువెడ ♦ బల్కులనారయుచక్రవాకపు
న్వెలఁదినిగాంచిసంతసిలె ♦ వేడుకబుట్టదెకూర్మిఁజూచినన్. ౨౧.

చ. ఒనరఁగనన్నదీవిచల ♦ దూర్మికలంబునలంకృతంబులై
తనరెడుకాంతిపుంజములు ♦ తజ్జలమగ్నమణీసమూహమున్
అనువుగఁదెల్పెనానృపున ♦ కాత్మగతంబగునట్టిచేష్టలన్
ఘనమగునాకృతుల్దెలుపు ♦ కైవడినెంతయువిస్మయంబగున్. ౨౨.

మ. చపలోద్ధూతతరంగమాలికలపై ♦ నుద్వేగవాతాహతిన్
జపలంబైమతివిస్తరించుచుఁగడున్ ♦ స్వచ్ఛోల్లసత్కేతకీ
విపులాగ్రాభతనొప్పుఫేనముసరి ♦ ద్వేల్లత్ప్రహాసంబొయం
చపుడాపార్థుఁడుచూచెనెంతయుఁబ్రమో ♦ దాశ్చర్యతందేలుచున్. ౨౩.

చ. జలములఁద్రావవచ్చినన ♦ సామజగండమదాంబుబిందువుల్
సలిలముమీఁదనిండివిల ♦ సచ్ఛిఖిపింఛసమానవర్ణమై
యలరుచువేడ్కఁజేసెనపు ♦ డగ్గజబృందముఁజూడవచ్చిన
య్యలఘుసరిద్విలోచనస ♦ హస్రముమాడ్కినిరాజమాలికిన్. ౨౪.

మ. ప్రతిబోధత్వముచేవిభిన్నముఖమై ♦ పాతాచ్ఛముక్తామణీ
తతితోడంగళితాశ్రుబిందుయుతమై ♦ తల్పంబుపైనొప్పున
య్యతివంబోలెడుశుక్తిసైకతముపై ♦ నారూఢిఁగన్పట్టెనా
క్షితినాథాగ్రణిసంతసంబుననిరీ ♦ క్షింపంగనాయుండటన్. ౨౫.

చ. జలములయందుఫేనతను ♦ సాంద్రలవావృతమైతనర్చుచు
న్నలరుప్రవాళపల్లవమ ♦ నంగవశాత్మతఁజూడనొప్పున
త్కలనతిదంతకాంతివెలుఁ ♦ గొందెడునమ్మధురాధరోష్ఠమున్
దలఁచుకొనంగఁజేసెనుధ ♦ నంజయునిన్మదిసంతసించుచున్. ౨౬.

చ. తరళతరంగసంకలిత ♦ దానసుగంధముఁగ్రోలిరోషముల్
నెరయుజలంబులందిగయు ♦ నీరుజగంబులనాభిముఖ్యతన్
సరినెదురేగుదెంచుప్రతి ♦ సామజయూధముఁబోలెఁజూచున
వ్వరవనదంతిసంఘముల ♦ వారకచూచెనరుండువేడుకన్. ౨౭.

క. ఉరవడి నెగయఁగఁ దలఁచిన, యురగజవనప్రాకృతముల ♦ నుసుపథగతమై
శరదభ్రవిభ్రమంబున, నరుదగు సలిలములఁ జూచి ♦ యానందించెన్. ౭౯.

లయవిభాతి.

వెలయుఁగతిహంసములు ♦ వలుదకటిసైకతము, లలఘుతరనాభిసుడు ♦ లలరువళియూర్మ్యల్
కలితపుచకోకములు ♦ లలితఘనబాహుబిస, ములునుగళశంఖములుఁ ♦ బోలుచుముఖపద్మం
బులునయనమీనములు ♦ తళుకుకచశైవలము, లెలబలుకుపక్షిరవ ♦ ములు వెలయఁగంగన్
మలయుమనుఁబొందునల ♦ చెలులవలెనొప్పునదు, లెలమిఁగని బాఁటెనరుఁ ♦ వలరుమనునంతన్.

వ. ఇవ్విధంబున నవ్విజయుం డవ్వసుంధరాధరారోహణంబు చేసి తచ్ఛిఖరప్రదేశంబున బహుకుసుమభారానతశాఖాంచితతరుపరిష్కృతంబై వినిర్మలంబగు మనఃప్రసన్నతయునుంబోలెం బొలుపారు వనమధ్యంబున నిల్చి పుష్పితలతావితానసఫలితోరుభూరుహనివహాంచిత కాననోజ్జ్వలవివిక్తప్రతిసాను ప్రదేశంబులం జెలువొందు నమ్మహేంద్రగిరీంద్రం బాత్మతపశ్చరణంబున కనుకూలంబై కౌతూహలంబు పుట్టింప నానందించుచు యోగశాస్త్రానుసారంబుగా ధ్యేయవస్తువునందుఁ జిత్తంబు హత్తించుచు మునివృత్తిం దపంబు సేయం దొడంగిన. ౮౦.

క. అతిదుష్కరమగు నాతప, మతనికి శ్రమమేమి చేయ ♦ దయ్యెను దలఁపన్
మతి నిల్కడగలవారికి, క్షితి బాధకమెట్టిదైనఁ ♦ జేయంగలదే. ౮౧.

చ. ఎలమిదలిర్ప నింద్రియవశ ♦ మైకసుఖాంచితుఁడై గుణోదయో
జ్జ్వలతనుపాపరూపతమ ♦ సంబు వినాశముసేసి యంతని
ర్మలుఁడగు నక్కిరీటి నిజ ♦ మాన్యతపంబుల వర్ధిలెం గడున్
లలితమయూఖరాజినుడు ♦ నాయకుఁడుం బలెఁ బూర్ణతేజుఁడై. ౮౨.

తే. తనరుచుం డెడుతత్త్వావ ♦ ధారణమున, బుద్ధి కామాదిషడ్వర్గ ♦ మునను జెంద
నీనియాతనినిరుపప్ల ♦ వైకనిష్ఠ, హాత్త్వమతిరూపవిషయేచ్ఛ ♦ నంటకుండె. ౮౩.

మ. అతులాహింసతనాత్మనూనినియమ ♦ ధ్యానంబులన్ శిష్టమం
త్రతపోధ్యానములన్ నమస్కృతులచే ♦ తంబోలెనయ్యింద్రునిన్
సతతంబున్ భజియించు నర్జునుఁడుదా ♦ స్వాభావికాగంతుకాం
చితశౌర్యప్రశమోజ్జ్వలప్రభధరిం ♦ చెన్ జూడు నొక్కుమ్మడిన్. ౮౪.

ఆ. ప్రతిదినాభిషవణ ♦ భవపిశంగజ్యోతి, శిరమునందుఁ దాల్చి ♦ మరకతాభుఁ
డైనయక్కిరీటి ♦ యగ్రారుణప్రభా, న్వితతమాలనీల ♦ నిభత నొప్పె. ౮౫.

మ. ఘనశస్త్రంబులు దాల్చియు న్నిగులని ♦ ష్కాపట్యుఁడై సత్యవ
ర్తనలన్మౌనుల మీఱుచు న్మృగములన్ ♦ రంజిల్లఁగాఁ జేసెన
య్యనఘుం డెన్నఁగఁ దా రజోగుణవిహీ ♦ నాత్ముండునై యట్లకా
యనుకంపాదిగుణంబు లెవ్వరిని జే ♦ యన్ లేవు రంజిల్లఁగన్. ౮౬.

సీ. అనుకూలవాతమం ♦ దానిలం బంతట, వీవంగఁ జేయుచు ♦ వెలయుఋతుగు
ణాపధీరితభాస్క ♦ రాంచితదీధితుల్, గురుసుఖస్పర్శగా ♦ నెరపఁ జేసి
పుష్పాపచయవేళ ♦ భూరుహంబులు పల్ల, వాంజలులై వ్రాల ♦ నానతములు
గాఁ జేయుచును శయ్యఁ ♦ గా భూమి నవతృణా, స్తరణతఁ బ్రతినిశీ ♦ సమయములను
గడఁగి సేయుచు విగతాభ్ర ♦ గగననిపతి, తాంబుకణరాజి భూరేణు ♦ వణఁగఁ జేయు
సదయుచేఁ బోలె నిజతప ♦ శ్చర్య చేతఁ, బ్రతిదినంబును బరిచర్యఁ ♦ బడసె నతఁడు.

వ. ఇవ్విధంబున నధికఫలోదయంబునకై సస్యాగ్రంబునం బుట్టు కుసుమంబులుం బోలె నిజాగ్రంబునం గనుపట్టు నా శుభనిమిత్తంబులు గనుంగొని యాతండు విస్మయాధీనత్వంబునం బోధకుండయ్యె. అట్లేకదా, జితేంద్రియులైన వారిప్రభావగుణంబులు ధీరత్వంబును జెఱపవుగదా. అది యట్లుండె నట్లు మహత్తరతపోవర్తనుండై యప్పార్థుండు సేయు తపఃప్రభావం బితరుల కలవి యగునే యని నిశ్చయించి యవ్వనేచరు లత్యంతఖేదాయత్తబుద్ధులై యాఖండలుసన్నిధానంబునకుం జని, తదనుమతిం బ్రవేశించి సాష్టాంగదండప్రణామంబు లాచరించి కరకమలంబులు మొగిచి ఫాలతలంబులం గదియించి మధురవాక్యంబుల నిట్లని విన్నవింపం దొడంగిరి. దేవా భవదీయం బైనయింద్రకీలాద్రియందు జటావల్కలధారణుండై సూర్యచంద్రాగ్నిప్రతినిభుం డైనయొక్కమహాపురుషుండు జగంబు తపియింప విజయార్థంబు శత్రుభీషణంబుగా శస్త్రాస్త్రంబులు ధరియించి వేదవిధ్యనుష్ఠానంబుల సదాచారసంపన్నులైన మునుల నతిశయించుచు, నత్యాశ్చర్యకరం బైన తపంబు సేయుచున్నవాఁడు. అతనితపఃప్రభావంబున మారుతంబులు శైత్యమాంద్య సౌరభ్యంబులై యత్యంతసుఖావహత్వంబు గావించెడు. భూమి నవతృణాస్తరణంబై శయ్యాసనాదులయం దనుకూలం బయ్యెడు. గగనంబు మేఘధూమరహితంబై జలధారావర్షంబున భూపరాగంబు నడంగించెడు. ఇవ్విధంబునం బృథివ్యాదిపంచభూతంబులు నతనికి మనఃపూర్వకంబుగాఁ బరిచర్య గావించుచున్నట్లున్నయవి. ఇంకేమని విన్నవింప నేర్తుము. మృగంబులు సహితము పరస్పరవిరోధంబులు మాని శిష్యవర్గంబు సద్గురుం గొలిచినట్లు సంతతంబును సేవించుచున్నయవి. పుష్పా

పచయుసమయంబున వృక్షజాతులు పుష్పితంబులై తమకుఁ దామె వినమ్రత్వంబునం బొందెడు. అన్నగంబును భవదధీనంబైనవిధంబున సత్తపోధనసత్తముస కధికవశంబై యున్నయది మఱియును. ౧౭.

చ. శ్రమరహితత్వ మేప్రబల ♦ సత్వము దెల్పుమహాచ్ఛరీరమా
సమరజయంబుఁ జాటుమఱి ♦ శాంతుఁడటంచు నునూతనంబుగా
సముఖము జేరినన్ బ్రభువు ♦ సన్నిధిఁ బోలె భయంబుపుట్టునా
విమలతపోమహత్త్వమిది ♦ విస్మయమయ్యెడు మాకు వాసవా. ౧౮.

ఉ. ఇట్టితపంబు సేయుఘనుఁ ♦ డేకులజాతుఁడొ యన్న నేము నా
పుట్టువునవ్వ వాయమును ♦ బుద్ధి నెఱుంగము రాకొలంబునన్
బుట్టినవాఁడొ కాకముని ♦ పుంగవజాతుఁడొ వైశ్యజాతుఁడో
యెట్టికులంబువాఁడొ దివి ♦ జేశ్వర యాఘనుఁ డెంచిచూడఁగన్. ౧౯.

క. ఎన్నేని కారణంబుల, నెన్నియు మతి నెఱుఁగలేక ♦ యిప్పుడు మీతో
విన్నపము సేయుతప్పిది, మన్నింపుము మంచిదేని ♦ మఱి కాకున్నన్. ౨౦.

క. హితమేల తెలుపరన్నను, సతతము వనములను దిరుగు ♦ జడులెక్కడశ
స్త్రతులేడ నెంచిచూచిన, క్షితిలోపల నింతపట్టు ♦ సిద్ధంబనఘా. ౨౧.

వ. అంత. ౨౨.

చ. వనచరులిట్లు దెల్పినను ♦ వాసవుఁడప్పుడు కూర్మి మీఱఁగాఁ
దనయుని సత్తపంబు మది ♦ తాల్మియునున్వి నివిస్మితాత్ముఁడై
మనమునఁ బుట్టుహర్షమును ♦ మానుగఁ దాఁచెను రాజచిత్తముల్
తనరఁగ నీతిమార్గములు ♦ తప్పవు గాఁ గణుతించిచూచినన్. ౨౩.

మ. ఇరవొందంగ ననంతనింద్రుఁడు మనం ♦ బేకాగ్రతన్ నిల్పియా
నరుపై భక్తినిదన్మనస్థిరతఁ గా ♦ నంగా మదిం గోరి తా
నెఱిఁ గేయుండిమ క్షేమియుం దెలియన ♦ శ్లేసంత సంబొప్పఁగా
సురనారీతతిఁ బిల్చి యిట్టులనియెన్ ♦ జోద్యంబు వేద్యంబుగాన్. ౨౪.

చ. యువతివతంసలార వినుఁ ♦ డొక్కటి చెప్పెద మీకు బోలెనీ
యవనినిమర్త్యభేదులగు ♦ నస్త్రిములందతికోమలంబునన్
అవిహతమున్న మోఘమును ♦ నత్యణురూపము దూరపాతినాఁ
బ్రవణకు నెక్కునస్త్రిమిఁక ♦ భావజు గెల్వనకొండుగల్గునే. ౨౫.

తే. ధరణిసంసారముక్తికై ♦ తపము విడిచి, నట్టిమానులరాజస ♦ మనుపరాగ
మణఁచునవబోధవారిమీఁ ♦ దైనలోచ, నాంజలులఁద్రావఁబడినట్లు ♦ లణఁగిపోవు.

చ. జగములయందుమున్నివిధ ♦ సామ్యములందగుసుందరత్వముం
దిగిచివిధాతమిమ్ముఁదన ♦ నేరుపుమీఱసృజించియిచ్చుటన్
దగవసియింపఁజేసినత ♦ తంబుజనౌఘమునిందుఁజేరఁగా
నొగిముదమందఁజేసెనిఁక ♦ నుర్వినసౌఖ్యమెమీకునెవ్వియేన్. ౯౭.

వ. కావున. ౯౮.

ఆ. కళలనిపుణులైన ♦ గంధర్వులనుగూడి, యరిగియతనితపముఁ ♦ జెఱచిరండు
ఎలమినిస్పృహులను ♦ నెల్లగెల్చెదుమీకు, నీసుఖాత్మగెల్చు ♦ టెంతయరిది. ౯౯.

క. ఈకరణినుగ్రమగుతప, మేకాగ్రతసేయునతఁడు ♦ హృదయంబునఁదా
నేకరణిసుఖముఁగోరును, బ్రాకటముగనంటిరేని ♦ పడఁతుకలారా. ౧౦౦.

క. వినుఁడతఁడీగతిఁజేసెడు, ఘనతపమదిముక్తికొఱకు ♦ గాదిదినిజమ
య్యనఘుఁడురిపువధచేతను, గనుఫలమునుమదినిగోరి ♦ కానితలంపన్. ౧౦౧.

క. ఆదియెట్లన్ననునెంతయు, విదితంబుగఁదాల్చినట్టి ♦ విల్లెక్కుడసౌ
ఖ్యదమగుముక్తియదెక్కుడ, మదిలోపలనెంచిచూడ ♦ మానినులారా. ౧౦౨.

చ. తలఁపమహారాజుఁడౌనతఁడు ♦ తక్కినమానులుబోలెనాత్మలో
నలిగిశపించునోయనుభ ♦ యంబునులేదదియెట్టులన్ననున్
వెలయుయశంబులెన్నునయ ♦ విక్రమశాలులబుద్ధులెంతయున్
లలనలయందునింతయుఁద ♦ లంపవుకీడొకవేళనేనియున్. ౧౦౩.

వ. అని యిట్లు సకలదేవతాసమక్షంబున నాజ్ఞాపించి వివిధాంబరాభరణాదుల బహూకరించి, పొండు కార్యంబు సాధింపుఁ డని యా ఖండలుం డనుప నా యచ్చర లత్యంత సంతుష్టాంతరంగులై, యా సహస్రలోచను లోచనసహస్రంబునకు విస్మయంబాపాదించు తేజంబునం బ్రకాశించుచు వినమితశిరస్కలై వినయంబున నయ్యాస్థానమంటపంబు వెలువడి. ౧౦౪.

క. వనితామణులుత్తుంగ, స్తనభరనమితాంగులగుచుఁ ♦ దడయకయపుడిం
పెనయఁగనిజసదనములకుఁ, జనిగమనోద్యుక్తలగుచుఁ ♦ జయ్యననంతన్. ౧౦౫.

క. సైంధవగజరథములతో, గంధర్వులువెంటనడువఁ ♦ గట్టాయితమై
దింధిమ్మనిమ్రోయించిరి, బంధురగతిమర్దళములు ♦ పటురవమెసఁగన్. ౧౦౬.

క. ఆరవముదిశలఁబర్వఁచు, భూరివిమానౌఘవినర ♦ పూరిత మైతా
బోరనభ్రోయుచుఁబురిలో, నారూఢిగఁజాటెఁదత్పురి ♦ యాణము దెలియఁగన్. ౧౦౭.

వ. ఇవ్విధంబునఁ బ్రయాణోన్ముఖులై నిఖిలబృందారకసందోహంబు లానందంబునం
గనుంగొనుచుండఁ దత్పురంబు నిర్గమించి నడచునెడ. ౧౦౮.

ఆ. భానుమండలంబు ♦ పైవచ్చుకతనన, ప్సరసలకును నాత ♦ పవరణముగ
నమరఁబట్టినట్టి ♦ యాతపత్రంబులు, సార్థకతను బొంద ♦ వయ్యెనపుడు. ౧౦౯.

చ. ఎదురుగదుర్నిమిత్తముల ♦ కెల్లను హేతువు గాఁగవీఁచున
య్యుదుటుదువాళిగాలినరు ♦ ణోత్పలమాలనసన్నిభాక్షులై
పదములుదొట్రిలన్నడుచు ♦ భామలచెక్కులభాసదీప్తిచే
నొదవినరక్తిమంబలమ ♦ దోద్ధతకాంతినిజేసెనయ్యెడన్. ౧౧౦.

క. దివిజానుభావముననురు, జవనాశ్వాకృష్టసురథ ♦ సంచయములు చ
క్రవివర్తనంబులేకయె, దివినివిమానములరీతి ♦ దృఢగతిఁబఱచెన్. ౧౧౧.

వ. అప్పుడు. ౧౧౨.

చ. లలనలగంధసారముల ♦.లందుమిటారిమెఱుంగుచన్గవల్
పులకితమైగనున్పొదువఁ ♦ బుట్టుపరిశ్రమబిందురాజిత
త్తిలకపరిమ్యతాస్యములఁ ♦ దీర్చినమౌక్తికభూషణాకృతిన్
దెలిపెనుసుందరాంగులకుఁ ♦ దేజమెకాదెవికారమేనియున్. ౧౧౩.

మ. పతితోల్కార్చిసమానదీధితులుప ♦ ర్వంగానవిచ్ఛిన్నరూ
పతసౌవర్ణనికాషగౌరరుచులిం ♦ పారన్నభోవీధిరా
జితమైయొప్పెడుతద్రథధ్వజపట ♦ శ్రీమించివిస్తారమున్
అతివిస్తారముసేయురీతిఁగనఁగా ♦ నయ్యెన్ స్మయంబొప్పఁగన్. ౧౧౪.

తే. కుసుమసుకుమారగాత్రులౌ ♦ కొమ్మలాత, పమునకోర్చుటగంధర్వ ♦ పతులుసూచి
కమలభవుచిత్రసంసృష్టి ♦ కౌశలమున, కచ్చెరువునొందిరయ్యారె ♦ యనుచునపుడు.

సీ. శృంగారములుదీర్చు ♦ సిందూరరాగంబు, తరుణార్కరోచులఁ ♦ బ్రస్తరింపఁ
గనకంబుపెంపొందు ♦ కక్ష్యబంధప్రభ, లిరువంకమెఱపుల ♦ కరణిఁబరఁగ
నిర్మలమణిమయ ♦ భర్మవర్మప్రభ, లింద్రచాపద్యుతు ♦ లీనుచుండ
ఘణఘణంఘణయను ♦ ఘంటికారావముల్, ఘనగర్జితంబుల ♦ కరణిమ్రోయ
పసనసప్తస్థలంబులఁ ♦ గురియుచుండు, కలితమదధారజలవర్ష ♦ గతినిదెలుప,
సరభసంబుననడతెంచు ♦ కరిఘటాళి, పోలిచెజీమూతబృందంబు ♦ పోల్కిఁదనరె.

క. త్వరితగతిఁ బంచధారా, స్ఫురణల్ దనరంగఁ దురగ ♦ ములు నడ తెంచెన్
మరగాభిధానమవ్వదు, మురువొప్పఁగ సార్థకతను ♦ బొందినకరణిన్. ౧౧౭.

చ. పరఁగ దురాసదంబగు ప్ర ♦ భాకరమండలమిట్లు దాఁటియా
తరుణులు వాహినీతతులుఁ ♦ దాము సుదూరము వచ్చి యూర్మికల్
నెరయఁగ దిగ్వధూతతికి ♦ నేర్పున దిద్దినయేక వేణి నాఁ
బరఁగు వియన్నదిం దిగిరి ♦ బంధుర మర్దళ వాద్యఘోషతోన్. ౧౧౮.

క. సమదాళి పరివృతాంచిత, కమలరజో వ్యాప్తమగుచు ♦ గగనధునీభం
గములందోఁగుచుఁ దత్తా, పముదీఱఁగ నపుడు మలయ ♦ పవనము వీఁచెన్. ౧౧౯.

చ. కరితురగావగాహనము ♦ క్రందున నెంతయు ఘూర్ణమానమై
పొరలి విమానభిత్తులగు ♦ భుల్లునఁ దాఁకుచు నేటికైనను
దరిఁగని మంటిమంచు నను ♦ దంబునఁ బొంగినరీతి నూర్మికల్
నెరయ సురాపగావిమల ♦ నీరము లత్తఱి నొప్పెఁ జూడఁగన్. ౧౨౦.

క. సురభవన వేదులిసుకల, నొరయుచు నిరుగడలఁ బడఁగ ♦ నుడుమార్గంబున్
సరిగడచి మేఘముల పైఁ, బఱచెడు రథనేములపుడు ♦ భ్రమణతనొందెన్. ౧౨౧.

మ. ఘనదంతాహతి చేత వర్షిలు ఘనా ♦ ఘంబుల్ పథశ్రాంతిచే
తను నేతెంచు గజవ్రజంబులను మో ♦ దంబందఁగాఁ జేసె నె
ట్లనినన్ భూమిఁ బరోపకారులగు ధ ♦ న్యాత్ముల్ ప్రవర్తించు వ
ర్తనముల్ పీడలు సేయువారియెడలన్ ♦ దాత్పర్యమే సేయుఁగా. ౧౨౨.

చ. పసుపసువచ్చుచుండు సుర ♦ వారవధూకటిరమ్యవస్త్రముల్
పసఁడగువానిచేతఁ బలె ♦ వాయువశంబున సారెజాఱఁ దా
పరమణిమేఖలాంశువుల ♦ వారిఁగఁ బర్వుచు నూరుమధ్యమం
దొఱపగు చల్లడంబుగతి ♦ నొప్పె నఖోంశుకలీల వింతఁగన్. ౧౨౩.

ఉ. సారతుషారవర్షమునఁ ♦ జందనపుం దిలకంబు లెల్లనుం
జాఱఁ బరిశ్రమంబుడిపి ♦ సంతసమందఁగఁ జేసి మేఘముల్
వారల చేత సత్కృతులు ♦ వారక పొందెను నట్లకాదె యీ
ధారుణిఁ జేసినట్టి సుకృ ♦ తంబె వెసం బాపునె యల్పదోషముల్. ౧౨౪.

చ. కలితతరోర్మిరేఖలఁ బ్ర ♦ కాశములౌ పులినస్థలంబులుం
బలెఁ జెలువారు పీతజల ♦ ధారపయోదములందు భిన్నమై

పొలుచుసురేంద్రచాపమును ♦ బూర్ణముచేసెనుదత్సురాంగనా
సలలితభూషణద్యుతులు ♦ సంధులఁబర్వుచు సాంగమేర్పడన్. ౧౨౫.

వ. ఇవ్విధంబున మేఘమండలంబు నిర్గమించి విహంగమార్గంబునుం గడచి నిజాగమనప్రయో
జనవిషయంబు లైనభావికరణీయకార్యపర్యాలోచనంబు లైనసల్లాపంబులు సేయుచు,
జలధరపటలంబుచేతం గప్పం బడక యధికౌన్నత్యంబునం గనుపట్టునక్కనకసానుసము
జ్జ్వలం బగునింద్రకీలశైలేంద్రంబుఁ బ్రవేశించి విలాసినీముఖనలినంబు, నుద్ధూతస్ఫుటవిశ
దాతపత్రఫేనంబును, దూర్యరవగంభీరంబునుంగా నభంబుననుండి ప్రవహించు మం
దాకినీప్రవాహంబుచందంబున నా సహస్రాక్షుపంపునఁ జనుదెంచుగంధర్వవాహిని
తచ్ఛిఖరప్రదేశంబున వీడువిడిసె నప్పుడు. ౧౨౬.

ఉ. అగ్గలమైన వేగమున ♦ నభ్రచయంబులె సేతువై తగన్
బగ్గములెంతయుంగుదియఁ ♦ బట్టినమోములవాంచిభూమికిన్
మ్రొగ్గితురంగముల్ నడువ ♦ బోసనఁబొఱునుసూతులార్వఁగా
డిగ్గెరథావళుల్ ధరకు ♦ శీవిదలిర్వనతిప్రయాసతన్. ౧౨౭.

చ. ఇరుగడమేఘముల్ దనర ♦ నింద్రనగంబునకాభిముఖ్యమై
యొఱపడినంతరిక్షమున ♦ నుండి వెసందిగుసామజోత్కరం
బిరవులపక్షకంపనమొ ♦ కింతయులేకయబ్ధినుండుభూ
ధరవరసామ్యమొందుచును ♦ దచ్ఛిఖరంబునఁబొల్చెనెంతయున్. ౧౨౮.

క. వినువీధిఁబఱచుకౌశల, మునసమవిషమముల నేక ♦ ముగనగ్గిరిపైఁ
జనుసైంధవఖురసరణులు, గనుపట్టెనదీసమీప ♦ గతపులినములన్. ౧౨౯.

క. సెలయేఱులప్రతిరవములఁ, గలసిగభీరముగమ్రోయు ♦ ఘనరథరవముల్
జలదస్వనమనియుద్ధత, గళపింఛతవినుచునీల ♦ కంఠములాడెన్. ౧౩౦.

ఉ. ఉన్నతశైలకూటముల ♦ నుండిగుభిల్లనదూఁకిపాఱుచున్
జెన్నగుపార్శ్వవప్రహరి ♦ నీలమణిద్యుతితోడనేకమై
పన్నినభోంతరంబునవి ♦ భాగముబొందినరీతివింతయై
యున్నఝలప్రవాహమొక ♦ టొయ్యనఁజూచిరిముగ్ధలచ్చటన్. ౧౩౧.

చ. అదలుచుమావటీలఁదమ ♦ యాత్మగణింపకప్రాంతసంచర
న్మదగజగంధలుబ్ధమగు ♦ మారుతమొయ్యనవీవఁగ్రోధతం
బొదలికరేణుసంఘముల ♦ ముందరఁజూచితదాత్తచిత్తతన్
గదిరియతిప్రయాణమున ♦ గంధగజంబులువ్రోవుమత్తతన్. ౧౩౨.

చ. జవమునవచ్చుసాంద్రరథ ♦ చక్రవిఘట్టనచేజనించియ
న్నవసలిలంబులీలనరు ♦ ణంబగురేణువునిండఁదోఁగియ
ద్దివిజవరేణ్యువాహినియు ♦ దీర్ణతపర్ణవివర్ణయైనజా
హ్నవివలెనవ్యపల్లవవ ♦ నంబులునిండదిగెన్మహోర్భటిన్. ౧౩౩.

చ. అలరినివాసయోగ్యమగు ♦ నట్టివనంబులుపూచిపుష్పముల్
వెలయఁగరాలుతావులను ♦ విస్తృతమౌక్తికసైకతంబులన్
జెలువగుశాడ్వలస్థలులఁ ♦ జెన్నగుచుండెడుదివ్యవాహినీ
సలలితతీరభూమివిల ♦ సచ్ఛిబిరంబుగనిల్చెసైన్యముల్. ౧౩౪.

మ. కరమొప్పంగనుజాహ్నవీతటమునం ♦ గంధర్వసైన్యంబులీ
కరణిండిగ్గినవేలమద్దిరికిను ♦ తత్కార్ష్ణందగంజేసెనా
పరసంయోగముశైవయోగమునవౌ ♦ ప్వంజేయఁగాగౌరవం
బరయన్సత్పురుషానుకూలతనసా ♦ ధ్యంబెద్దిభావించినన్. ౧౩౫.

చ. పొలుపుగఁబూచిఘుమ్మురను ♦ భూరుహముల్విజనప్రదేశముల్
కలయఁజిగిర్చినట్టిలతి ♦ కావిసరంబులుదేవకామినీ
లలితతరోపభుక్తిసఫ ♦ లత్వముఁబొందెనునెట్లటన్నఁదా
జెలఁగిపరోపకారమును ♦ జేసినదేకదకల్మియెన్నఁగన్. ౧౩౬.

చ. అలసియుసౌఖ్యమేదియుని ♦ జాగ్రతలస్థితసర్వపూత్కృతో
చ్చలితనవప్రవాళహరి ♦ చందనసంగతిదుష్టసేవకుల్
దలముగనున్నయట్టివిభు ♦ దండనుబోలెనుదత్సురాంగనల్
నిలకతిరస్కరించిరిల ♦ నింధితమేకదదుష్టసంగతుల్. ౧౩౭.

చ. అలయకడానిజీనిపని ♦ యాస్తరణధ్వజకంకటాదులున్
వలనుగడించితచ్ఛ్రిమముఁ ♦ బాపుటకైధరమావటీలుదా
ర్కొలుపనిషణ్ణతన్గదిసి ♦ కుంజరయూథముపాల్చెనత్తటిన్
బ్రళయసమీరభగ్నగహ ♦ నద్రుమవిస్తృతశైలరీతులన్. ౧౩౮.

మ. ఘనమాతంగమనొక్కటిట్లునిజమా ♦ ర్గశ్రాంతిచేనొందుని
ద్రనుజాలించితొలంగినట్టిశయన ♦ స్థానంబునన్దానవా
సనఁగ్రోలన్క్షణమందువ్రాలునచల ♦ త్సారంగజాలంబులే
చినవేగంబునఁజారుశృంఖలగతిన్ ♦ జెన్నొందెఁజిత్రంబుగన్. ౧౩౯.

సీ. ఈరీతిబడలికల్ ♦ దీఱినపిమ్మట, జలములుద్రావింపఁ ♦ దలఁచియప్పు
డారోహణము చేసి ♦ యాధోరణావలి, గంగకుఁ దెచ్చిన ♦ గదిసియవల
వనగజమదగంధ ♦ వాసనల్ వెదచల్లు, పెఱతటంబులమీఁద ♦ నుఱుకఁదలఁచి
సురసరిద్వాహినీ ♦ సరణికడ్డంబైన, ఘూర్ణిల్లుచునుశితాం ♦ కుశనిహతులఁ
గెరలికరములెత్తి ♦ ఘీంకృతుల్ సేయుచు, మసలితిరుగఁబడక ♦ మస్తకములు
ద్రిప్పుకొనుచుమస్త ♦ రించుమావంతుల, సరకుసేయకుండెఁ ♦ గరులుకొన్ని. ౧౪౦.

మ. జలముల్ద్రావఁగవంగినట్టికరిణీ ♦ జాలంబుతుండంబులన్
గలయంద్రావుచుఁబానశేషజలముల్ ♦ గౌరస్రవద్దానసం
కలితంబైనకపోలపాలికలపూ ♦ త్కారంబుత్రోఁజల్లఁద
జ్జలబిందుప్రకరంబుజాఱెనుమదా ♦ సారంబుచందంబునన్. ౧౪౧.

మ. అతితృష్ణన్బడియుండియున్ క్షణముదా ♦ నాఘ్రాణమేచేసిత
త్ప్రతికూలంబుపరేభశంకమదిలో ♦ భావించిరోషంబుతో
మతిసెన్నన్ హిమశీతమైనవనజో ♦ న్మత్తేభదానాంబుసం
యుతమౌతోయముఁద్రావదయ్యెనొకనా ♦ గోత్తంసమవ్వేళలన్. ౧౪౨.

సీ. ఈరీతినీరాను ♦ నిభరాజయూథముల్, జలమెల్లదానసం ♦ కలితముగను
జేసితామరలెల్ల ♦ చెలఁగితుండంబులఁ, బెకలించిగండపా ♦ లికలసారె
తాటించుచునుమహో ♦ ద్ధతిమీఱగుమిగూడి, విహరించికింజల్క ♦ పిహితరక్త
మదరేఖలొప్పఁదా ♦ మరవాసనలనీను, కమనీయతరకపో ♦ లములువెలయఁ
గనకసానుదీప్తిఁ ♦ గడునొప్పునడగొండ, లొక్కొయనఁగమిగుల ♦ నొప్పుమీఱి
మరలెశిబిరమునకు ♦ మందయానంబుల, గంగవెడలివారు ♦ గట్టియంత. ౧౪౩.

మ. ఘనరక్తధ్వజినీరజంబుకలయం ♦ గాఁబర్విసంక్షోభసం
జనితప్రస్ఫురవీచికల్ తటములా ♦ చ్ఛాదింపమాతంగమున్
దనకంజాతపరాగసంచయముశో ♦ ణంబైపిశంగత్వముం
దనరంజెందిజలంబువృల్చెనపుడం ♦ తన్ చిత్రమంజిష్ఠనాన్. ౧౪౪.

చ. నిరుపమకాంతిమీఱిమద ♦ నిస్రుతసప్తవిధస్థలంబులా
స్ఫురణనిబద్ధవామపద ♦ భూరిగళంబులసంగహారముల్
గురుతరఘూపవృక్షవన ♦ కోటులసల్పుచుఁజూడనొప్పెన
క్కరులుజలచ్యుతప్రచల ♦ గంధగిరిప్రకరంబుచాడ్పునన్. ౧౪౫.

క. నిరతము సప్తస్థలముల, ధరణిరజంబుఁగఁదొరఁగు ♦ దంతావళస
త్కూరగంధనిరసనైలా, పరిమళమదగంధమపుడు ♦ పవనముదాల్చెన్. ౧౪౬.

చ. ఉదరిమృగేంద్రయూథములు ♦ హుమ్మనిమ్రోయుచు నిద్ర మేల్కొనన్
జెదరకగర్జితభ్రమను ♦ జెందిసముద్గతకంధరంబులం
బొదలిచకోరకేకికుల ♦ ముల్ జలభూములనాలకింపఁగా
నుదితసురేభబృంహితము ♦ లొప్పెను మేఘనినాదవైఖరిన్. ౧౪౭.

మ. ఘనచిత్రాంబరభూషణోద్వహనశా ♦ ఖల్ మీఱమార్గశ్రమం
బునదివ్యాంగనలాతురత్వమెనయున్ ♦ ముమ్మన్ను గానచ్చటం
దనరంగావిభజించికట్టినగృహ ♦ స్థానంబులన్ రమ్యమై
తనరెన్ దద్వనపాదపంబులుపురో ♦ ద్యానప్రభన్ మించుచున్. ౧౪౮.

వ. తదనంతరవృత్తాంతం బెట్టిదనిన. ౧౪౯.

క. నరకిన్నరవరచారణ, గరుడోరగసిద్ధసాధ్య ♦ గంధర్వపకిం
పురుషామరమునివందిత, చరణాబ్జదయావిలోల ♦ శౌరినృసింహా. ౧౫౦.

మాలిని. అమలకమలనేత్రా ♦ యాంత్రకృద్బ్రహ్మసూత్రా
విమలశుభచరిత్రా ♦ విస్ఫురద్గౌరగాత్రా
విమతతిమిరమిత్రా ♦ వీరలక్ష్మీకళత్రా
సమదదనుజజైత్రా ♦ సన్మునిస్తోత్రపాత్రా. ౧౫౧.

గద్యము. ఇది శ్రీమదహోబలలక్ష్మీనృసింహకటాక్షలబ్ధకవితావిచిత్ర మాద్గల్యసగోత్ర గోపాలునికులపవిత్ర భాస్కరామాత్యపౌత్ర వీరనమంత్రిపుత్ర పరమభాగవతపూజావిధేయ సింగయనామధేయప్రణీతం బైనకిరాతార్జునీయంబను మహాకావ్యంబునందు ద్వితీయాశ్వాసము.

# తృతీయాశ్వాసము.



క. శ్రీరామాకుచతటక, స్తూరీసమ్మిళితవిపుల ♦ శోభితవక్షా
నీరేజపత్రవీక్షా, నారదముఖభక్తరక్ష ♦ నరహర్యక్షా. ౧.

వ. అవధరింపు మివ్విధంబున నానిలింప భామినులు గంధర్వవరులం గూడి తద్వనవిలోకన కౌతూహలంబున నిజమాయాపరికల్పితంబులును, నింద్రచాపసంకాశగోపురంబులును, ననేకమణిప్రభాభిరామంబులును నగుమందిరంబులం జెలువొందుశిబిరంబు వెలువడి.

శా. ఈరీతిన్ శిబిరంబు వెల్వడి సతుల్ ♦ స్వేచ్ఛావిహారంబులిం
పారన్ ఖేచరనాథయుక్తలగుచున్ ♦ హర్షంబుతో జోడుగా
నారామంబటుచొచ్చికుంజగృహదీ ♦ ప్యచ్ఛోభలన్ మీఱుచున్
సారూప్యంబును బొందిరప్పుడులస ♦ త్సౌదామనీరాజితోన్. ౩.

క. వారలకప్పుడువృత్తకు, చోరుశ్రమహారియగుచు ♦ నుజ్జ్వలమణిభూ
షారవజనకధరాసం, చారముధృతిఁ జేసెగగన ♦ చారముకంటెన్. ౪.

వ. అంతనక్కాంత లక్కాంతారంబున లతాంతకృంతనంబు సేయం దొడంగి. ౫.

చ. చెలువుగఁజూచిపుష్పములు ♦ చేతులకందఁగనిల్పికోయుఁడం
చలరెడువృక్షముల్గడచి ♦ యవ్వలికేగిరదెట్లటన్ననన్
జెలఁగుచుఁగాముకుల్ గుణవి ♦ శేషములందుయథోత్తరేచ్ఛలన్
గలసివినోదవైఖరులు ♦ గాంతురుగా దెతలంచిచూడఁగన్. ౬.

చ. అతివలు నేర్పుమీఱఁగళ ♦ మందునలందినగంధసౌరభా
హృతమగుచుంజెలంగిపన ♦ భృంగకులంబులయావకారుణాం
చితమృదుహస్తపల్లవవి ♦ శీర్ణనఖాంశుచయోరుమంజరీ
భృతలగుబాహువల్లికలఁ ♦ బెల్లుగమూఁగెవిలాసమొప్పఁగన్. ౭.

చ. అళివరపానచంచలసు ♦ మాంచితగుచ్ఛతనొప్పమీఱిసం
చలితసుపల్లవంబగుచు ♦ సంతతగాఢతరోష్ఠదంశనో
జ్జ్వలకరచాలనంబువిల ♦ సద్గతిఁదెల్పనశోకశాఖన
ప్పొలఁతులుసూచిసంతసముఁ ♦ బొందిరిమిక్కిలిమానసంబులన్. ౮.

క. అత్తఱినొకసతితుమ్మెద, మొత్తంబులుఝుమ్మురనుచు ♦ ముసరినఁగరముల్
తత్తఱపడివిదళింపఁగ, బిత్తరిమఱియొకతెదానిఁ ♦ జేకొనిపల్కెన్. ౯.

ఉ. మానితనవ్యపల్లవస ♦ మానముశౌకరముల్ విదుర్చుచున్
బూనివృథాపరిశ్రమముఁ ♦ బొందకు వేమదిఁగల్పవల్లికా
నూనపరిభ్రమన్మధుప ♦ యూథములొయ్యననాశ్రయించెని
న్నానకయెట్లునీవిఁకను ♦ మాన్పెదవేఁధయపెట్టిమానినీ. ౧౦.

ఆ. ప్రణయకుపితయగుచుఁ ♦ బతిఁబాసి వేఱొక్క, తరుణిమరలఁగలయఁ ♦ దలఁచియున్న
దానిభావమెఱిఁగి ♦ తరుణి వేఱొక్కతె, పలికెనిట్టులనుచుఁ ♦ బ్రౌఢిమెలయ. ౧౧.

ఉ. కోపముమానవేవిభుని ♦ గొబ్బునఁగూడవె కాకతక్కినన్
జాపలమైననీమనము ♦ చాలతపించును ముందుబోలె నే
నాపలుకెంతయున్నిజము ♦ నాతిరొయంచుననిట్లు నేర్పుమైఁ
దీపుగఁబల్కియల్కవెసఁ ♦ దీర్చిననచ్చెలిగూడెనాథునిన్. ౧౨.

సీ. గురుకాశసూనదు ♦ కూలసారసకల, క్వణితరేఖాకాంచి ♦ కసవ్యజఘన
సన్నిభతీరదే ♦ శప్రభూషితకుంజ, పాథోధియోషిత్స్రి ♦ వంతికలను
అతిమారపాతభే ♦ దితనిర్ఝరప్రసవ, తృప్తితియాతవల్లభో ♦ త్సంగశీత
లాచ్ఛమౌక్తికవన ♦ హాసోపలక్షిత, నిర్మలోదకబిందు ♦ నివహములను
నచలదళిపుంజమృదులాంజ ♦ నాభిశారి, తప్రసూనాక్షిసాదర ♦ తానిరీక్ష్య
మాణనప్రమాంగలతికాస ♦ మాజములను, సంతసంబునఁజూచుచు ♦ సంతమఱియు.

క. వారణమదకలితారుణ, సారస్థిరగండకషణ ♦ జాతశ్యామో
దారమనోహరచందన, భూరుహములుజూచిరంత ♦ ముందరఁజనుచున్. ౧౪.

చ. తరుణులువేడ్కతోఁజెలఁగి ♦ తామునుబూవులుగోయకుండియున్
బరులుపకారముల్ తమకు ♦ వారకచేసెడులీలనిచ్చున
వ్విరులనునాథులందుఁగల ♦ ప్రేమలఁగైకొనిరప్పుడెంతయున్
మురియుచువల్లభుల్ప్రియముఁ ♦ బొందెడునట్లుగసాదరంబుగన్. ౧౫.

క. మఱియొకమానినినాథుఁడు, విరులిచ్చ్యనుసవతిపేర ♦ బెట్టుగబిలువన్
జరణముననేలవ్రాయుచుఁ ♦ గరమల్కనుబల్కకుండెఁ ♦ గన్నీరొల్కన్. ౧౬.

చ. సరసములాడునాథుదెస ♦ సన్ముఖమైతనదృష్టినిల్పితా
నరిమురిపీడిజాఱెడుని ♦ జాంశుకము న్మఱికట్టకయ్యెడన్

సరసనుఁబూలుగోయవేనఁ ♦ జాఁచినయట్టికరంబునుఁ వృథా
రోయుఁగకయుండెవెండియొక ♦ యింతినిజాధిపసక్తచిత్తతన్. ౧౭.

* * * * * * * * * *

వ. అంత. ౧౮.

క. చెలులభలుమాఁగసుండమ, జెలువగు సంపెఁగలుదురతిమి ♦ చిలుకలు బెదరన్
వెలయుజవాదియలందుక, నలవడిగుమిగూడికుసుమ ♦ హారణోన్ముఖులై. ౧౯.

వృషగతిరగడ.

నారినారియశోకమిదిమగు ♦ నారిఁగూర్చిప్రధానబాణము
మారుమాటిదిమనకుముట్టకు ♦ మానినీమణిమధుపతాణము
ఆళిహాళినివిరులుగోయకు ♦ మళికులంబులుప్రమోయుచున్నవి
గోలగోలతఁజిగురుఁగోయకు ♦ కోకిలంబులువదరుచున్నవి
కల్కికలికలఁగోయఁబోకుము ♦ కమ్మతావులవిరులుగోయుము
పల్కుఁబూనుచుఁగర్ణికారము ♦ భామయిల్లిదెదీనిడాయుము
కంటెయీతిలకంబులోకల ♦ కంఠిపూచునుగంటెయల్లవె
అంటుమావిదలిర్చుతావుల ♦ నంటనీవిరులొంటిగిల్లవె
శోభనాంగిపదంబుసోఁకన ♦ శోకమలరులునించునిండఁగ
రాభవన్మృదుగీతిఁబ్రేంకణ ♦ రాజిరాజిలునను చుమెండుగ
బోటినీముఖమెత్తిచూచినఁ ♦ బూచునింపులుదేరసంపెఁగ
నాటఁగౌఁగిటఁజేర్పవలపుల ♦ ననుచుఁగేసరరాజిసొంపుగఁ
జల్లతావులనను చువారుణి ♦ చల్లునీవనివకుళవారము
కల్లగాదుతలిర్చునూరుపు ♦ గాడ్పుసిందిసిందువారము
నవ్వుగాదివెకన్నెపొన్నలు ♦ నవ్వఁగ్రొవ్విరులెలమినినుచును
బువ్వఁబోఁడికొచల్లతావులఁ ♦ బొల్పుమీఱునుజాతులనుచును
నాతినాతిటురాకునీఁదగు ♦ నాతలంగుమునాతలంపిది
చేతికేతికికొడియనేటికిఁ ♦ జేతఁగాదఁటెయేతలంపిది
వాదులేటికిరారెయాసెఱ ♦ వాదులౌదురుచాలుమీచల
పాదితనములుమానియీవిర ♦ వాదియలరులుగోయుఁడిచ్చల
కొమ్మకొమ్మయదేమిచుందరి ♦ కొమ్మవంచెదువిరులుగానవె
యమ్మదొమ్మికిరాకుమదినా ♦ యమ్ముగాదుచలమ్ముమానవె

మొల్లలల్లవె చూడు పూచిన ◆ మొల్లమో తరుణీమతల్లిక
అల్లిబెల్లిగ నల్లి ననిచిన ◆ దల్లజే చెలి మల్లి వల్లిక
వారిజేక్షణలార రారెయ ◆ వారియిల్లి వెసన్న జాజులు
వాసు వారిటు చేరి కోయుఁడు ◆ వాదుదీరి విపుష్పరాజులు
దండనిల్లి వెననిచినవి వే ◆ దంపచూనరో బొండుమల్లెలు
దండిగాఁగను గోయుదము వే ◆ దండదండకుఁ గొల్లకొల్లలు
మంతుకెక్కఁగఁ బూచినది చా ◆ మంతియిల్లి దెరండు చూతము
యొంతవింతలు దీని తావులి ◆ వింతి యొంతయు వేడ్కఁ గోతము
నేరు పొప్పఁగఁ గూడియివిగ ◆ న్నేరు పువ్వులలోన వింతలు
త్రోవ హత్తుగఁ గోయుదముక ◆ స్తూరిపట్టిలు రారె కాంతలు
గోర నేరిచి కోయుమివిగో ◆ గోరఁటులనలి నీలవేణిరో
చేరిక నెయి వెగొండమల్లెలు ◆ చేరి చిదుముము కీరవాణిరో
కప్పురంపుటనంటులివిగో ◆ గప్పుగప్పన తావిఁ జిల్కెడు
విప్పువారి నదీ పలాశము ◆ విప్పు క్రపపులప్పులొప్పెడు
పాటలాధరి చూచితేయిదె ◆ పాటలంబుల పూఁతచక్కన
మాటలేటికి జాగు సేయుక ◆ మానినీమణిరా వెగ్రక్కన
రంగుగాఁగఁ దలిర్చినవి నా ◆ రంగములు ని వెరెండు వేడుక
నంగనామణులార కోయుద ◆ మందఱము తగ గుములు గూడుక
విందుగాఁగఁ దలిర్చినవి గుసు ◆ విందలిల్లి వెమానినీమణి
యిందురాఁగ దరమ్ము యువ్వలి ◆ కేగ నేటికి మానియీమణి
వారిజాక్షిరొ కింశుకముల ◆ వ్వారియిచ్చుట రారెయిల్లి వె
కీరవాణిరొ వింతరుచిరా ◆ గిల్లుచున్నవి చేరి గిల్లవె
సౌరభంబులకెల్ల హెచ్చిది ◆ చానయీ కుఱువేరు దీయవె
వేరుసేయఁగఁ దగు నెయీవటి ◆ వేసు నేరుపుమీఱఁ గోయవె
అమ్మమసు వను వింత తావుల ◆ నలరుచున్నది వేడ్కఁ జేకొను
కొమ్మపండిన మేల్మి ఫలములు ◆ కొల్లగాని వెనిండెఁ గైకొను
కోమలిరొ యివె మావిపండులు ◆ కొల్లకొల్లలు రండు వైళము
చామ గన్గొను మల్ల వేయుటఁ ◆ జాను చందన పుష్పగోళము

లికుచకుచ యివె లికుచఫలములు ◆ లీల మీఱఁగఁ బట్టి కోయుము
చకితహరిమృగశాబకాక్షిర ◆ సాలఫలములు నెమ్మిఁ గోయుము
పీరు వారసకిం మరందివె ◆ వేఁ పనసలు మధురవాణి కో
ధాయణీస్థలి ద్రస్నిగమ్మని ◆ తాఁ బిఁజిల్కెడుఁ జిగురుఁబోణిరో
నాయలారయు పాకమిది గో ◆ నారికేళఫలంబులిచ్చటఁ
జేరి నేర్పున లెక్కకోయుఁడు ◆ శీఘ్రమే యివి సేయుము చ్చట
పూగఫలములు గోయుఁడి వెక ◆ ర్పూరగంధులు చెంతనిల్లి వె
నాగవల్లి దళంబులేరిది ◆ నాతిచిదుముఁడు పొంతవల్లవె
యను చనొండొరు లెచ్చరించుచు ◆ నాత్మనాథుల తోడఁ గూడుక
మనములలరఁగ లీలతోఁ గుసు ◆ మములు గోసిరి నిండు వేడుక. ౨౦.

చ. చిగురులు పూవులిల్లివిగొ ◆ చెంతనె యల్ల దె యంచు నిట్టుల
మ్మగువలు గోయఁ దద్వనస ◆ మంచితలక్ష్మి వసించె వేడ్కన
జ్జగతిరుహంబులం గడున ◆ సారతఁ బోలె నవీడి యప్పుడా
ముగుదల యందుఁ బుష్పపరి ◆ పూర్ణత మీఱఁ బదంబు సేయుచున్. ౨౧.

సీ. కిసలయంబులు గోయఁ ◆ గెంగేలఁ ద్రదస, మంటి యత్యరుణత ◆ నతిశయిల్ల
గబ్బిసిబ్బెపుటుబ్బు ◆ గుబ్బలు పుష్పాడి, నిండియత్యంతపాం ◆ డిమతఁ దనర
నెరతావిఁ గుల్కెడు ◆ వరపుష్పములచేతఁ, దనుపల్లికలు సుగం ◆ ధతను వెలయఁ
గుసుమావతంసముల్ ◆ కోరితుర్మట్టఁ జేసి, ధమ్మిల్లములు గుసు ◆ త్వమును నెనయ
నలరుయువతి సమూహంబు ◆ లచట నొప్పె, భూరుహంబుల వలనవ ◆ పుష్పగణాధి
కతను బొందినగతిఁ జాల ◆ నతిశయిల్లె, నరసి చూడఁ బదారామ ◆ సరణినపుడు. ౨౨.

తే. కోరి యీరీతిఁ బువ్వులు ◆ గోసి యంత, మరుని బూజింప నొకకొన్ని ◆ సిరుల దాఁచి
కడమ వలసిన వన్నియు ◆ నొడల నించి, యలరు నాథుల తో జాజ ◆ రాడఁ దలఁచి. ౨౩.

చ. ముదిత యొకర్తు పుష్పములు ◆ ముష్టిని బట్టిని జేశుమీఁద దా
ముదమున నేయ నాతఁడును ◆ ముద్దియ నేసిన మస్తకంబులన్
జెదరక నిండు పువ్వులవి ◆ చెన్నువహించె వివాహవేళసం
పదదళుకొత్తఁ బోయుతల ◆ బ్రాలవిధంబునఁ జూడనొప్పె మున్. ౨౪.

చ. పడఁతి యొకర్తు నాథుఁడు స ◆ పత్నికిఁ దాఁగ ముఁ గూర్చునం చు ల్గోఁ
భోఢమిన ఖేదమిం దునను ◆ బోవఁగఁ జేసెదనంచుఁ బువ్వులన్

బడిబడి నేయనవ్విరులు ♦ భావజుతూపులు బోలె నిండిన
య్యెడయఁడు గౌఁగిలించి సతి ♦ నోర్వఁగఁ జేయ సనోర్చె నాతియున్. ౨౫.

ఉ. గొజ్జఁగిపువ్వు లేర్చి యొక ♦ కొమ్మ కరంబున నిండఁ బట్టి తాఁ
గజ్జలరేఖలొప్పు తెలి ♦ కన్నుల నాథుని బాఱఁజూచుచున్
అజ్జలు చేసి మేసి దర ♦ హాస మెలర్పఁగ నార్చె నాదిపో
గజ్జెలచేయుటంచు తన ♦ కాంతుఁడు సస్మితమంది చూడఁగన్. ౨౬.

చ. అలరు సపత్ను లిద్దఱును ♦ హర్షముతోడ తనావలీవలన్
నిలిచిన జేకుఁ గ్రమ్మికడు ♦ నెమ్మదలిర్పఁగ నేయు నాతఁడున్
దలఁకక హస్తలాఘవము ♦ దప్పక కోసె నను వారి నిద్దఱన్
అలరులతూపులన్ మదనుఁ ♦ డాత్మగలంగఁగ నేయుచాప్పునన్. ౨౭.

ఉ. మొల్లసుగంధి యోర్తు కడు ♦ మోదముతోఁ గరకంకణధ్వనుల్
ఘల్లున మ్రోయఁ గాఁ దనదు ♦ కాంతుని నేసిన వేఁట మేలెనా
వల్లభుఁ డేసిన న్మగుని ♦ వారణలీలలఁ బాఱఁజూచెఁదా
నల్లవిభుండు వేఁట నిజ ♦ హస్తిపకుండును బోలె నంటఁగన్. ౨౮.

తే. మగని యేనుఁగు విడివడి ♦ తఱుముకరణిఁ, దన్ను నెడఁబాయఁ దీసెడు ♦ తలఁపుతోడఁ
బఱచుచుండెడు తనకూర్మి ♦ పతిని గూడఁ, దతిమి యేసె నొక్కర్తు సం ♦ తసముతోడ.

చ. విరహుల నేఁచు చందురుఁడు ♦ వీఁడె యటంచును నొక్కయింతి దా
వరుని మొగంబుఁ జూచి తన ♦ వైరము దీఱఁగ నేయ నేఁడు గా
దొఱకె నటంచుఁ బుష్పములు ♦ తోరపుముష్టినిఁ బట్టి యేయన
వ్విరులు శరౌఘమో యనఁగ ♦ వింతఁగ నిండెను దన్ముఖంబునన్. ౩౦.

ఉ. కంజదళాక్షి యోర్తు కట ♦ కధ్వని మర్దళఘోషమై తగన్
మంజులభూషణాభ తెర ♦ మాడ్కి నెప్పఁగఁ దేఁటిగానముల్
రంజిల నాట్యవేళ సవి ♦ లాసము గాఁగ నొసంగు నట్టిపు
ష్పాంజలి నాఁగ నొప్పఁగని ♦ జాధిపు నేసెను బుష్పముష్టులన్. ౩౧.

తే. ముదిత యొక్కతె పువ్వులు ♦ ముష్టి నెత్తి, పెనిమిటిని నేసెఁ దద్రయ ♦ మునను మేను
మఱఁదు విరహుల నేఁచంగ ♦ మఱిదలంచి, యపుడు జలిపించు పైఁడిబా ♦ కనఁగ మెఱయ.

లయగ్రాహి.

అప్పుడొక నాతి వెసఁ ♦ బుష్పొడిని నాయకుని, గుప్పునను మోమురయ ♦ మొప్పఁగను నేయం
దప్పకను నాతఁడును ♦ గప్పురము చేమరల, నప్పడఁతి నేయనది ♦ దప్పకొని పఱవం

గొప్పచు డివిడికురు ♦ లుప్పరము లెగయుచును, గప్పుచును మోమునను ♦ గప్పినను బఱవన్
దప్పినిలనాతఁడును ♦ దెప్పనను గూడనది, ద్రిప్పినను మోమునను ♦ గుప్పెరజ మొప్పన్.

లయగ్రాహి.

కొమ్మమఱియొక్కరితె ♦ తమ్ములను నేర్చిపయిఁ, గ్రమ్మితననాయకుని ♦ నెమ్మొగము నేయన్
దమ్ములనలంచునల ♦ తమ్మిపగదాయయని, యమ్మొగముఁ జూచియువి ♦ పమ్మియిననాతం
డమ్మగువ నేర్చికుము ♦ దిమ్ములను నేయనవి, క్రొమ్మెఱుఁగుఁ గ్రమ్మరుచు ♦ లమ్మిహరు తేజం
బమ్మయనియంతవిత ♦ థమ్మయిన నెంతయును, సమ్మదము నొందిరల ♦ కొమ్మయు నతండున్.

తే. తరుణియొక్కతె వరునిక్రొ ♦ వ్విరుల నేయ, నాతఁడయ్యింతి మరలంగ ♦ నప్పుడేయ
విరులు తలనిండి చూపట్టె ♦ వింతయగుచు, నలరులనుగట్టుసూసక ♦ మనఁగఁ దనరి. ౩౫.

ఉ. పుప్పొడినిండఁ దోఁగియుల ♦ మూఁపునఁ గ్రొమ్ముడిజాఱి పెన్నెరుల్
గప్పలలాటమందిడిన ♦ కస్తురిబొట్టుదలిర్పఁ జూడఁగా
నప్పుడు వాల్చె వెండియొక ♦ యంగన సామజకృత్తివాసుఁడై
యొప్పులలాటలోచనుఁడొ ♦ కోయన నెంతయు వింత మీఱఁగన్. ౩౬.

తే. వెండియొకయింతి గనుపట్టె ♦ వింతయగుచు, వరుఁడుపై నేయుక్రొవ్విరుల్ ♦ శిరమునిండి
తారకాకీర్ణమగు నభోం ♦ తరము మాడ్కిఁ, గొప్పగనుపట్టనొకవింత ♦ యొప్పమీఱె.

వ. ఇవ్విధంబున విహరించి తత్ప్రతిసానుసమీపమార్గములనుండి వెలువడి యలసయానంబులం జనుదెంచు బృందారకసుందరీసందోహంబులు కరికరస్థూలోరుకాండభారంబున నత్యంతచిరకాలంబునకుం గూడ నడుచు నవపల్లవకోమలత్వంబున సమస్థలినైన నడువనోపక మదవిహ్వలత్వంబునం బోలె, నడుగడుగునకుఁ దొట్రుపాటు గదుర మెట్టెడు మృదుపదంబులను బ్రవిసారితకాంచికానవరత్నప్రభాసముద్భవమనోహరోత్కర్షం దనరి సుకుమారవస్తులత్వంబున నతిశయిల్లుచు విమలపులినంబులం గెల్చి నిలిచినట్లలరుచు నత్యంతగౌరవంబులై పథపరిశ్రాంతిఁ బొంది కన్పట్టు జఘనంబులును, సముచ్ఛ్వాసత్వం కజకోశకోమలంబులై తనరారు నాభిప్రదేశంబులచేత నివి సమీపంబుల నత్యంతకాంతిజనకంబులగు వళిమధ్యలగ్నంబులయందు స్తనాతిభారంబున నమ్రత్వంబొందు నుదరంబులను, సమంతతఘర్మాంబుకణపరివృతంబులై యవికచలోచనంబులం దనరారుచుఁ దుషారపరిష్కృతాస్ఫుటదళసరోరుహసదృశంబులైన ముఖంబులును విస్మయంబుగా నిరూపించుచుం జూచు ఖేచరుల కపూర్వవిలోకనకౌతూహలంబు పుట్టించుచు, గంగాతీరంబుఁ జేరం జనుదెంచి జలక్రీడాసమారంభంబునం బొదల నప్పుడు. ౩౭.

చ. చలదురుమీనఘాతజల ♦ జత్వముద్రఝుషచేష్టయైతగన్
దోలఁకుతరంగముల్ కరవి ♦ ధూనతఁదెల్పఁగహంసనిస్వనం
బులుపలుకుల్బలెందనరఁ ♦ బొల్చెసురాపగమత్తటంబుని
ర్మలమిదియంబుకేళికిటు ♦ రమ్మనిపిల్చినలీలనత్తఱిన్. ౩౯.

చ. మలయుచుఘుర్మశాంతిగను ♦ మందగతింబ్రసరించివీచుత
జ్జలజసుగంధగంధియుల ♦ సజ్జలశీకరసంయుతంబునై
యలఘుతరంగచారియును ♦ నైనసమీరముతత్సురాంగనా
వలికిఁగరావలంబనము ♦ వారకయిచ్చినలీలమీఱఁగన్. ౪౦.

వ. అప్పుడు. ౪౧.

మ. సవిలాసంబులమీఱుయానములహం ♦ సశ్రేణిసంచారము
న్నవలావణ్యనితంబయుగ్జఘనవి ♦ స్తాణంబునన్ సైకత
చ్ఛవిదీర్ఘాంచితలోచనాననములన్ ♦ సారాంబుజాతంబులన్
అవమానించుచుఁబొల్చిరెంతయునుది ♦ వ్యస్త్రీలుశోభిల్లుచున్. ౪౨.

వ. అంత. ౪౩.

క. జలకేళికాయితంబుగ, వలిపపుఁజేలములుగట్టి ♦ వకులగుగంధ
ర్వులువేదుర్గ్రహభయమున, కలరఁగమునుదిగినపిదప ♦ నతివలువేడ్కన్. ౪౪.

చ. అళికివిభిన్నయూథతను ♦ బ్రాంతములన్వెసఁబాఱుమీనముల్
గలుగుజలంబులద్దివిజ ♦ కాంతలుమున్నుపయోవిహారముల్
సలుపనిచోటుగానమనిఁ ♦ జంచలమందుచుఁజాలభీతిజొ
త్తిలఁగనుజొచ్చిరొయ్యనన ♦ తిప్రసభాత్మతమాటికుల్కుచున్. ౪౫.

చ. ఉరుతరయత్నభారమృదు ♦ లోజ్జ్వలవర్తులితోరుకాండవి
స్ఫురదమరీసమూహమటు ♦ చొచ్చినమాత్రనెఘూర్ణమానమై
పొరలితరంగమాలికలు ♦ బోరునఁదీరముల్రాక్రమింపఁగా
నిరవుగనుండుహంసకుల ♦ మెల్లనుబెగ్గిలిపాఱఁజేయుచున్. ౪౬.

మ. కరమొప్పంగశిలాసమానవిలస ♦ ద్గంధర్వవక్షోహతిన్
సురనారీపృథులస్తనాహతులవీ ♦ చుల్వ్రీలితత్తోయముల్
దరికింజేరుచురోషతంగదియుచం ♦ దానంగలంకత్వముల్
బొరసెన్నేదినిఁగర్కశాహతులచేఁ ♦ బూతాత్మకుల్లగ్గరే. ౪౭.

ఉ. కొప్పులువీడఁగానడిచి ♦ గొజ్జఁగిదండలుజాఱఁగొట్టియుం
గప్పురగందముల్ చెదరఁ ♦ గావెసఁదాఁకియుఁబెక్కునేరముల్
తప్పకయీగతిన్ సలిపి ♦ తత్సతులందఱిభీతిచేబలెన్
దెప్పరమైనకంపమునఁ ♦ దేలుచునుండెనుపేమలత్తటిన్. ౪౮.

చ. సవతుకఁజూడఁజాలదని ♦ చయ్యననొక్కతెకుంకుమంబుచ
న్గవకునలంకృతంబనుచుఁ ♦ గన్పడకుండఁగఁబూసిదాఁచునా
నవనఖరక్షతంబులుగ ♦ నంబడెఁగుంకుమబోవజిక్కుత
ల్లవములుబోలెనప్పుడువి ♦ లాసముమీఱఁగఁజూడనొప్పుచున్. ౪౯.

సీ. అళులుకనీనిక ♦ లట్లులీనతనున్న, వజ్జపత్రములాలో ♦ లాక్షికనులా
ఝుంకారరహితమై ♦ చలియింపకున్నవి, యళిబృందమోపక్ష్మ ♦ లాక్షికురులా
దరహాసవిస్ఫుట ♦ దంతకేసరమైన, దిదివిరిపద్మమో ♦ యింతిముఖమొ
కరకంజసంగతా ♦ గ్రతనొప్పచున్నవి, పటుబిసంబులొకాక ♦ బాహులొక్కొ
యనుచునీరీతిసందియ ♦ మందియుంత, నలినవనమునదాఁగిన ♦ పొలఁతిగాను
నిశ్చయించిరిమదిలోన ♦ నిపుణలైన, సకియలొకకొందఱప్పుత ♦ త్క్షణమునందు. ౫౦.

చ. వెలఁదియొకర్తునాయకుఁడు ♦ వింతగఁగూర్చిసపత్నిసన్నిధిన్
వలుదకుచాంతరంబునను ♦ వైచినపువ్వులదండఁదాజలా
విలమగునట్టిదేనియును ♦ వీడకతాల్చెనుసల్లెకాగుణా
వలివసియించుఁబ్రేమగల ♦ పట్టునిల్వవుప్రేమలేనిచోన్. ౫౧.

సీ. కాంతలుదీర్చిన ♦ కాటుకల్ నెరయంగఁ, బక్ష్మాంతరక్తిమఁ ♦ బర్వకుండ
నరికట్టుటకుగాని ♦ యదినిశ్చయంబుగా, శోభితార్థముగాదు ♦ సూతిలంప
గుఱుతిందుకదియుటఁ ♦ గరఁగిపోరక్తిమ, నెఱసిలోచనముల ♦ నెఱుపుమించె
శోభయెప్పటియట్ల ♦ చూపట్టుచున్నది, యదిశోభితార్థమే ♦ యైనదేని
దానిశోడశోభ ♦ తలఁగకయుండునే, యనఁగఁజూడనొప్పి ♦ రతివలపుడు
జలములందుఁగేళి ♦ సవిలాసవైఖరి, సలుపుచుండివింత ♦ చెలువుమీఱి. ౫౨.

చ. పొలఁతులుకొప్పులన్ దుఱుము ♦ పువ్వులబంతులువేగయుక్తమా
జలములచేతలోభమున ♦ జాడ్యులచేబలెనాహృతంబులై
కలయఁగఁదెప్పదేలియథి ♦ కారముమారునమాత్యులుంబలెన్
దలఁకుచునత్తటింబొలసెఁ ♦ దత్క్షణసంభవశోభనత్వమున్. ౫౩.

చ. గతమకరీకలాపనవ ♦ కజ్జలయావకగండదృక్స్తనం
చితమధురోష్ఠలయ్యుఁగడు ♦ చెన్ను వహించుచునుండునట్టియా
యతివలఁజూచిఖేచరులు ♦ హర్షమునొందిరితద్వపుఃప్రక
ర్షతయెవిభూషణంబులకుఁ ♦ జాలనలంకృతియంచు నెన్నుచున్. ౫౪.

వ. అప్పుడు. ౫౫.

చ. అలరువిలాసినీసముద ♦ యంబటమున్ననురక్తిమీఱఁగాఁ
జెలువులొనంగుసొమ్ములను ♦ జెన్నుగఁదాల్చియుఁజేయదయ్యెఁద
త్సలిలతరంగసిక్తనవ ♦ చారునఖక్షతజాతకాంతిచేఁ
దెలియుసపత్నిజాలముల ♦ దృష్టితపింపఁగఁజేయుకైవడిన్. ౫౬.

చ. అలరుమొగంబులుంజలిత ♦ హారములున్నరుణాంగశోభలున్
గలిగినసారభామినులు ♦ కన్గొనునొప్పిరిపద్మయుక్తమై
చలితసుఫేనముల్గలిగి ♦ సంక్రమితా * గ్నిశిఖాచయంబులై
పొలుచుతరంగసామ్యమునఁ ♦ బొందుచునింతయు వేఱులేదనన్. ౫౭.

మ. కరమొప్పంగనునొక్కచేతనుబుకం ♦ గాఁదోసి వేఱొక్కచేఁ
జలవన్నర్దళవాద్యలీలజలముల్ ♦ సారధ్వనిన్మ్రోయఁగా
భరతప్రక్రియమీఱుతాళగతులన్ ♦ బాగొప్పఁగానృత్యమున్
గరిమన్జేసెడులీలఁగంపిలునుద ♦ త్కాంతాకుచద్వంద్వముల్. ౫౮.

చ. విమలతమీఱువారలకు ♦ వేడుకతోవిహరింపయోగ్యమై
యమరుచుఁదత్సతీసదర ♦ హాసహసజ్జలజానుబింబితా
స్యములనలంకృతంబగుచు ♦ నంబువులొప్పఁగఁబొల్చెగంగదా
నమలతమున్ఫలంబుఁగని ♦ నట్టులఁజూడఁగనట్టివేళలన్. ౫౯.

క. పొరలుచుమీనములూరువు, లొరసినభయమందిచొచ్చి ♦ యుచ్చలితముగాఁ
గరములువడఁకఁగఁదత్సతు, లొరపైనఖులకును సహిత ♦ మొప్పిరిమాడన్. ౬౦.

ఉ. మానినియోర్తుతోయముల ♦ మత్స్యసమాహతిచేభయంబులో
నూనినదింబలెన్మదము ♦ నొందఁగవల్లభుఁగౌఁగిలించెనాఁ
జానలకృత్రిమప్రియుర ♦ సప్రభవోజ్జ్వలహావభావకృ
న్మానితకైతవక్రియల ♦ మానసముల్హరియింతురేకదా. ౬౧.

---

* అగ్నిశిఖా = కుంకుమము.

సద్గురుగర్వమోర్వసుల ♦ భంబది వేఱొక వేళనైననీ
సద్గుణనాదినింద్యతయె ♦ చాలఘనంబుగదా తలంపఁగన్. ౩౦.

ఆ. అకులఁద్రుంపనృపుల ♦ కపవాదమగు టెట్లు, మిగులయశమెకాక ♦ జగతిలోన
ననుమఁదలఁచెదేని ♦ నఘమాత్రవినిపింతు. మునివరేణ్య తెలియు ♦ వినుముతగను.

క. ఇలలోనఁదలఁపజలధుల, జలములః సుస్థిరలమాన ♦ సంబులుమర్యా
దలుదప్పవెఱచి కావే, కలఁచఁబడియుఃస్వచ్ఛమగుచుఁ ♦ గన్పడునన ఘా. ౩౨.

ఆ. సకలనృపులలోన ♦ జాతశత్రుండన, వఱలుధర్మజునకు ♦ స్వజనవైర
మెట్లు సంఘటిల్లె ♦ నిటువలెనన్నను, వినుము తెలుపువాఁడ ♦ విశదముగను. ౩౩.

క. ఆతతధృతరాష్ట్రతనూ, జాతులతో నేముః సేయు ♦ సౌహార్ద్రమెయీ
రీతిని వైరమునకుఁదా, హేతుకమైపగను బెనిచె ♦ నెంతయుఁగినుకన్. ౩౪.

క. ఆరసు సౌహార్ద్రముమతి, వైరమునకు హేతువని ♦ వ్యత్యయమనుచున్
మీరలుమదిశంకించిన, సారమతిం దెలియవినుఁడు ♦ జగతిఁదలంపన్. ౩౫.

క. అరయఁగదుర్జనసంగతి, నెఱివిడిపడు నేటిమొద్దు ♦ నీడలుసుమసూ
హారమై చేరినఁబైఁబడి, చెఱచినక్రియ మైత్రినుండి ♦ చెఱచునెకాదే. ౩౬.

క. వారలవృత్తము మొదటనె, సారమతిం దెలియకెట్లు ♦ సాంగత్యంబున్
మీరలు చేసితిరన్నను, దారగుణా తెలియవినుము ♦ ధారుణిలోనన్. ౩౭.

ఆ. నిందలకును వెఱక ♦ నిగ్రహానుగ్రహ, ములనుసామ్యవృత్తి ♦ మెలఁగునట్టి
దుష్టవర్తనంబు ♦ దుర్విభావము గాదె, దైవగతియుఁబోలెఁ ♦ దలఁచిచూడ. ౩౮.

క. మీరిట్లభిమానులువా, రారీతింబరిభవింప ♦ నసమర్థులయి
శ్లేరీతి నోర్చియుంటిరి, యూరక యనియుంటివేని ♦ యునువినుమనఘా. ౩౯.

చ. అకులుతిరస్కరించుటను ♦ నప్పుడె నాహృదయంబునష్టమై
యరిమురిఁబోనెపోవునపు ♦ డాచనురోషముతత్ప్రతిక్రియా
కరణకరావలంబనము ♦ గ్రక్కుననిచ్చుచునట్లుగానవా
వెరవుననిల్చెఁగానిమతి ♦ వేఱొకటైననునిల్చియుండునే. ౪౦.

సీ. పరిపంథులకునోడి ♦ పరిభవంబును బొంది, హరిణాదిమృగసము ♦ త్కరముకరణి
వన్యఫలాహార ♦ వర్తనంబునడస్సి, యన్యోన్యమునమేము ♦ నైదుగురము
లజ్జించియత్యంత ♦ లాఘవంబుననుంటి, మటమున్నెసహచరు ♦ లనఁగనేల
నైననీకొకనికి ♦ నభిమానమేమని, యనియెదవేనిమ ♦ హాత్మవినుము

కడఁగియగుసునీచేతనీ ♦ కార్యమనుచు, వ్యాసమునిపల్కు నిచటికి ♦ వచ్చియిట్లు
శత్రుజయ మొందమదిని ని ♦ శ్చయము చేసి, యొంటినీరీతిఁ దపియించు ♦ చున్నవాఁడ.

గీ. అరయదుఃఖైకభాజనం ♦ బాత్మశత్రు, వైనయభిమానమదివిడు ♦ మనెదవేని
శక్తివికలతలఘుతని ♦ స్సారుఁడైన, మానహీనుండుతృణమున ♦ మంబుగాదె. ౮౨.

వ. అదియునుంగాక యభిమానంబు విడిచిన దోషం బేమని యంటి వేనియు మహీధరసంబంధంబులైన తటశృంగాదికంబుల యౌన్నత్యంబు విచారించిన నౌన్నత్యాభిమానంబు ప్రియంబుగాకుండు టెట్లు? అభిమానవంతుండయి యశస్కరుండైనవాఁడు పురుషుండని యన్నంబడుంగాని యితరంబుగాదు. అట్టివాని పేరు పురుషగణనాప్రస్తావంబున మొదట నెన్నంబడి ద్వితీయసంఖ్యం జెందని దదియునుంగాక దురాసదంబులైన వనంబులచేతం బరివేష్టింపఁబడియున్న పర్వతంబునునైనను నధిగమించ నెంచుంగాని మహాజస్కుండై ప్రతాపాభిమానోన్నతుండైన పురుషుని నతిక్రమింప శక్యంబుగాదు. అట్టివాఁడు స్వాభిధానంబుచేతనే నిజవంశజాతులకు రఘుదిలీపాదులుం బోలెఁ బ్రసిద్ధి సంపాదించునట్టి పురుషుల భరియించుటం జేసి యివ్వసుంధరయు నన్వర్థనామంబునం బ్రశంసింపంబడు. అట్టివానికీర్తియు శశాంకమండలంబుం గళంకత్వంబునం బొందించునట్టి యశంబును నభిమానవంతునకుంగాని సంభవించ నేరదు. అదియునుంగాక, యెవ్వని కోపంబు శుష్కాశనిసన్నిభంబై శత్రులం గీఁటణంగించు నట్టిపురుషుండు రఘురామాదులుంబోలె విజయాశీర్వాదంబులం బొంద నర్హుం డట్లు గావున నెల్లభంగుల నభిమానంబు విడుచుట యుక్తంబుగాదు. అదియునుంగాక, విజయాభిమానంబున నఖిలభూతాభిద్రోహంబునకుఁ జొచ్చుట యుక్తంబె యని యంటివేనియు, నేనిప్పుడు తరంగిణీ భుజంగతరంగచంచలంబగు సుఖంబునుం గోరుట లేదు. త్రికాలనిత్యంబై నిర్బాధకంబైన బ్రహ్మపదంబును వాంఛించుటలేదు. ఇం కేమని యంటివేనియుఁ గపటంబున శత్రుకృతంబైన యపకీర్తిపంకంబు వైధవ్యంబునం దపించు నరాతివనితాజనలోచన వినిసృతంబులైన జలంబులఁ బ్రక్షాళనంబు సేయం దలంచి యున్నవాఁడ మఱియును. ౮౩.

మ. ననుఁగాదేని యుఁబండితుల్ సభలలో ♦ నన్నవ్వినన్నవ్వని
మ్మనఘా నాదగుబుద్ధియెల్లవికలం ♦ బౌనేనిఁ గానిమ్మునీ
వును నీమూర్ఖునకేల తెల్పితివృథా ♦ యోగ్యుండు గాఁడంచుఁ జిం
తనులజ్జన్వెసఁ బొందెదేని వినుమో ♦ ధన్యాత్మ నే నెంతయున్. ౮౪.

ఆ. అరులనెల్లఁద్రుంచి ♦ యస్వీయవృత్తిని, నుద్ధరింపకాత్మ ♦ నొందుదలఁప
మోక్షమైనవిజయ ♦ మునకంతరాయంబ, టంచుఁదలఁతుఁగాని ♦ యనఘవినుము.

మ. అరయంగానిదిపోదురాగ్రహచటం ♦ చంచేని నేవీరుఁడి
ష్ఠరలోకశత్రులుపుచ్చుకొన్నయశముం ♦ దానెంతకాలంబుపే
శరజాలంబులయేపుసూపిమగుడన్ ♦ సాధింపఁడందాకనా
నరుఁడేపుట్టుటకల్లపుట్టెననుకో ♦ న్నంజచ్చువాఁడిట్లుకా
కిరవైనిల్చినఁబూరితోసమువాఁ ♦ డేభంగిపూర్ణాఖ్యుఁడో. ౪౬.

ఆ. వీరధర్మవృత్తి ♦ విడిచినదోషమే, మన్న నెవరికోప ♦ మరులఁద్రుంప
నుపశమించునతని ♦ కూరకేపురుషోక్తి, చెల్లుబెట్టునీవె ♦ చెప్పుమనఘ. ౪౭.

ఆ. పురుషశబ్దముననె ♦ పుంవ్యక్తిమతిలేదె, యానినజాతిమాత్ర ♦ మైనపురుష
శబ్దమునను నేమి ♦ చాలించుపశ్వాది, జంతువులనుబురుష ♦ జాతిలేదె. ౪౮.

క. కావునఁబురుషార్థముమఱి, భావింపఁగలేనివాని ♦ బ్రతుకేటికివాఁ
డావలనేటికిఁగొఱమఱి, భూవినుతా తెలియవినుము ♦ పురుషునివిధమున్. ౪౯.

మ. తనరంగా సభసద్గుణాఢ్యుఁడనిపె ♦ ద్దల్ పక్షపాతంబునన్
గొనియాడన్వినువారితేజముదలం ♦ గన్ సామ్యహీనంబుచే
ననఘాత్మామఱివాఁడెపూరుషుఁడుప్ర ♦ ఖ్యాతుండునున్ వానిపే
రనయంబున్వినిశత్రువైననుబ్రమో ♦ దాశ్చర్యతందేలెడున్. ౫౦.

ఆ. అయిననీకొకనికి ♦ యభినివేశంబేమి, భీముఁడాదియైన ♦ పెద్దలుండ
ననుచుఁదలఁచెదేని ♦ యదియునువినిపింతు, ధన్యచరితవినుము ♦ తథ్యముగను. ౫౧.

చ. తలఁచుప్రతిజ్ఞకుందగఁగఁ ♦ దద్రిపులన్ రణరంగభూమిఁదా
గెలువఁగనెంచిధర్మజుఁడో ♦ కించుకకూరిమిఁగార్యమంతకుం
దలముగనన్నుమోపినక ♦ తంబుననెంతయుఁదృష్ణనొందువాఁ
డలరుజలాంజలిందలఁచి ♦ నట్లుదలంచునుగానఁబూనితిన్. ౫౨.

ఆ. ఏడధర్మతనయుఁ ♦ డీకష్టమేటికి, నీస్వకార్యమిపుడు ♦ నిర్వహించు
కొనుటయుక్తమనుచు ♦ ననెదేనివినవయ్యా, తాపసేంద్రసావ ♦ ధానముగను. ౫౩.

క. ధరనెవఁడాపదవేళల, నరయకతనరాజునాజ్ఞ ♦ వ్యర్థము సేయున్
మఱివాఁడేకులఘాతకుఁ, డరయవిమలశశికళంక ♦ మట్లుతలంపన్. ౫౪.

వ. అదియునుంగాక రణోత్సాహంబు విడిచి శాంతుండవై యతివిగమ్మని యంటివి విది
ధర్మవిరోధం బెట్లంటివేని మొదల బ్రహ్మచర్యాశ్రమంబును దదనంతరంబున గృహ

స్థాశ్రమంబు నంత వానప్రస్థవృత్తియు నటమీఁదట యత్యాశ్రమంబునుం దగు నని శ్రుత్యనుసారంబుగా మన్వాదులైన పెద్దలచేత విధింపంబడియుండు. అట్లాశ్రమానుసారంబుగా నడుచుట యుక్తం బనియును దద్వ్యతిరిక్తాచరణం బయుక్తం బనియును, పండితులవలన వినంబడు. కావున నీవు గృహస్థుఁడ వై యుండియు, మునిత్వంబు ధర్మవిరోధం బనెద వంటివేనియు గృహస్థుఁడ నయ్యును, తత్కర్తవ్యంబులైన కృత్యంబు లాచరించి కృతకృత్యుండ నైనవాఁడం గాను. కావున మునిత్వంబు ధర్మవిరోధంబుగాదు. అదియునుంగాక నీతిగరిష్ఠనిష్ఠావిశిష్టుండును, శిష్టాచార్యుండును మదగ్రజుండును నైన యుధిష్ఠిరుం డుండ నాకు నాశ్రమాంతర స్వీకారంబునకు స్వాతంత్ర్యంబులేదు. ఇప్పు డవశ్యకర్తవ్యంబుగా మోచియున్న వైరినిర్యాతనభారంబును దూరంబై యున్నయది. మజ్జననియు నట్లనె దూరంబున నున్నయది. తదనుజ్ఞ వడయక తపస్యాచరణంబున కధికారంబు లేదు. క్షత్రధర్మంబు విడిచి రాజు లాజులం బలాయమానం బగుదురె? ఇంతకంటెను ధర్మవిరోధం బొం డెద్ది? పలుమాటలేల? నా నిశ్చయంబు వినుము. మరుద్విచ్ఛిన్నాభ్రంబునుం బోలె నేత ద్గిరిశృంగంబువం గృశియించియైనను, దపంబున సహస్రాక్షు మెప్పించియైనను నీ యపకీర్తి యనెడు హృదయశల్యం బుద్ధరింపం దలంచియున్నవాఁడ. నీ వింక నితరశంకలు చాలింపుము. ౫౫.

క. ఈసరణిఁ బల్కినర్జును, వాసవుఁడలదివ్యమూర్తి ♦ వహియింపుచున
త్యాసక్తినిఁదనకౌఁగిట, భాసురముగ బిగియఁజేర్చి ♦ పలికెంబ్రీతిన్. ౫౬.

క. అనఘాత్మభూతికొఱకై, ఘనునిభవోద్భవునిశివుని ♦ గాంక్షించితపం
బొనరింపుమునీవనుచును, దనరఁగనుపదేశమిచ్చె ♦ దయపైవారన్. ౫౭.

వ. అంత. ౫౮.

చ. శివుఁడుప్రసన్నుఁడైనఫల ♦ సిద్ధినిబొందుమశత్రునాశనం
బవిరళలీలఁజేసివిజ ♦ యావహలక్ష్మినిబొందిలోకమం
దవిహతమైనతేజమున ♦ నప్రతివారితశౌర్యధుర్యతన్
బ్రవిమలలీలనొందుమని ♦ పల్కితిరోహితుఁడయ్యెనింద్రుఁడున్. ౫౯.

ఉ. అంతటనింద్రుఁగాంచిరుచి ♦ రాననుఁడైతగునర్జునుండుదా
నెంతయునింద్రవాక్యగతి ♦ నీశ్వరుఁగూర్చిపరిశ్రమంబులే
కాంతరశుద్ధిమీఱనియ ♦ తాత్మతనొప్పఁగశాస్త్రపద్ధతిన్
సంతతమున్దపంబులను ♦ సల్పఁగసాగెనుయోగమార్గుఁడై. ౬౦.

క. రవికెదురునిల్చిసుస్థితి, భువినొకపాదంబునిల్పి ♦ బుద్ధిస్థిరతన్
దవిలినిరాహారతబహు, దివసంబులుతపముసేసె ♦ ధృతవిజయుండై. ౬౧.

క. నరుఁడిట్లుశరీరేంద్రియ, పరితాపకనిరశనాది ♦ వ్రతములఁదయ్యున్
గిరివోలెదృఢతవెలసెను, ధరఁబెద్దలధైర్యములవి ♦ తర్క్యంబులుగా. ౬౨.

మ. పరిపక్వంబుగఁబండిసౌరభముచే ♦ భాసిల్లిక్రొవ్వాలిద
గ్గిరనేత్రేవేలుఫలంబులందునులస ♦ త్కూదారశైత్యంబుతో
పరిశుద్ధాంబువులందువాంఛయిడదద ♦ ప్రాప్తాత్మదానెట్టిదో
ధరధన్యాత్ములకున్ సుధారసముగా ♦ దానత్తపంబెన్నఁగన్. ౬౩.

మ. తనరంజేసితినిట్టిఘోరతపమున్ ♦ దానంచుతెక్కింపఁడే
కననైతిన్ ఫలమింతకైననుచున్ ♦ గర్వింపఁడున్ జేలవం
బునఁబొందంగరజస్తమంబులునువి ♦ స్ఫూర్తిన్విడంబించునా
ఘనుసత్త్వంబునుమించకుండెనిలన ♦ త్క్రాస్తండుధీరుండుగా. ౬౪.

తే. వెండియాతఁడునిసివేళ ♦ మండువహ్ని, పగిదినొప్పమనుజ్జ్వల ♦ ప్రభలునిగుడ
మించికనుపట్టెవార్ధిగం ♦ భీరగుణత, నతిశయించుమభూధరో ♦ న్నతిఁదనర్చి.

మ. అరుదారంగరహస్యవృత్తిఁదగజ ♦ ప్యంబైనమంత్రంబుభా
సురలీలంబఠియించుచుండరదన ♦ స్తోమాంశుసంకీర్ణమై
నరువక్త్రింబురుకాంతిమీఱుచునదె ♦ న్నంబొల్చెనప్పేళఁదాఁ
బరివేషావృతభీషణార్కఘనబిం ♦ బంబట్లుతేజోగ్రమై. ౬౬.

చ. వెలయఁగజోడుఁబాల్చియుప ♦ వీతపదంబునసజ్యకార్ముకం
బలరఁదగిల్చినిల్చునల ♦ యర్జునుఁడొప్పెనునింద్రచాపకాం
తులుతనమట్టుఁబర్వఁగను ♦ తుల్గనికాననవేష్టితంబునై
పొలుచుమహీధరాధిపుని ♦ పొందికనత్తఱివందమైతగన్. ౬౭.

మ. సతతస్నానములాదియైనసకలా ♦ చారంబులందీర్పఁగా
నతికార్శ్యంబడరఁడేగుమండఁగనతి ♦ స్వల్పత్వముంబొందిన
ట్లుతుపాగాద్రియుభూమిలోనపుడుతో ♦ ద్రోఁజొచ్చినట్లుండెని
ట్లతికార్శ్యంబడగురుత్వమున్ వెలయుటె ♦ ట్లంచున్ మదిందోఁచినన్. ౬౮.

క. ధరలోనంతస్సారము, గురుతందగఁజేయుఁగాదె ♦ గురుకాయాదుల్
అరయఁగగురుతనుబొందవు, మురువొప్పఁగఁబసిఁడిదూది ♦ ముద్దలువోలెన్. ౬౯.

చ. అరుగనూర్ధ్వబాహుతను ♦ నర్జునుఁడొప్పఁగఁదచ్ఛిరంబునన్
నెరయుచు భూనభోంతరము ♦ నిండిదురాసదమైన తేజమా
సురమునియక్షదైత్యశశి ♦ సూర్యులు బెగ్గిలదేవమార్గముల్
వరుసను నడ్డకట్టెనని ♦ వారితశోభదలిర్చ నత్తఱిన్. ౭౦.

ఉ. అన్నరుమేనఁబుట్టినమ ♦ హత్తరతేజము చేతఁగాంతిసం
భిన్నతనొందియంతరవి ♦ బింబములజ్జతనొందినట్లుదా
మిన్నునుమంచు నిండుటయు ♦ మేఘనిరోధమునిట్టిదోషముల్
ఎన్నఁగలేకయుండియుర ♦ హింపకయుండెను గాంతిహీనమై. ౭౧.

చ. అలరుసముద్గతారుణజ ♦ టాంశువులొప్పఁగ సజ్యకార్ముకం
బలవడఁబూనినిల్చునల ♦ యర్జునుఁడంతటఁజూడనొప్పెఁదా
నలత్రిపురంబులం గెలువ ♦ నాత్మఁదలంచుచు నుద్యతోద్ధతిం
బొలుచులలాటలోచనము ♦ పుట్టనిరుద్రుఁడొయంచుఁజూడఁగన్. ౭౨.

మ. అమరేంద్రుండొమహోగ్రపావకుఁడొతి ♦ గ్మాంశుండొయీరీతిఘో
రముగాఁగందపమాచరించునితఁడో ♦ రామస్త్ర్యఁడాగాఁడటం
చుమదిన్మౌనివరేణ్యులెల్లఁదమలోఁ ♦ జోద్యంబుసంబొందఁగా
నమరంజేసెనునర్జునుండుతపమి ♦ ట్లత్యంతరౌద్రంబుగాన్. ౭3.

చ. అరుదుగనిట్లుపొల్చునల ♦ యర్జును తేజము కాననంబులన్
దరికొనికాల్చునగ్నిగతిఁ ♦ దప్పకయుట్లెచలంబునందివా
కరుఁడునుబోలెశోషిలఁగఁ ♦ గ్రాఁపదుతాపససిద్ధకోటికిన్
గరము సహింపరాకయధి ♦ కప్రథమింౘెనలౌకికంబుగన్. ౭౪.

ఆ. అంతశరణుగాన ♦ కందఱుదుర్జ్ఞతి, నారలనత్స్వభావు ♦ లతులనియతు
లలఘుశబ్దసమితి ♦ యులప్రమాణముఁబోలె, హరునిశరణుబొంది ♦ రమరమునులు.

ఆ. అపుడుసురలుమునులు ♦ నధిక తేజంబున, బలిమిసూర్యదీప్తిఁ ♦ బరిభవించు
హరునిఁగాంచిచూడ్కు ♦ లాతేజమునమిఱు, మిట్లుగొనఁగభయమ ♦ మేతులగుచు.

వ. అంత భూతభవిష్యద్వర్తమానాధీశ్వరుండైన యీశ్వరుండు ప్రత్యక్షంబగునట్లుగా స్తోత్రంబులు చేసి యిట్లు పూరోక్తంబైన యమ్మహాతేజంబునందు నేత్రత్రయంబు విలసిల్ల ససారభార్ద్రచందనంబై యత్యంతసుఖావహంబై యొప్పు నచలరాజకుమారికా కుచమండలంబునుంబోలెఁ బ్రకాశించువిశాలవృషభేంద్రాంసకూటంబు నిజహస్తావల నంబు గావించి యత్యున్నతంబైన తుషారకుధరకూటంబున నధిష్ఠించియు భువనా

తీతంబైన తేజంబునం బ్రకాశించుచు, నభ్రమార్గసంవ్యాపకంబైన సజలాభ్రంబునుం బోలె విశ్వవ్యాపకత్వంబున నుద్దీపించుచు, జానుమధ్యావలగ్నంబైన మహోరగంబుచేతం బరివేష్టింపంబడి యవష్టబ్ధకాననంబునం బ్రకాశించుచు, సూర్యతేజంబునకుం బర్యంతభూతంబైన లోకాలోకాచలపరివేష్టితంబై పొల్చు నిఖిలలోకంబునుంబోలె హిమానీవిశదంబై యజ్ఞోపవీతసూత్రత్వంబునుం బొందియున్న శేషాంశునికరంబు నిజప్రభావిశేషంబున నైల్యత్వంబునం బొందుచు, నీలకంధరంబు దీపింప జాతిమసుమంబులచందంబున నందంబైన కపాలమాలికాసంకీలితంబైన శిశిరోరుహనివహంబుచేతం బ్రదీపించుచు, లోకంబులం బ్రవహించి, చిక్కనకుముదసుమసముదయసంకీర్ణంబైన సురసరిత్ప్రయోవశేషరేఖానుకారం బగు చంద్రరేఖం బ్రదీపించుచు, కరకంకణాయమాన భోగిభోగోపరిన్యస్తప్రశస్తవిస్తారిత నిస్తుల మాణిక్య మయూఖంబులు వృషభేకకుథాస్తరణంబునకు గుణోత్కర్షంబు పెనుప, కనత్కనకమణిమయభుజావిభూషితభూషణమణిగణఘృణిజాలంబు లుభయపార్శ్వమహీధరకూటతటప్రవిసారితజలధరపటలంబునకు సాంద్రేంద్రచాపకాంతిం బ్రకటింపఁ బదకటకనైగనగ్యంబు లిరువంకలం బర్వుచుఁ వృషభాస్తరణరత్నకిరణవిస్ఫురణానుకారంబులై వెలుంగ, గండమండలసమున్నండనాయమాన కుండలితకుండలిశిరోమండితతాండవితరత్నకాంతిమండలచాకచక్యంబు లుభయపార్శ్వంబులం బట్టిన ఛత్రచామరాలవట్టధ్వజవ్రజంబులకుం జిత్రత్వంబు సంపాదింప ననర్ఘరత్నకాంచనసంఘటితవిచిత్రరజతఘనప్రదేశప్రవిభూషితరళనానాసూత్రప్రభాధాళధళ్యంబులు దిగంతరాళంబుల నావరింపం జిత్రపటకాంతిపటలంబు లాకసంబునం బర్వుచు నకాలతారకాకీర్ణత్వంబుఁ బుట్టింప, నందిభృంగిరిటతండ్వాదిప్రమథగణంబు లిరుచక్కి నెక్కొన్నభక్తిం జేరి వినుతింప, మహర్షిసంఘంబులు, జయజయశబ్దంబులం బ్రస్తుతింప, డమరుశూలపరశుపట్టసధనురాది సాధనంబులు మెఱయ, విబుధవారాంగనానర్తనప్రవర్తనంబులు చెలంగ, గంధర్వగానంబులనూనంబులై ప్రవర్తిల్లం గోటిసూర్యప్రభావిభాసితుండై యొప్పు నమ్మహాపురుషుం గాంచి సాష్టాంగదండప్రణామంబు లాచరించి, నిటలతటఘటితకరపుటులై నిల్చి నయనవినివేశనచోదితకుశలప్రశ్నంబునం బొందుచు నా ధనంజయతపస్సంజనితజగదుపద్రవంబామూలంబును నతనికిం దెలియునట్లుగా ని ట్లనిరి. ౨౨

ఆ. ఓమహానుభావ ♦ యొకఁడెవ్వఁడో కాని, వృత్రసన్నిభోగ్ర ♦ విగ్రహుండు
బలిమి నూరకఁ గీసి ♦ [illegible]

ఆ. అతఁడు జోడువిల్లు ♦ నసివల్కలేషుజ, ఘనజటాసుఖేట ♦ కములుబూని
మునివిరోధవేష ♦ మునసుండియునువిరా, జిల్లుచుండునయ్య ♦ చిత్రగతిని. ౨౯.

ఆ. అతఁడు సంచరింప ♦ నవనికంపించును, నొనరఁగాసమాధి ♦ నున్నయప్పు
డనిలతారకాగ్ర ♦ హోమరాశాముఖ, కలితమైనభంబు ♦ గదలకుండు. ౩౦.

వ. అదియునుంగాక, ౩౧.

క. ఎంచఁగనీగతి నాతఁడు, కొంచెపుఫల మేమిమదిని ♦ గోరితపము గా
వించెడు నోయని సంశయ, మించుకయును వలదువినుమ ♦ హేశ్వర తెలియన్. ౩౨.

చ. బలిమిజగంబులెల్లనొక ♦ పారిగెల్వఁగ నెంచినాఁడొకో
కలఘుతపఃప్రభావమున ♦ నన్నియుముంచ నెయెంచినాఁడొకో
కలరెడు మోక్షమందమది ♦ నాస్థదలిర్పఁగఁ గోరినాఁడొకో
తెలియదుమాకు మేమతని ♦ తేజమునోర్వఁగలేము శంకరా. ౩౩.

ఉ. ఏలయుపేక్షసేసెదవ ♦ హీనపరాక్రమనీ వెఱుంగవే
యేలికవై వెమాకభయ ♦ మీ మనఁగఁ జాలుదువిట్టినీ వెమ
మ్మేలఁగమాకునింకభయ ♦ మేటికినొందఁగనంచునిట్టుల
వ్వేలుపుమానిసంఘములు ♦ విన్నపమొప్పఁగఁ జేసియున్నెడన్. ౩౪.

క. శంభుఁడు పల్కెనునంతట, సంభిన్నాంభోధిత్రోయ ♦ సంభూతనమ
స్తంభితకకుభాంతసము, జ్జృంభితగంభీరరవము ♦ చెలఁగమృదూక్తిన్. ౩౫.

చ. అమరమునీంద్రులారవినుఁ ♦ డాఘనుఁడా బదరీవనాంతరా
శ్రమమునసుండువాఁడువిల ♦ సజ్జగదుద్భవనాశహేతువై
యమరెడు నాదిపూరుషుని ♦ యంశసముద్భవుఁడౌనరుండు గా
నిమనుజుఁడంచు నెంచకుఁడు ♦ నెమ్మివిలాసతఁబుట్టెభూస్థలిన్. ౩౬.

ఆ. దివిజులారయితఁడు ♦ దేవేంద్రుబలమెల్లఁ, దఱిగిపోవనిట్లు ♦ తద్విమతుల
గెలువఁదలఁచినన్ను ♦ కేవలమునుగోరి, తపము సేయుచుండు ♦ ధరణివణఁక. ౩౭.

క. ఇతఁడు నుగృష్ణుఁడునరులై, చతురాస్యప్రార్థనమున ♦ జగములుగావన్
దితిజులఁ ద్రుంపను బుట్టిరి, క్షితి నరనారాయణులుప్ర ♦ సిద్ధులువీరల్. ౩౮.

క. ఈకరణిఁదపము సేయుట, నాకులకొఱకంచుఁదలఁచి ♦ నరునివధింపన్
మూకాసురుఁడదెవచ్చెను, భీకరమగునీవరాహ ♦ వేషముతోడన్. ౩౯.

శా. ఈపాపాత్ముఁడుమూకదానవుఁడువా ♦ నీదైత్యరూపంబుచే
నీపార్థుండిటులొంటియున్నయపుడే ♦ నేగెల్వలేనెట్లుమా

యోపాయంబునఁ గెల్తునంచును వరా ♦ హోగ్రాకృతిం దాల్చి తా
నే పారంగను వచ్చునంచు మదినూ ♦ హింతుం దదుద్యోగమున్. ౯౦.

ఉ. ఏనుగిరాతరాజనయి ♦ యీకిటిరూపముఁ దాల్చివచ్చినా
దానవునిన్వధింపఁగను ♦ దానును నప్పుడె వానినీఁదటన్
బూనినిశాతహేమమయ ♦ పుంఖశరం బొకటేసి నాతఁడా
నానఁడ చరింపఁగలఁ ♦ డందులకై బలు వేటకయ్యమున్. ౯౧.

చ. అరిదితపంబులన్ గృశతి ♦ నందిసహాయము లేక యొంటిగా
దురమున నుగ్రకోపసహి ♦ తుండగు పాశుని పాశ్వభాషక
స్ఫురదతులోగ్రశక్తి నిసఁ ♦ జూడుఁడు మీర పుడందఱోలి నో
సురమునివర్యులార మదిఁ ♦ జోద్యముఁ బొందెదరయ్య వేడుకన్. ౯౨.

క. అనియిట్లు పల్కి శంభుం, డనునయవాక్యముల మునుల ♦ నాదర మొప్పన్
గనుమూఱడించి యంతట, ననువొందఁ గిరాతరాజ ♦ నయ్యెదననుచున్. ౯౩.

సీ. ఘనమైన నెఱిగుంపు ♦ వెనుక కొప్పుఁగ దువ్వి, పూని గేలను సిగ ♦ పొంకపఱిచి
నెమలిపింఛముఁగపో ♦ లములఁ గ్రొక్కడఁ జెక్కి, కెంపుకన్గవ మోము ♦ సొంపునింప
విపులవక్షమునగం ♦ ధపువ్రక రేఖలు, పొంకంబుగాఁ దీర్చి ♦ భుజములందుఁ
గరికుంభజనితము ♦ క్తాహారసూత్రంబు, లగమిూఱజన్నిదం ♦ బుగను దాల్చి
యాతపము చేతఁ బులకిత ♦ మైనయట్టి, గాత్రమలరంగ ఘననద ♦ త్కాండసహిత
కార్ముకముఁ బూని మేఘసం ♦ ఘాతరీతిఁ, దగి కిరాతకపరివేష ♦ ధారియయ్యె. ౯౪.

క. హరువకుఁ బ్రియముగఁ బ్రమథులు, నరిదిక్కు తారములు విండ్లు ♦ నమ్ములు శూలో
త్కరములు బూని కిరాతక, వరులై పుట్టించిరట్టి ♦ బలమధికముగాన్. ౯౫.

వ. అప్పుడు. ౯౬.

సీ. మైలచల్లడముల ♦ పైలీలఁ గట్టిన, బలునీలిదట్టిచిం ♦ గులను బెనఁచి
గట్టిగా మొలనంటఁ ♦ గట్టినవంకిణుల్, పొసఁగ దాపటఁ జెక్కి ♦ బొట్టెకోల
మెకము వాకట్టుమూ ♦ లికచుట్లదండలఁ, గట్టినకురువింద ♦ పట్టెడలును
సంజోకనెలవిండ్లు ♦ సరగనిగ్గడఁ బూని, యింపైన గన్నెరా ♦ కంపపొదులు
మేలుపందిఁ జెలూఱపైన ♦ పీలిచెండ్లు, బాగుగాగట్టు ముక్కొప్పు ♦ పాఱుటాకు
బొమిడికంబులు తలముళ్లు ♦ బూనినిల్చె, భూతపతి ముందరనపుడా కి ♦ రాతబలము.

చ. గడుసరివారయూ వేగిసుర ♦ గాలి మెకంబుల మిత్తిపోతురా
జాడుములదిండి భైరవుఁడు ♦ నుబ్బరి కాఁడ సహాయశూరుఁడున్

బిషుగుఁ రాంకుశంబులును ♦ బెబ్బులికత్తెరగాఁడటంచుఁబే
ర్వడుఘనజాగిలంబులను ♦ బట్టెడలందగఁబట్టిరావెసన్. ౯౮.

క. ధైరియముఁగ నెసరిలడుగును, వారణమును బోచిసాళు ♦ వము చంచలమన్
పేరులుగలబలు డేగల, దోరెంబులఁబట్టిబోయ ♦ దొరలేతేరన్. ౯౯.

క. చట్రాంతి మీఁదనొకశిలఁ, గాట్రేఁడనినిలిపికొలిచి ♦ కడుఁజెలఁగుచు నా
గట్రాజనవికిఁదమతమ, పొట్రాజునుఁజేపుకొనుచు ♦ బోయలునడువన్. ౧౦౦.

చ. గిరికొనఁగొంగయీఁకెలితి ♦ కించినపోగులు వాఱుత్రాళ్లుకా
లుపులురిగోలలున్ వలలు ♦ మ్రుల్లనుగొమ్ములుచోపుగజ్జలున్
యిరవులనుండు బోనులడు ♦ గెత్తఁగనేర్చినజాడకాండ్రు రాఁ
దరలెను బోయశంకరుఁడు ♦ తద్గిరిభూమికిమాయవేఁటగన్. ౧౦౧.

వ. ఇట్లు మాయామృగయావినోదంబుగాఁ దరలి యాతుపారవసుధరకాంతారంబుఁ దఱియం జొచ్చి చుట్టునుం దిరిగి రాపోగు వారించి నిరంకుపల టెంకులమృగయానిరంకుశులగు టెంకలఁ గాపుంచి, పచ్చికలపట్ల మచ్చులు చల్లించి, కాలుపులు గీలుకొలిపి, డొంకల వంకలన్ గొమ్ములుం దమ్మటమ్ము లిమ్ముపఱిచి, కొలంకుల కెలంకులం బరివేష్టించి మాట లుగా నేటుకాండ్ర నియమించి, పోటరులైన మేటిభటులు వేటుపాటెఱిఁగిన డేగ వేఁటరులును, సాగుబాగు లెఱింగిన జాగిలంబులవారునుం దాను నడుకొని పన్నినించి మృగయావినోదంబు చూపం దలంచి. ౧౦౨.

చ. బలమున కెల్ల కానవవి ♦ భాగము లేర్పడఁబంపు వెట్టినన్
గలయఁగనంతటంబరువు ♦ కట్టిభయంకరనాదమొప్ప నా
ర్పులు వెడబొబ్బలున్ గహన ♦ భూములు గప్పఁగ భూనభోంతరం
బులు వెసనిండ నార్చుచును ♦ బోరునఁ దర్లెను బోయసైన్యముల్. ౧౦3.

శా. ఆవేళన్ భయమందుచున్ మృగవిహం ♦ గానీకముల్ భీతిమై
నావాసంబులు జేరి వాచఱవన ♦ య్యాక్రోశమెల్లం గుహా
దావాభ్యంతరమెల్ల నిండఁగ మహీ ♦ ధ్రంబిట్లు భీతిల్లి తా
వేవేగ న్మొఱవెట్టెనో యనమహా ♦ విస్ఫూర్తి మ్రోసెంగడున్. ౧౦౪.

క. మెకములు పక్షులు భయపడి, ప్రకటంబుగ నొక్క త్రోవ ♦ బఱచెను వైరం
బొకటైనను మదిఁదలఁపక, యకటా యాపదలు వైర ♦ మణఁచునె కాదే. ౧౦౫.

ఉ. జల్లి మొగంబులత్తఱివి ♦ జక్కనిరోమములాప్పవాలముల్
చల్లనివంశగుల్మముల ♦ సందున దాచుక తద్భయంబు సం

ఘిల్లఁగఁ బ్రాణభీతియొదవ ♦ డింబరికింపక వాలఖండనో
ద్వేల్లభయంబుచేతధృతి ♦ దీకొనిపర్వకనిల్చెఁబంతగన్. ౧౦౬.

మ. మదకుంభిప్రకరంబులన్ సతతమున్ ♦ మర్దింపఁగా నట్టిత
న్మదగంధోద్ధతకేసరంబుల నభీ ♦ మంబౌ బలాఘోషచే
నిదురశ్శైలగ్హాఁనియావృలించువినము ♦ న్నిద్రోగ్రవక్త్రాళిచే
నదహొక్కింత యు లేకయుం డెనుమృగేం ♦ ద్రౌఘంబు రాజాఖ్యచేన్. ౧౦౭.

మ. తటముల్ పంకముచేత దుర్గమములై ♦ తత్క్షోభసంభావితో
త్కటకుంభీంద్రవిమృష్టచందనరసా ♦ క్రాంతారుణాభంబులన్
బుటముల్మీఱఁగబోరలొగ్గిలమీనుల్ ♦ సారెకుంబొర్లఁగాఁ
దటినీసంఘమభంగభంగచయయా ♦ తాయాత మైఘూర్ణిలెన్. ౧౦౮.

మ. శితశృంగంబులకాఱుదున్నలు వెసన్ ♦ జిమ్మన్విశీర్ణంబులై
నతమాలాగరుచందనోశిరవితా ♦ నప్రాపితామోదవి
భ్రుతమై కీరసమానవర్ణితశిలా ♦ నూనాత్తశైత్యంబుచే
నతిమాంద్యంబుగమించెఁబద్వనచరా ♦ యాసంబుతోఁ దెమ్మెరల్. ౧౦౯.

శా. ఆసత్వాదపగ్రీష్మకాలగలిత ♦ త్యంతార్తిగావించెన
క్కాసారంబులతోయముల్ మథితముల్ ♦ గాసత్వముల్ బాఱిపో
నాసమ్మర్దముచేతనివ్వగులుపం ♦ కాభీష్టమేధాన్యముల్
గాసిల్లెన్ వనజాలివాఁడఁగదలీ ♦ కాండాళిభిన్నంబుగాన్. ౧౧౦.

వ. అంత నమ్మృగయు లత్యంతకుతూహలంబునం బఱచు హరిణాదిమృగంబులఁ దఱచగు వాలంపగములం దూలించుచు, దుప్పులం దెప్పరంబుగా గుప్పించి కూలఁగుప్పుచు, పంతంబులు మెఱయఁ గుంతంబుల గ్రుచ్చుచు, పటుతరసటాపటలవిస్ఫుటంబుగా ఘుర్ఘురధ్వానంబున నెదిరించిన మదవరాహవ్యూహంబుల మెఱుంగు బల్లెంబుల గ్రేడించి ప్రేల్లఁగ్రుమ్ముచు, శశకంబుల మశకంబులమాడ్కి గీటడంగించుచు, దెప్పరంబుగా మీఁదికి గుప్పటించు శార్దూలంబుల కెదిరించి వక్త్రంబుల్ల వస్త్రపరివేష్టితంబులైన వామహస్తంబులు నిజశిరోపరిన్యస్తంబులుగాఁ జొన్పి వలకేలం బటుతరంబులుగాఁ గటిప్రదేశంబులఁ గట్టిన దట్టంపుఁజాయల నేడెంబులం బడఁగ్రుమ్మి కూలంద్రోయుచు, కఠోరంబులుగాఁ గఠారంబుల నఱకుచుం గటారంబులఁ బొడుచుచు, సింగంబులు మీఁదికిం గవిసినం గలంగక మెఱుంగుటమ్ములఁ బరఁగించి సంధానమోక్షణంబు లెఱుంగరాకుండఁ దక్షణంబులం గూల నేయుచు, ఖడ్గంబుల నఱకుచు, శర

భంబులఁ బొరిగొనుచు, మాటుల నేటుపప్పించుకొని పఱచువరాహశార్దూలంబులం
దఱిమి కుమ్ముచు, కాలువలం జిక్కిన తనుచరహరిణసముదయంబుల గుదులుగట్టుచు,
పొంగికలు గని బెదరుచుఁ జెదరి పఱచు లేఁడిగమిం గని పాటవంబునఁ దఱిమిపట్టి
పడవైచుచు, జాగిలంబులు గదిసి సాఁగనియ్యకుండిన మెండుకొని తిరిగి కలగుండు
పడం జెంది పుండరీకంబుల నండలుగొని చండకాండంబులం గండడంగింపుచు, నిఱి
కువలకుం జేరిన వరాహశార్దూలంబుల మాటుకాండ్రొక్క పెట్టి నరికట్టనేసినం గెరలి
వరాహంబు వ్యాఘ్రంబునుం బడనేసినను భయంబునుం బఱచి యటఁ గూలినం
గని కరలాఘవంబున కచ్చెరువందుచు, నితరేతరలాఘవంబు లగ్గడించి జాత్యను
రూపంబుగా రిక్కలు నెరయం బిరుదంబులు బలుకుచు, పంతంబులు మెఱయఁ గుంత
ముఖసాధనంబులు జళిపించుచు, పొదల దీలించి త్రోలినం జెదరి పఱచు శశకం
బులఁ జూపి ముష్టినదలి విడిచిన శాళువంబు పక్షినాదగంభీరంబుగాఁ బఱచినం గని
యీరంబులఁ దూఱినం జేరం జని నిజముష్టియష్టితాడనంబులం జదుపుచు, దోరెం
బులు నదలి విడిచిన వారణంబులు నిబ్బరంబునఁ బఱచు విహంగంబులపై నూఱి పదం
బుల నిఱికియుఁ జంచువులం జించియు నెడనెడం బడవైచిన నవి చిక్కంబులఁ జక్క
నించియుం, జేపదలి విడిచినం దూరు బైరిం గని బకాదిపక్షి నికరంబు లెగయుకొ
న్నిల్చినం దగిలి పట్టి బుట్టలం బెట్టుచు, నివ్విధంబున ననేకమృగవిహంగంబులం
గీటడంగించి తదీయంబైన ఖాద్యామిషంబు విశసించి పాటనురేలం ద్రవ్విన పడియల
నడుగున నా పురాకులుం బఱచి తత్పలలంబు తింత్రిణీశిలాటుల లవణసమ్మిశ్రంబుగా
నిక్షేపించి తత్పర్ణంబులు పైఁగప్పి నిండారం బూడ్చి చుట్టును బరివేష్టితంబుగా
ననలం బంటించి పక్వంబుగా ననేకభంగులం బాకంబులు సేసి కాశ్రేనికిం గుడువం
బెట్టి యుచితాహారంబులం దృప్తులై విహరించు నక్కిరాతులం జూచి కౌతూహలం
బునం బొందుచు. ౧౧౧.

శా. ఈలీలన్ గిరికన్యకానిభుఁడు దే ♦ వేంద్రాత్మజుండుండు నా
శైలంబందలిసాను కాననవన ♦ స్థానోగ్రసత్త్వంబులన్
జాలింబెట్టుచు వచ్చెలేఁడిగమి త ♦ త్సామిప్యవీరుల్లతా
జాలాగ్రంబులు మేయుచున్న దనివా ♦ సస్థానముం జేరఁగన్. ౧౧౨.

శా. ఆవేళన్ ఘననీలనీరదనిభో ♦ గ్రాకారముంబూనియా
దేవేంద్రాత్మజునగ్రభూమి నెదురై ♦ దీప్యన్ముఖాగ్రంబునన్

వే వేగంధరవక్త్రలింపుమమహో ♦ విస్తారవారాహతే
జోవిస్ఫూర్తిఁదలిర్పుదానవునిఁదాఁ ♦ జూచెన్ హరుండచ్చటన్. ౧౧౩.

మ. ఘనలక్ష్మీసహుఁడైనయాహరుఁడుగం ♦ గాపల్వలాంతంబునన్
దనరన్ సేవలనిల్పికొందఱుకిరా ♦ తశ్రేష్ఠులే తేరఁద
ద్వనవృక్షంబులుగుల్మముల్ మఱుఁగుగా ♦ వారాహమార్గంబునన్
జనుచుండెన్ దగనారెనారెమృగయుల్ ♦ జాడల్ విమర్శింపఁగన్. ౧౧౪.

ఉ. అంతటనింద్రసూనుఁడుమ ♦ హాకృతిచేఁగుధరేంద్రభేదనం
బెంతయుసేయఁజాలునని ♦ హెచ్చుపరాక్రమమొప్పదంష్ట్రిల
త్యంతమునుగ్రమై వెలయు ♦ నాననమొప్పవరాహవృత్తిమై
నంతికభూమినుండునను ♦ రాధిపునప్పుడెచూచెనెంతయున్. ౧౧౫.

చ. ఉరుతరకోపమెత్తిసట ♦ లుబ్బఁగనెత్తుకనన్యకృత్యముల్
మఱచుచునన్నుగెల్తునని ♦ మత్సరబుద్ధినిదవ్వునుండితా
నురువడివచ్చెడుంగిటిమ ♦ హోద్ధతినంచునుదానిగెల్వవ
న్నరునకువేఁడ్కపుట్టెనుమ ♦ నంబుననారెకుశౌర్యమెచ్చిఱన్. ౧౧౬.

మ. తరుమూలంబులుపెల్లగిల్లఁగవడిన్ ♦ ధట్టించిపెన్ముట్టెచే
వరుసంక్రోయుచుఁగంధరంబునఁబడన్ ♦ వక్త్రంబునన్ రాయుచున్
సరిఁబోరాడఁగనన్నుఁబిల్చెడుగతిన్ ♦ సంఘంబులంబాసియు
ద్ధురతన్నీఁదికివచ్చెదీనినివెనం ♦ దున్మాడుటుక్తంబెకా. ౧౧౭.

సీ. ఈయాశ్రమంబున ♦ నిపుడెంచిచూచిన, ఘనతపోమహిమచే ♦ మనములందు
వైరంబులేకుండు ♦ పసనత్వంబులు, వ్యాళాదిదుష్టస ♦ త్వములుఁదలఁపఁ
బరవైరములచేత ♦ బ్రతుకంగనేరవ, ట్లయ్యునీకిటియునా ♦ యందుమిగుల
మత్సరబుద్ధిచే ♦ మలయుచున్నది, యిదితపోభంగంబు ♦ గదిసిసేయ
వచ్చియున్నట్టివికృతరూ ♦ పంబొకాక, దనుజమాయాబలంబును ♦ దాల్చినట్టి
ఘోరతరమైనకిటిరూప ♦ కోయటంచు, మనమునను నెంచెనాతపో ♦ ధనుఁడుమఱియు.

తే. అట్లుగాకున్ననిదిపూర్వ ♦ మందుసేయు, వైరమిప్పుడునన్నుఁజూచి ♦ వదలకున్న
దెటులఁగినట్టులెనిశ్చయ ♦ మిదియెపూర్వ, బద్ధవైరంబుగల్గురూ ♦ పంబుదలఁప. ౧౧౮.

క. కాకున్నవేలనన్నుం, దాఁకనిదేవచ్చునిదియుఁ ♦ దద్దయుఁదారో
షాకలితముగామెకముల, సేకములుంసంగనిడిచి ♦ యీగతినెదుగై. ౧౧౯.

చ. ఇదియొమృగంబుగాదుమతి ♦ యెవ్వఁడొ కోనను గెల్వవచ్చువాఁ
డొదవెడుదీని యందుమది ♦ నూహయొనర్ప కలంగనా మదిన్
అదియును నిశ్చయంబు పను ♦ లైనను మిత్రుని నైన చిత్తమే
చెదరదు మనిర్మలంబగుమఁ ♦ జెప్పను గాదె జగద్ధితంబుగన్. ౧౨౧.

ఉ. మానికిఁ గానిశంకయిది ♦ మా నెదనన్న నపాపకారినై
మానిగనున్న నాకుఁ ఖభి ♦ మానము హెచ్చఁగ నెట్లు భీతిలోఁ
బూనెడు నీకు బుద్ధియిది ♦ భూతికిఁ గాదిది నిశ్చయంబెకా
మానసబద్ధవైరుఁడగు ♦ మానిసి కేదవిలంఘ్య మెన్నఁగన్. ౧౨౨.

క. ఈవిధమున ననుఁ ద్రుంపం, గావచ్చిన యట్టివాఁడె ♦ కానిమ్మైనన్
భావింపఁగ నీక్షుద్రపు, జీవము చే నేమియౌను ♦ చింతింపంగన్. ౧౨౩.

మ. అని యూహించిన వీఁడు దానవుఁడొకా ♦ కారాక్షసుండో కదా
ఘననీలాకృతినున్నదిట్టిమృగముం ♦ గాదైవనీ బల్మియీ
వనసత్వంబులకేదిదచ్చెరువుదు ♦ ర్వారంబు గానీగతిన్
ఘనకంపంబునఁ బొందఁజేయుఁగతి నా ♦ క్రాంతోద్ధతిన్ బోల్చెడున్. ౧౨౪.

క. ఇదియే మొ వేఁటకలకల, మొదవినగతి వినఁగనయ్యె ♦ నుద్ధతి మీఱన్
ఇదియును మాయాకల్పిత, మదితంబౌ గట్టిగాని ♦ రూపణ సేయన్. ౧౨౫.

మ. ఇది పోమాయను శాంతినుండుననుఁదా ♦ నెంతేఁ బ్రహారింపఁగా
నదనూహించుచు వేఁటలాడు పొలమా ♦ ద్యంతంబునున్ బర్వి పె
ట్టిద మైనట్టి బలాగ్భటిప్రభలధా ♦ టిన్ గాననౌఘంబులన్
జెదరిట్టట్టుమృగావళుల్ బఱవఁజే ♦ సెన్ గాదిశల్ ఘూర్ణిలన్. ౧౨౬.

క. కాదే నెవఁడొ సుయోధనుఁ, డాదరమున సత్కరింప ♦ నటుప్రతికృతి గా
నీదంభ తనుఁదునుమఁగ, ఘూదారక్షుభితసత్వ ♦ ములఁగలసెనొకో. ౧౨౭.

సీ. కాదేనినింకనొ ♦ క్కటిపూర్వమంజేను, దగఁజేయఖాండవ ♦ దహనమందు
హవ్యవాహను చేత ♦ నాత్మబంధువులెల్ల, హతులైన తక్షకు ♦ నాత్మజుండు
అశ్వసేనుండు దా ♦ నత్యంతకుపితుఁడై, వైరంబుఁదీర్చికోఁ ♦ గోరి యిట్లు
మాయావరాహమై ♦ యీయాశ్రమమునకు, ననుఁద్రుంపఁగాఁ బ్రియ ♦ త్నంబుపూని
వచ్చెనో కాక యెవఁడైన ♦ వాయుపుత్రుఁ, డైనమాయన్న భీముని ♦ పైనిగల్గు
బద్ధవైరంబు చేమాయఁ ♦ బన్ని యొంటి, నిచ్చటను నుండు ననుఁద్రుంప ♦ వచ్చెనొకొ॥

క. ఏవిధి నైనను నిదిమా, యాపియయోనన్నుఁ ద్రుంప ♦ నధికబలముచే
నీవచ్చుకృగముఁదునుమఁగ, నేవలయును శత్రుభంగ ♦ మిదిలాభముగా. ౧౨౯.

ఆ. తాపసులకుహింస ♦ ధర్మంబుగాదైన, దుష్టమార్గులకును ♦ దుర్గ్రహముగఁ
గడఁగిజయముఁగోరి ♦ కావించుమీతప, మనుచునాకువ్యాసు ♦ లాజ్ఞయిడె.

ఆ. ఈయధర్మకృత్య ♦ మెట్లుశాసించెనో, వ్యాసులనిననిపుడు ♦ బలుమెకంబుఁ
దునుమకీతపంబు ♦ తుదముట్టరక్షింప, నలవిగాదశక్య ♦ మరసిచూడ ౧౩౧.

ఆ. అనుచునరుఁడుపొరు ♦ పొంకంబుప్రథమాయు, ధంబునైనవిల్లు ♦ తనరనెత్తి
యొక్కువెట్టిశత్రు ♦ హింసకుగుణయుక్తి, నచివుగతినిదనరు ♦ శరముఁగూర్చి.

సీ. గురుసారయుక్తత ♦ గుణయుక్తమగువిల్లు, హితునట్లునిశ్చిత ♦ మతినిదరుఁడు
క్షీణస్వబలుఁడయ్యుఁ ♦ జేనిండఁదీసిన, సానుకూలతనప్ర ♦ మయ్యెనపుడు
ఘనకాండసంగ్రహ ♦ కర్షణసంజాత, గాండీవమౌర్వీప ♦ చండరవము
గుహలుబగులనిండి ♦ కుధరంబుజీవిత, సంశయమునఁబొందె ♦ సకలమునను
అంతలెగనిండఁదీసిన ♦ యట్టిచాప, మండలాంతర్థియైతగ ♦ నుండిత్రిపుర
హననవేళనుదానుండు ♦ నట్లుపరభ, యంకరతనుండునరుఁజూచె ♦ హరుఁడునపుడు.

ఉ. అంతటశంకరుండునుమ ♦ హత్తరమౌకుధరేంద్రచాపముల్
వింతగఁబొదమూనియతి ♦ వేగముమీఱఁగనెక్కువెట్టిక
ర్ణాంతముగాఁగవాసుకిగు ♦ ణాగ్రముఖోద్గతవహ్నికీలల
త్యంతముఁబర్వఁగాఁదిగిచె ♦ నద్భుతబాణముఁగూర్చిపట్టుచున్. ౧౩౪.

సీ. కదిసియందొక్కరు ♦ గవయుయత్నముసేయు, హరధనంజయులమ ♦ ధ్యమునపుడు
సంధికూర్చెడువేళ ♦ సరిగప్రకృతిప్రత్య, యంబులనడుమఁదా ♦ నమరనిల్చి
యారెంటికభియోగ ♦ మలవడఁగూర్చితా, లయమొందునను బంధ ♦ లక్షణమున
నవ్వరాహంబుండె ♦ నంతదిగ్గజభయ, దోగ్రంబుగానార్చి ♦ యుగ్రుఁడేయ
సాగివిస్ఫులింగ ♦ చయములునిగుడంగ, దిశలునిండఁబర్వ ♦ తేజమునను
నాకసంబువెలుఁగ ♦ నభ్రనిర్గతమైన, పిడుఁగుకరణివింట ♦ వెడలెశరము. ౧౩౫.

సీ. పరఁగనీరీతిని ♦ బాణంబువెడలుచు, గురుపక్షసంజాత ♦ ఘోషమపుడు
విహగాధిపుఁడువచ్చు ♦ వేగంబుగలిసర్వ, హృత్కర్ణపుటివిని ♦ ర్భిన్నమగుచుఁ
బ్రతిరవంబులచేత ♦ బహురవంబుగఁబర్వఁ, గఱకంఠునయనని ♦ ర్గతలయాగ్ని
కనదుత్పతచ్ఛిఖా ♦ కల్పమైవిద్యుత్ప్రి, కాశంబుమంటలా ♦ కసముఁగప్ప

హరసమీపభూన ♦ భోంతరవర్తిత, గగనచరులకేక ♦ కాలదృశ్య
మగుమనఃపుడేమాన ♦ సాధికరయమునఁ, జటులమగుమఁగపట ♦ కిటినిఁదాఁకె.

ఆ. గగనచారులెల్లఁ ♦ గడుభయంబునఁజూడ, గురుతమాలనీల ♦ ఘోణినిల్లు
నాటియుపలవెడలి ♦ నడిఁజొచ్చుగ్రహరీతి, నవనిలోనదృశ్య ♦ మయ్యెశరము. ౧౩౭.

ఉ. అప్పుడెపొస్థుఁడేయఁబ్రళ ♦ యాంతకుఃర్జనిబోలెఁజూడఁగా
నొప్పెడుపర్వరేఖలయ ♦ సోగ్రనఖాగ్రమునాశరంబుదా
నుప్పరవీధికిన్వడలె ♦ నుద్ధతిమీఱఁగఁబ్రాణికోటికిన్
దెప్పరమైనభీతినిజ ♦ నింపఁగఁజేయుచుభీషణాకృతిన్. ౧౩౮.

సీ. దివ్యాస్త్రమదిగాన ♦ దీపితోల్కాయత, తేజమగ్గిరివన ♦ రాజిఁగప్ప
సంఖ్యమీఱినపక్షి ♦ సంఘంబువ్రాలెను, గురుగరుత్పంజాత ♦ ఘోషమడర
నతివేగముననల ♦ క్షితనిష్క్రమాగమ, మగుచుమనోవృత్తి ♦ కంటెమునుపొ
కాకుండెనో, యనఁ ♦ గానిమేషంబున, విజయహేతుకమైన ♦ విజయుశరము
శాస్త్రవిహితకర్మ ♦ సాధనదక్షమా, పురుషయత్నమునను ♦ బోలియపుడు
హానిశరముఁదాఁకి ♦ నట్టిగంటి నెనాటి, లక్ష్యకిటివిభేద ♦ దక్షమయ్యె. ౧౩౯.

సీ. అంతటఁనారత ♦ మ్యంబులెఱుంగని, యవివేకమునవృథా ♦ యాసమునను
ధనమునుజెఱచుచం ♦ దంబునదారిద్ర్య, మునునదాతృత్వంబు ♦ మొనసికొలుచు
వారికిఁబతిమీఁది ♦ కూరిమిఁదొలఁగించు, నటువలెదుర్నీతి ♦ యనవధాన
తయునివివిజిగీషు ♦ జయమొందఁజేయుని, కరణినిహరసర ♦ శరయుగంబు
దానికరణపటిమఁ ♦ దప్పింపనదియును, జిట్టఁదిరిగిమూర్ఛఁ ♦ జెందియపుడు
పుడమిమీఁదగూలఁ ♦ బడెఁజూపఁదరులతో, నుర్విదిరుగుచున్న ♦ వొక్కొయనఁగ.

మ. ధరమీఁదన్బడియున్నరక్తపరిషి ♦ క్తంబట్లుగానుద్ధతిన్
ఖురదంష్ట్రాహతిరాళ్లుచూర్ణములుగా ♦ ఘూర్ణిల్లుచున్దన్నుచున్
గురురోషంబుననగ్జనుంగనుచునా ♦ క్రోశించుచుంజచ్చెభీ
కరమూకాసురసూకరంబపుడువే ♦ డ్కన్దేవతల్జూడఁగన్. ౧౪౧.

వ. అంత. ౧౪౨.

క. శరములసంఖ్యముగలిగియుఁ, బఱువెత్తుమవచ్చెనరుఁడు ♦ పౌరుషగురువి
స్ఫురణఁదలిర్చుచుఁదత్సూ, కరభేదియయినశరమును ♦ గైకొనువాంఛన్. ౧౪౩.

క. కృతమెఱుఁగువాఁడుగావున, సితవాహనుఁడాశరంబుఁ ♦ జేకొనఁదలఁచెన్
అతులితబాణములుండఁగ; నితనికిదీనిపయిఁబ్రేమ ♦ యింతేమియనన్. ౧౪౪.

క. ధరలోపలఁగృతవేసుల, కరమునపుత్రుమేలు సేయు ♦ నతఁడూ బ్రియంబౌ
కరణిమతిఁ జేయఁగలవాఁ, డిరవొందఁగఁ బ్రియుఁడుగాఁడె ♦ దేగతినైనన్. ౧౪౫.
సీ. ఒవరనీచునియందు ♦ నుంపనిగుణుపకార, మును భోలెఁగిటిదేహ ♦ మునసునిలక
యవ్వల వెడలితా ♦ ననవలోకితమూఁచుఁ, గృతపౌరుషంబున ♦ నతులమగుచు
గురుతరలోహాగ్ర ♦ పరతను స్సుఖము గా, క్షాత్రపౌరుషమున ♦ కలరియుంబుక
కరయలజ్జించిన ♦ యటువలెనుండుచు, గురుకాంతినిజకీర్తి ♦ కరణిఁదాల్చి
పాటవంబుమీఱఁ ♦ బ్రస్ఫీతమైయున్న, శరముఁజూచిసవ్య ♦ సాచియిట్టి
ఘనశరంబువీడఁ ♦ గావచ్చునేయని, యలరిపుచ్చుకొనియె ♦ నాస్థతోడ. ౧౪౬.
ఆ. అప్పుడచటఁగాంచె ♦ నయ్యర్జునుఁడుచెంతఁ, జిత్తజారివార్తఁ ♦ జెప్పవచ్చి
శరశరాసనములు ♦ ధరియించియుందర, సరగనుండువిపిన ♦ చరునిశౌకని. ౧౪౭.
తే. అప్వనచరుండునతనికి ♦ నాత్మజాతి, విహితముగ్రమ్రొక్కివేవేగ ♦ విన్నవింపఁ
గణఁగియారీతిఁబలికెన ♦ ఖ్యంబుగదుర, సాంత్వవాక్యంబులను మైత్రి ♦ సరణిబరఁగ.
సీ. ధన్యునీబహిరనా ♦ ద్ధత్యశాంతత్వమె, సవినయమౌహాన ♦ సమును దెల్పె
ననఘాత్మనీదుతే ♦ జోధిక్యమాతప, శ్చర్యయేవిమలశా ♦ స్త్రిముసుజెప్పెఁ
దలపోయనీదేవ ♦ తాసమానాకృతి, పరిశుద్ధమాకులం ♦ బెఱుఁగఁజాటె
మునివయ్యునసుభావ ♦ మునఁబ్రకాశించుచు, గౌరవంబునశైల ♦ ఘనతమీఱి
యిచటనుండియెనీవుదే ♦ వేంద్రుచేత, నఖిలలోకాధిపత్యంబు ♦ నైననరసి
కాంచినిర్బాధకముగనే ♦ లించఁగలవు, గానియితరంబుగాదునీ ♦ దైనమహిమ.
తే. ప్రభుతనొందుచుసకలసం ♦ పదలకెల్ల, నాస్పదుఁడవైతివదియెట్టు ♦ లన్ననీవు
జనులనెడఁబాసియొంటిని ♦ చ్చటనునుండ, సచివయుతురీతినీదుతే ♦ జంబువెలసె.
క. అతిజయమందుటయేమరు, దతులంబగుముక్తియైన ♦ నతిసులభముఁనీ
హితవాంఛితమేదైనను, జితరాజనతామసములు ♦ జేయవెయనఘా. ౧౫౧.
వ. అంత నిజాగమనప్రయోజనద్యోతకోపాలంభనపూర్వకంబుగా నిట్లనియె. ౧౫౨.
సీ. అధికతేజంబున ♦ నహిమధాముని మించు, యలఘువిక్రమమున ♦ వెలయునీవు
నిశితోగ్రసూకర ♦ నిర్భేదియైనయీ, మారాజుబాణమి ♦ మ్మాడ్కినిపుడు
వచ్చిసాహసమునఁ ♦ బుచ్చుకోవచ్చునె, ధరణిమన్వాదిస ♦ త్పురుషులరసి
దేహధారులకెల్లఁ ♦ దేర్చినమర్యాదఁ, దప్పకనడచుటు ♦ త్తమముకాదె
శాకమీవంటిఘనులెయీ ♦ కరణిమేర, మించినడవంగమదినిశ్చ ♦ యించిరేని
మేరఁదప్పకనడచెడు ♦ వారలెవ్వ, రలఘుచారిత్రమతినీవె ♦ తెలుపవయ్య. ౧౫౩.

సీ. జ్ఞానసంపత్తిచే ♦ జన్మమృత్యువులను, గెలిచినయోగీశ్వ ♦ రులుదలంప
నాబాల్యమునుండి ♦ యావత్ప్రదంబైన, దుర్మార్గవర్తనఁ ♦ దొలఁగువట్టి
సదుపదేశమెకోరి ♦ సౌశీల్యవృత్తినె, యభ్యసింతురవిను ♦ మందువలన
తెలియదుష్పథనివృ ♦ త్తియెకాదుసకలార్థ, సిద్ధియాశెట్లన్న ♦ సిద్ధతపము
సేయువారికిఁబుణ్యంబు ♦ సేయుసుఖముఁ, గోరువారలకుఁదదను ♦ గుణసమృద్ధి
కూడఁజేయునుమఱిముక్తిఁ ♦ గోరుయోగి, జనులకెల్లనుమోక్షంబు ♦ తనరఁజేయు,

తే. ఎలమినీరీతిఁబురుషార్థ ♦ హేతువైన, యట్టిసౌశీల్యమిలలోన ♦ నెందువలనఁ
బనులకెల్లఁబ్రియంబుగఁ ♦ జనునిదెట్లు, కానమారాజుశరమంటఁ ♦ గాదునీవు.

మ. వితథంబైతగురూపరేఖలనుభా ♦ వింపంగనీసాటికా
కృతినొప్పారుచుమాశరంబువినుమ ♦ ర్థింబూజనీయుండని
న్నతివిభ్రాంతునిఁజేయనీవిదియెనా ♦ దౌనంచుఁజేకొంటిగా
కితరంబైననునేలముట్టుదువునీ ♦ పీరీతినిర్బాణముల్. ౧౫౬.

ఆ. స్థిరుఁడుకడమజనుల ♦ శరచౌర్యమాత్మలో, నరిసికోరఁదక్కు ♦ వదియుగాక
నితరుఁడేయుచ్చుగము ♦ నేసితినేనని, నొడివెదీవుసిగ్గు ♦ పడకమరల. ౧౫౭.

వ. అని మఱియును నవ్వనచరుండు నిజోపకారప్రకటనంబుగా నేతద్వక్షసదోషంబుప
హరించు వాఁ డిట్లనియె. ౧౫౮.

మ. వినుమీమాదొరసచ్చరిత్రులెపుడున్ ♦ విద్వాంసులుత్కంఠచే
వినిసంతోషముఁబొందిమెచ్చురితరుల్ ♦ వేనోళ్లవర్ణింతురా
ఘనతందావినియుబ్బఁడింతయుమదిన్ ♦ గాంభీర్యతన్న్రుఁడౌ
ననఘామానవుసద్గుణావళులన ♦ న్యార్థంబులౌఁజూడఁగన్. ౧౫౯.

క. నిరుపమనిజగుణసంపద, పరనిందయుఁబోలెఁదాను ♦ బ్రకటముసేయం
డరయఁగమాదొరధరలోఁ, బరనిందయునాత్మనుతియుఁ ♦ బరఁగవుగానన్. ౧౬౦.

క. అరయనటులైనకార్యా, తురతనునిర్విణ్ణుకరణి ♦ తుదిఁజెప్పఁబడెన్
ధరఁబెద్దలమర్యాదలు, చెఱచెడునర్థిత్వమేల ♦ చీకాల్పనెకా. ౧౬౧.

వ. అని మఱియు నిజకృతోపకారంబు తేటపఱచువాఁడై యి ట్లనియె. ౧౬౨.

క. మాదొరసితశరముననీ, భూదారముఁదునుమకున్న ♦ మొనసిబలిమినీ
మీఁదఁబడియేమిసేయునొ, యాదుర్వచనంబుఁజెప్ప ♦ వలవియెనాకున్ ౧౬౩.

శా. నేనేచంపితినిమ్మెకంబుననుచు ♦ న్నీచిత్తమందున్నదే
మానీవజ్రదృఢాంగతంబ్రబలిచే ♦ గోజృంభియానీకిటిన్

జా నేయక విసనొక్క బాణమున నే ♦ శక్తుండ నెవండుండునూ
సేనాధీశుఁడు దక్క నీవు మదిలోఁ ♦ జింతింపనిం కేటికో. ౧౩౪.
మ. అటులైనన్నతి యేమియన్న వినుమీ ♦ యారాజునిం బ్రాణసం
కటమౌ నంచును వచ్చినూకరముఁ దా ♦ ఖండించి రక్షించెనీ
వటు గానంబరమాప్తుఁ డంచు నతనిన్ ♦ హర్షించి చేకొంచు నా
క్కటి రైయై యుంటయి పోలు మేలు మఱవం ♦ గానేల యోగీశ్వరా. ౧౩౫.
క. వినుమప్పుడర్థమూలం, బున సఖ్యము సేయనొప్పు ♦ భువి నందఱకున్
బని లేని సఖ్య మేమిటి, కనియన్న ను వినుము తెలియ ♦ ననఘచరిత్రా. ౧౩౬.
మ. ధరలో నన్విజిగీషులౌ జనులకున్ ♦ దౌర్లభ్యమై లెస్సగాఁ
బరిరక్షింపఁగ రాక యస్థిరములై ♦ పాటిల్లు నీయర్థముల్
ఇరవొందన్ సుగమంబు సుస్థిరములై ♦ యేకోపకారాత్తమౌ
గురుమిత్రత్వ సమాను కారములు గాఁ ♦ గోర్కొన్వి తర్కింపఁగన్. ౧౩౭.
వ. అదియునుం గాక. ౧౩౮.
క. ధనమును జంచలమగు భూ, మిని వెనహరియింతురరులు ♦ మిత్రత్వము దా
నణఁగదు నిఖిలధురీణం, బనపాయము దాని మఱవ ♦ నగు నే నీకున్. ౧౩౯.
సీ. అదిగాక మోక్షార్థి ♦ యగువాని కేటికి, ననఘ సఖ్యము సేయ ♦ నంటి వేని
స్థిరబుద్ధి నీరీతి ♦ సేయు నీతపమిది, విజయవాంఛను గాని ♦ వేఱు గాదు
కాకున్న నీరీతి ♦ కైదువుల్ బూను నె, ధర మోక్షకామి యౌ ♦ తాపసుండు
కానమా రాజుతోఁ ♦ గలసి సఖ్యము సేయఁ, దగునట్టులైననీ ♦ తపముఫలము
సకలమును గరంబు ♦ సమకూడు నె క్లైన, నీయలంతి సఖ్య ♦ మేమియనుచుఁ
దలఁచెదేని వినుము ♦ తగ నీకు మారాజు, మహిమ తేఁటపఱుతు ♦ మౌనితిలక. ౧౪౦.
చ. ఘనగజవాజిసంజనిత ♦ కాననభూములు మేటిరత్నపుం
గనులధికంబుగాఁ గలవు ♦ కావున నీకలహంబు శేలనీ
కనకపుటమ్ముకంచనినఁ ♦ గాంతను గోరుట గాదు నూపఱుం
డెనయఁగ నెక్కుడౌటకు స ♦ హింపఁడు మా దొర నెమ్మనంబునన్. ౧౪౧.
క. కావున సఖ్యంబుచితం, బీవిధమున బాణమునకు ♦ యింత పెనంగన్
ఈవనలుబ్ధుకు చెల్మిని, భావింపఁగ నేమిమనకు ♦ ఫలమని యనిసన్. ౧౪౨.
చ. ధరణిమహాత్ములౌ నరులు ♦ తామతి రాజసవృత్తినుండి యోన్
బరులు నగర్వులై గెలుచు ♦ పట్లను రాజసవృత్తి మానితా

మరియురికోపముందురుకు ♦ యాచకకోటులువేఁడుకొన్నచో
నిరియునువస్తువంచుమటి ♦ చెప్పఁగనేటికిజీవమైనని
త్తురుమటిదాఁచుకోకఘన ♦ దోర్బలధుర్యులచెల్మిరిత్తిరయే. ౧౭౩.

ఆ. కానతూపునీవు ♦ క్రమ్మఱనిచ్చిన, నీకునాతినికిని ♦ నెమ్మిరామ
రవిసుతులకుఁబోలె ♦ రహీనినన్యోన్యంబు, దైవఘటితమైత్రి ♦ తగఘటించు. ౧౭౪.

ఆ. శరములోభమునన ♦ సత్యంబుపలుకకు, మునికిశరముమీఁది ♦ మోహమేమి
యిఁకశరంబులేద ♦ యీగిరిపైనన్న, హెచ్చువజ్రమునకు ♦ నీశరంబు. ౧౭౫.

సీ. అనియీశరంబుపై ♦ నాస్థనీకున్నను, గిరులరాజైనమా ♦ దొరకునీవె
ఇదియెంతపనియని ♦ యిప్రుశువేఁడవుగాని, నీవంటిమిత్రుఁడు ♦ నెమ్మినడుగ
నిలయెల్లగెలిచినీ ♦ కిచ్చుబాణములెంత, యాచకుభంగింపఁ ♦ డనఘుఁడతఁడు
సర్వజ్ఞమూర్తియా ♦ చకభంగమెల్లఁదా, నాత్మానుభవముగా ♦ నాచరించు
నట్లుగాననీకు ♦ నడిగినభంగంబు, దొంగసతులనెడుశంక ♦ విడువుమిప్రుడు
ఘనునివేఁడుకొనిన ♦ ఘటియిల్లుఁగోర్కెలు, సందియంబులేదు ♦ సదమలాత్మ. ౧౭౬.

సీ. బలవంతునకునేల ♦ పరువియాచింపఁగా, నసెదవేనిసమస్థుఁ ♦ డైనవాఁడు
ఘనశక్తిచేనైనఁ ♦ గాదేనిప్రేమచే, నైననుబరధనం ♦ బాక్రమించు
నదిగాకబలవంతు ♦ నడుగఁబోవుటయెల్ల, ఫణిఫణామణిఁగోరు ♦ పగిదిగాదె
సమకూడనేర్చునె ♦ జామదగ్న్యునిమాని, యస్త్రవేదమువేఱె ♦ యభ్యసింప
నలఘుభుజవీర్యశాలియౌ ♦ వతనికైన, నాయుధంబిలసాధ్యంబు ♦ నగుటగలదె
కావునమీకునటువంటి ♦ ఘనులతోడఁ, జెలిమిసేయుటయొప్పును ♦ స్థిరముగాను.

క. ఇటువలెమీమృగశరములు, చటులతహరియించుమాకు ♦ సరినాతనికిన్
ఘటియిల్లుటసఖ్యముదా, నెటువలెననినీవుదలఁచె ♦ దేనిమహాత్మా. ౧౭౮.

ఆ. తపసివగుటనిన్ను ♦ దయఁజూచిమారాజు, మృగము నేయుదోవ ♦ మిదిసహించె
నజ్ఞులైనవార ♦ లటుసేయుదోషంబు, లాత్మనుంతురేమ ♦ హాత్ములవని. ౧౭౯.

ఆ. ఇట్లుసేయుమైత్రి ♦ నేమిఫలంబన్న, పత్కులమునఁబుట్టి ♦ సత్తపంబు
నలుపునీవుతాప ♦ సవిరోధమానిట్టి, దుష్కృతంబుసేయఁ ♦ దొలఁగుదింక. ౧౮౦.

క. కాదేనిదుర్వ్యర్థంబున, నాదటవర్తించునట్టి ♦ యన్నరుఁడెందున్
మేదినినిహపరదూష్యము, లైదుస్తరములగునట్టి ♦ యాపదలనఘా. ౧౮౧.

క. పితృదేవపూజకొఱకో, యతులితమైనట్టిపదవి ♦ యందుటకోయీ
గతినీమృగమునునేటికి, వితథంబుగనేసితివి ♦ వేకమువేరువే. ౧౮౨.

క. మునివరయేమిటికూరకె, తనరంగా నీకునింత ♦ తలచుగఁజెప్పన్
విను మొక్కటిపరమార్థము, వినిపించెదనీకు నేను ♦ విశదముగాఁగన్. ౧౪౩.

ఆ. ధరవివేకియైన ♦ పురుషుండుచపలత, విడుచు నెట్టివాఁడు ♦ విడువకున్న
ప్రళయవాయువబ్ధి ♦ భంగించుగతినిది, చేరిధీరునైనఁ ♦ జెఱచుగాన. ౧౪౪.

క. వినను నీతనిబాణం, బేనీయకయున్ననలిగి ♦ యేమిటి సేయం
గానోపునెదవేనియు, ధీనుత నేనతనిమహిమఁ ♦ దెలిపెద నీకున్. ౧౪౫.

మ. వినుమా రాజుమహోగ్రతేజుఁడు ధను ♦ ర్వేదాంగపారీణుఁడున్
ఘనశైలోద్భవశేఖరుండనిశమీ ♦ కాంతుండు భూరక్షకై
వినయంబొప్పఁగఁ బ్రార్థనల్ సలుపఁగా ♦ విచ్చేసి యీపర్వతం
బుననిల్చుండుఁ గిరాతసేనగొలువన్ ♦ భూరిప్రభావంబునన్. ౧౪౬.

వ. అని పల్కి యుపసంహారంబు సేయువాఁడై మఱియు నిట్లనియె. ౧౪౭.

ఆ. ఇపుడు మృగము నేయు ♦ నీయపరాధంబు, నేను సైఁచితీవు ♦ మౌనివగుట
మాననీయుఁడైన ♦ మారాజు శరమిచ్చి, భూరిసంపదలను ♦ బొందు మనఘ. ౧౪౮.

వ. ఇవ్విధంబున విరోధప్రధానంబై యుండు మిత్రత్వంబే సూచియింపనేరదు. తన్మూలం
బుగా సంపత్ప్రాప్తి యెట్లగునంటివేని జెప్పెద నాకర్ణింపుము. ౧౪౯.

తే. ఒనరహృదయానుకూలమై ♦ యుండెనేని, యొదవు వినయాదిగుణములా ♦ పదలడంగు
నిట్టిబహుఫలహేతువై ♦ నట్టియార్య, సంగమును గల్గనర్థిత్వ ♦ భంగమెట్లు. ౧౫౦.

మ. ఇదిగా దాతఁడు మారమందునికినం ♦ బేనిన్ బలోపేతుఁడై
యిదె యీపర్వతభూరుహాంతరమునం ♦ దీచాయఁ గన్పట్టెఁదా
నుదితోర్మిప్రకరంబుతో సముదయవే ♦ లోద్గీర్ణమై పొల్చిన
యుద్యదబ్ధింబోలెను నీకు నేఁడు సుమహా ♦ తోద్దీప్యతేజంబునన్. ౧౫౧.

ఆ. అప్పుడతనితోడ ♦ హరితురంగము కేతు, కాంతిమీఱసజ్య ♦ కార్ముకంబు
పూని మైత్రి చేసి ♦ పొందు నీవాంఛిత, మునకు నధికఫలము ♦ మునివరేణ్య. ౧౫౨.

వ. అని యక్కిరాతుం డూరకున్న నయ్యర్జునుండు గంభీరస్వభావుండు గావున ధైర్యం
బవలంబించి కోపంబునకు సమయంబుగాదని యుపశమించువాఁడునుం బోలె శత్రు
స్వభావప్రకటనం బగువాక్పటుత్వంబు మెఱయ నవ్వనచరున కిట్లనియె. ౧౫౩

ఆ. అనఘ యిట్లుపల్క ♦ నలవియే యొరులకు, వర్ణభూషగౌర ♦ వతను నలరి
లలితపదవిలాస ♦ కలితమై శ్రీకర, మగుచు నీదువాక్య ♦ మలరెనిపుడు. ౧౫౪

సీ. సభను బెద్దలలోన ♦ సాహసోక్తులనుమించి, హృదయసూచకముగా ♦ నింపుగుల్క
విపులార్థగంభీర ♦ నిపుణత వెలయఁగా, విద్వాంసులెల్లను ♦ వినుతిసేయ
వినువారలకునెల్ల ♦ మనములురంజిల్ల, పరిశుద్ధశబ్దసం ♦ పదదలిర్ప
స్వామికార్యమునకు ♦ సాధకంబై యుండఁ, బలుకులవినయంబు ♦ పరిఢవిల్ల
భయము లేకిట్లుపలికితి ♦ ప్రౌఢి వెలయ, వనచరుఁడవయ్యు వాక్పటు ♦ త్వమున వెలయు
బుద్ధిమంతులలోనెల్లఁ ♦ బొగడువడసి, తదగ్రగణ్యుండవైతివి ♦ వనఘచరిత. ౧౯౫.
సీ. అలఘుసామోపాయ ♦ మాచరించెడువేళ, స్నేహాదివినయము ♦ లేర్పడఁగను
అంతభేదోపాయమడ ♦ రించుతఱిఁ బల్క, వలయునుభయపెట్టు ♦ వాక్యములను
వ్యాయామార్థికీరీతి ♦ నాచరింపఁగఁదగు, బాణార్థివీవయ్యుఁ ♦ బలికితిట్లు
బాణార్థిపుఁడైనఁ ♦ బల్కనేయీరీతి, నీతిమీఱఁగ నేర్చి ♦ నీవుగాఁగ
బలికితిట్లు ప్రౌఢి ♦ వెలయంగ నీగతి, నేర్పుమీఱ నొరులు ♦ నేరనగును
దొరకు హితవుమీఱ ♦ దూతత్వమిటుసేయఁ, దగుదువనఘ నీవె ♦ తథ్యమిదియు. ౧౯౬.
వ. అని పల్కి తదనంతర కార్యంబు వివరించువాఁడై యిట్లనియె. ౧౯౭.
తే. అనఘమామీఁదఁగీడు సే ♦ యంగనిట్లు, తలఁచుమీరాజుతో నీవు ♦ వలదటంచుఁ
దెలియఁగాఁజెప్పివారింప ♦ నలవియగునో, కాదొపరికించి చూడుమీ ♦ ఘనుఁడవీవు.
క. కాకుండు బెట్టుకీడుకు, లోకములో మేలునకును ♦ లోనగు నాప్తుల్
చేకొని చెప్పినపింతగ్రతిఁ, గైకొనిమతినడచువారు ♦ గారేన్నృపతుల్. ౧౯౯.
క. అటులైననుమద్బాణం, బెటువ్రాయెనటన్న శరము ♦ లేసినఁబోవే
యటుగావునఁదత్సాయక, మటునటులీశైలమందు ♦ నరయంగఁదగున్. ౨౦౦.
క. కాదేని బాణమునకై, యాదటమతినీతిమంతు ♦ లగునార్యులతో
వాదుగొనందగు సజ్జన, వాదంబునఁగీడులెంత ♦ వానికినైనన్. ౨౦౧.
వ. అదియునుంగాక. ౨౦౨.
సీ. నిశితోగ్రసూకర ♦ నిర్భేదియైనయీ, మారాజుబాణమి ♦ మ్మాడ్కినీవు
వచ్చిసాహసమునఁ ♦ బుచ్చుకోవచ్చునే, యనియున్నపల్కితి ♦ వనఘవినుము
ఖాండవదహనంబు ♦ గావింపనుద్యుక్తుఁ, డగునగ్నిదేవుచే ♦ నపుడు నేను
అక్షయబాణంబు ♦ లందుకసురసాయ, కములయందింతైనఁ ♦ గాంక్ష లేక
యుండునట్టిమాకుఁ ♦ గొండలలోనుండు, విపినచరుల బాణ ♦ వితతిమీఁద
వాంఛబుట్టియిటకు ♦ వత్తుమే పుచ్చుకో, నపుడు నీవు తెలియ ♦ కంటిగాక. ౨౦3.

సీ. అదిగాకమన్వాగు ♦ లైనట్టిపెద్దలు, దేహధారులకెల్లఁ ♦ దేర్చు మేరఁ
దప్పకనడచుటు ♦ త్తమము గాదేయంచు, నాడితివట్లనె ♦ యార్యజనుల
మర్యాదలెల్లఁబ్రా ♦ మాణ్యమేయనినను, మమ్ములనిందింప ♦ నిమ్ములేదు
పరనిందపడయక ♦ ప్రఖ్యాతమైనట్టి, సజ్జనవాక్యముల్ ♦ సద్గుణములె
యలరఁబల్కఁగాని ♦ యన్నృతంబుఁబల్కనె, యదియెటుంగకట్టు ♦ లన్నృతిమాడు
నీకునిజములేదు ♦ గాకనుమావంటి, వారు మేరఁదప్ప ♦ వారెయవని. ౨౦౪.

ఆ. పరులబుద్ధిదలఁపఁ ♦ బ్రత్యక్షమానెట్లు, నీకుఁదెలిసెమాకు ♦ నిజములేని
దనుచుఁబలికెదేని ♦ యాటవికోత్తమ, తెలియఃనుము నీకు ♦ తేఁటపఱుతు. ౨౦౫.

గ. విదితగుణంబుదాఁచుకొని ♦ వేఱొకదుర్గుణమొందిసజ్జనా
స్పదమును గాకయుండఁగను ♦ సంవరణంబగుదుష్టచిత్తముక్
వదలకఖడ్గరూపమగు ♦ వారలవాక్యమెగుష్టభావమా
పెదిరిజనాలికిందెలుపు ♦ నెంతయుమూలము భేదపుచ్చుచుక్. ౨౦౬.

ఆ. తపసివగుటనిన్ను ♦ దయఁజూచిమారాజు, మృగము నేయుదోష ♦ మిదిసహించె
ననుచుఁబలికితీవు ♦ వనచరోత్తమవినుమ, మందుకేమిఁదెల్లియ ♦ నధియునిపుడు. ౨౦౭.

ఉ. కాననభూమినుండెడుమృ ♦ గంబులవెవ్వరిసొమ్ము గావుతాఁ
బూనికనేసినాతనిది ♦ పోరఁగనేటికినాదటంచునుక్
మానకలేనిపోనియభి ♦ మానముఁబెంచిన మేలుగల్గునే
మాననివట్టియీదురభి ♦ మానముమీకొరకేలమాన్పుమీ. ౨౦౮.

వ. అదియునుంగాక.

క. పితృదేవపూజకొఱకో, యతులితమైనట్టిపదవి ♦ నందుటకోయీ
గతినీమృగమును నేటికి, వితథంబుగనేసితిదివి ♦ వేకము తెరువే. ౨౧౦.

క. అనిపల్కతి వెవ్వరికిని, గనకుండఁగ వ్రతము సేయఁ ♦ గానియమించెక్
ఘనుఁడగు వేదవ్యాసుఁడు, ననునీగతినట్లు గావు ♦ నను నేనిపుడుక్. ౨౧౧.

క. ననుఁదునుమంగావచ్చిన, ఘనమృగము నునిట్లుచావఁ ♦ గానేసితి నే
ననువుగ వ్రతసంరక్షయె, ఘనులకునిలభూషణంబు ♦ గాదేతలఁపక్. ౨౧౨.

వ. అదియునుంగాక మా రాజు నీ మీఁదికిం జనుదెంచుదుష్టసూకరంబును ఖండించి నిన్ను రక్షించెం గావున నితరజాతుం డైనను నతనితో సఖ్యంబు గావింపు మని యంటివి. స్వకార్యాతురత్వంబున వన్యమృగవధోపజీవితుం డగులుబ్ధకుండు తాప సుల కుపకారపరుండు గా నేర్చునె! ఐనను నిద్దఱచేతను నొక్కవేళనే తత్క్షణం

బా మృగంబు హతంబయ్యె నదియుఁ దుర్లక్ష్యంబు గావున మొదల నెవ్వ రేయుం టయుం దెలియరాకున్న యది. అట్లు గావున నితరుం డేయుమ్మృగంబు నేసితి నేనని సిగ్గువడక నొడివెదవని మమ్ముల నుపాలంభించి పలికితివి. తద్దోషం బీవ స్వాతం బును మాకుం బనిలేదు. నిరాయుధులైన తాపసులయెడల దయాపరత్వంబు విహితంబుగాక సజ్యకార్ముకధరులైన మునులయెడల నుపకారంబు ఘటిల్ల నేర్చునే! అదియునుం గాక, అతండు మద్వధార్థం బేతెంచు వరాహంబుఁ బరిమార్ప బాణంబు తూణంబు వెడలం దిగిచె. తచ్ఛరంబునకు నా మృగంబును వధించుటయే ఫలంబు. తత్కార్యంబు సాత్కృతంబైనం బ్రయోగించు నతనికి నధికసాఫల్యంబు గావున నాతండు శరలోభం బెట్లు విడువనేర్చు! అదియునుం గాక తత్సాయకంబునకు నతని యాచింపుమని యంటివి. దుర్బలుం డగువాని కగుంగాక బలియుం డగు వాఁడు యాచ్ఞాదైన్యంబునకు నెట్లు సహింపనేర్చు! అది యటుండనిమ్మని యుద్ఘాటించి పల్కి భయంబు సూచించువాఁడై యిట్లనియె. ౨౧౩.

చ. వనచరమాన్యపుండనృత ♦ వాక్యమునూనుచుఁబల్కితైనఁ జే
కొనఁగనురానిదుష్కరపుఁ ♦ గోరికిబల్కినిబొందఁగోరెదా
వినుమిదిచిత్రమిద్ధరవి ♦ వేకులకెన్నభయంకరత్వముం
గనఁబడియున్ననైనను ♦ నాశమునం జెడుబుద్ధిబుట్టుగా. ౨౧౪.

సీ. ఇట్లుమీఁదుశరమ్ము ♦ నిచ్చినందున నేమి, గట్టిగామీరాజు ♦ కడఁగివచ్చి
వరశరాసనఖడ్గ ♦ వర్మబాణంబులు, వినయంబుతో నన్ను ♦ వేఁడువేఁడి
విభజించి యడిగినా ♦ వినుము నేనిచ్చెదఁ, గాదేనిభుజశక్తి ♦ గలిగ నేని
యాచించికైకొను ♦ నదిపౌరుషముగాదు, పౌరుషశాలికే ♦ పగిదినైన
మొనసిబల్మినిబుచ్చు ♦ కొనుటభూషణమెన్న, నదియుఁగాకతఁడున ♦ ఖ్యాప్తుఁడంచు
తే. నెట్లుమునుపల్కితిలలోన ♦ నేనృపుండు, తాపసులయందుదోషంబు ♦ దలఁచుచుండు
ఘనతపోత్కర్షకోర్వక ♦ ఖలులుప్రకృతి, శత్రువులుగారెమతి ♦ సాధుజనులకెల్ల.

మ. జనవర్ణాశ్రమరక్షణత్వవిహితా ♦ చారుండనైనట్టిరా
జను నేనెక్కడవన్యజన్యమృగహిం ♦ సాజీవితుండేవనీ
చునితో సఖ్యముసంఘటింపదుమహా ♦ శూరాలికన్లేకదా
వినుమీనక్కకుదంతికింబొనఁగునే ♦ విఖ్యాతి గానఖ్యముం. ౨౧౫.

సీ. అరయనీమందున ♦ ఖ్యాప్తుఁ డేకాఁడన్న, నజ్ఞానమునమూఢుఁ ♦ డాత్మలోన
నెదిరివారివిశేష ♦ మెఱుఁగక యుంటుట, నదియవజ్ఞతగాదు ♦ నవలివారి

ధీరత్వమును బోదు ♦ తెలియ నృగాలంబు, తెఱుఁగకుండినను గే ♦ సరికిఁబోలె
మఱియేమియన్న న ♦ మానవీర్యాన్వయ, పౌరుషంబుల నెన్నఁ ♦ బఱచు నెవ్వఁ
డధిక మాపవర్గ ♦ కవితిరస్కారంబు, మొనసి సింహయుగళి ♦ మునకుఁబోలె
నెంచి చూడ నైన ♦ నీదృక్ప్రకారంబు, నీచవృత్తి నెట్లు ♦ నిలుమనినన. ౨౧౭.

మ. ధరలో నెవ్వఁడు నీచు చేతను నిరు ♦ ద్ధంబైయశోహాని దా
నరయుంగానగు నంత మైత్రియగునా ♦ నవ్వేళ దూష్యంబులై
పరఁగుంబో గుణరాజియం చుమదిలో ♦ భావించియా నీచునిన్
నిరసించున్నటి బుద్ధిమంతుఁడు మది ♦ న్నీతినివ్వేకించుచున్. ౨౧౮.

వ. ఇట్లు గావున. ౨౧౯.

ఉ. సంధికి విగ్రహంబునకుఁ ♦ జాలఁడు గావున నీవు వానిసం
బంధము గాఁదిరస్కరణ ♦ భావము దోఁపఁగఁబల్కు నీయసం
బంధములైన వాక్యములు ♦ భావగభీరతనెంచి వాఁడు దా
బంధుర బాహుశక్తిగొన ♦ భావము నందలపోసె నేనియున్. ౨౨౦.

క. శరమునకు వచ్చి విషభీ, కరమగు ఫణిమణులు గొనఁగఁ ♦ గాంక్షించెడు వాఁ
డరయఁగఁ బొందెడు ఫలమును, మఱి తాను బొందునపుడు ♦ మానని కడఁకన్. ౨౨౧.

వ. అంత. ౨౨౨.

శా. ఈరీతిన్ హృదయంబు తేఁటగను నెం ♦ తేఁబల్కు నప్పార్థుతో
ధీరత్వంబు నిన్ను గెల్వకయుపో ♦ దేయంచు నాశైలపం
చారుండే గను వీరసైన్య యుతుఁడై ♦ సామీప్యమందుద్ధతా
కారంబొప్పఁగనుండు నట్టియలను ♦ క్రంటి స్వైసంజేరఁగన్. ౨౨3.

వ. తదనంతర కథావృత్తాంతంబు విన్నవించెద. ౨౨౪.

క. శరణాగత సంరక్షణ, బిరుదాంక విశాలవక్ష ♦ భీకర దైత్యో
త్కరతిమిర హరణపటురవి, కిరణాయత తేజసావి ♦ కృతమృగరాజా. ౨౨౫.

స్రగ్ధర. జలదప్రస్ఫీతనీలో ♦ జ్జ్వలదమలమణి ♦ స్ఫారవిస్తారశోభా
లలితేంద్రోదారచాపో ♦ ల్లసదసముశుభా ♦ లంకృతోద్యద్విభూషా
విలసద్దంభోళిధారా ♦ విలసితనఖరో ♦ ద్విగ్నదైతేయవక్షః
స్థలనిర్యద్రక్తసిక్తో ♦ ద్ధతకరభయదో ♦ దగ్రమూర్తిప్రభావా. ౨౨౬.

గద్యము. ఇది శ్రీమదహోబలలక్ష్మీనృసింహకటాక్షలబ్ధకవితావిచిత్ర మౌద్గల్యసగోత్ర గోపాలునికులపవిత్ర భాస్కరామాత్యపౌత్ర వీరనమంత్రిపుత్ర పరమభాగవతపుంజా విధేయ సింగయనామధేయప్రణీతం బైనకిరాతార్జునీయంబను మహాకావ్యంబునందుఁ జతుర్థాశ్వాసము.

# పంచమాశ్వాసము.



క. శ్రీకరకారుణ్యామృత, శీకరసేకానుమోద ♦ జీవితభక్తా
లోకనయుగళచకోరా, నాకాధిపవిజయదక్ష ♦ నరహర్యక్షా. ౧.

వ. అవధరింపు మివ్విధంబున నయ్యగ్రజునుచేతధిక్కరింపంబడి యక్కిరాతుండు చనిన యనంతరంబ. ౨.

మ. చనియావార్తలుచెప్పినంతట వెయా ♦ శరువ్వందుదానాజ్ఞయా
ఘనదర్పోద్ధతసింహనాదములచే ♦ గర్జిల్లినాసైన్యముల్
చెనయంగాలయకాలవాతహతవీ ♦ చీసంహతింబొంగున
వ్వనధింబోలెనుబుబ్బునంబొదలెదు ♦ ర్వారంబుగాశూరతన్. ౩.

మ. జయకేతుప్రచయంబుచంచలముగా ♦ సాంద్రాంబుదబృందసం
చయసంయుక్తతనొప్పమీఱవిలస ♦ త్సౌరభ్యసంపాదియై
రయమొప్పంగనువీఁచెమారుతమురో ♦ ద్రస్ఫూర్తిశోభిల్లఁగా.
భయదప్రక్రియఁబొల్చుతద్బలపురో ♦ భాగంబునందత్తఱిన్. ౪.

చ. జయజయయంచువందిజన ♦ సంఘముబల్కెడుమేటిశబ్దముల్
భయదకఠోరబాహుబల ♦ భాసితసద్భటసింహనాదముల్
రయమునసజ్యచాపగుణ ♦ రావముఁగూడుకనేకమైశిలో
చ్చయములనింపుచున్బృథివి ♦ చంచలమందఁగనిండెదిక్కులన్. ౫.

ఉ. అప్పుడుతద్బలోగ్రనిశి ♦ తాయుధకాంతులుసైన్యదేహముల్
గప్పుచుఁబాళవిస్ఫురతవి ♦ కాసతనొందిదిగంతరాళముల్
గప్పఁగనిండిదీపితము ♦ గావెనఁజేయుచుభానుదీప్తులన్
జొప్పననప్పుడెంతయును ♦ శోభిలెఁజూపఱపిండుచూడ్కికిన్. ౬.

ఉ. చండభుజాంతరంబునకుఁ ♦ జయ్యనఁదీసినవిస్తరింపుచున్
మండలలీలనొప్పిఘన ♦ మార్గణపూర్ణతమించునట్టికో
దండముఁబూనుచున్భ్రమధ ♦ తండములోపలనుండియేనిమా
ర్తాండునిలీలఁగన్పడియెఁ ♦ దద్బలమెల్లనుమించిభర్గుఁడున్. ౭.

చ. సమవిషమప్రచారసమ ♦ సాధకశక్తిని వేగిరింపుచున్
దమకుచు నేను నేననుచుఁ ♦ దర్జనలాడుచు నిట్టిపోదమ
గ్గమకము సేయుచున్ బ్రమథ ♦ నాథులు మీఱి వమర్లఁ బట్టు నా
తుములము చేత నవ్వనము ♦ మూలె నిరుచ్ఛ్వసనాత్తమాగతిన్. ౮.

చ. కలయఁగ గాత్రసైన్యములు ♦ గ్రమ్మినఁ బల్వలకుంజతీరముల్
వెలయఁగ నాతిరిక్తతను ♦ వేగమె పొంగుచు నంతలోనన
బ్బలమటు వర్ల్లఁగా నపుడు ♦ పల్వలభావముఁ బొందినట్టులై
పొలుచుచునట్టి వేళవన ♦ భూమిగనం బడెనుజ్జ్వలాకృతిన్. ౯.

చ. ఉరుకరినోరుఘూతితస ♦ ముత్పతితోగ్రలతావితానముల్
గురుతర వేగమారుతవి ♦ ఘూర్ణితచందనసాలవృక్షముల్
తఱుచుగ నెల్లెడన్ వడలు ♦ తద్గణనాయకయూథమవ్వనం
బురవడి మీఁదికెన్నగయు ♦ చున్నదియో యనఁ జేసె నయ్యెడన్. ౧౦.

వ. అంత. ౧౧.

సీ. దర్పసంయుక్తుఁడై ♦ తపమునఁ గృశియించి, మదవినిస్రుతిఁ జిక్కు ♦ మత్తగజము
చందంబున నమించి ♦ జగతి రాజన్యుల, వధియించు కోఱకుగ్ర ♦ జ్వలితమగుచు
దిక్కులు గాల్చుచు ♦ దీపించు ప్రళయాగ్ని, కరణి తేజము దిశల్ ♦ గప్పి వెలుఁగఁ
బరు నిలెక్కింపక ♦ బాణంబుఁ జేఁబూని, యనుకూలమగు సఖు ♦ నందుఁ బోలెఁ
గదనజయము మీఁదఁ ♦ గాంక్షను సేయుచు, శరము నీక చులక ♦ పఱచునట్టి
జలధిఁ బోలుబోయ ♦ సైన్యంబు పైపారె, కోపదృష్టి నిరవు ♦ కొలుపుకొనుచు. ౧౨.

వ. మఱియును నాపత్ప్రతీకారసాధనోపాయంబున నుండు గాండీవిచండకోదండంబును ధైర్యంబునుంబోలె నధిష్ఠింపుచుఁ బ్రకృతిస్థితం బయ్యును నవిలంఘనీయంబై నివాతంబునఁ జలియింపకుండు సముద్రంబునుంబోలె నా సమీపంబునం బడియున్న వరాహవధనిమిత్తంబునఁ జలియించు విలయకాలాంతకుండనం బ్రజ్వరిల్లుచు ఋత్విక్సమాహూయమానుండై యధ్వరంబునకుం జనుదెంచు నిజపురస్థితపశుత్వంబునం జెన్నొందు రుద్రుండునుంబోలె నైసర్గిక ధైర్యగుణవినిర్జితేతర గౌరవుండై దురవగాహంబైన గాంభీర్యంబున వీరుల్లతాసాంద్రంబైన యరణ్యంబు పెంపున నతిదుర్గ్రాహంబగు భూధరంబు ననుకరింపుచు బుషభకకుదున్నతభుజుండును స్థూలకంధరుండును బృహచ్ఛిలావప్రకఠినవక్షుండును నై ఖలజనభరాలసంబైన జగంబు దుష్టరాజన్యగర్వార్ణవంబున మునుంగకుండ నుద్ధరింపం గోరు మహావరాహంబుచందంబున నింద్రనీల

శ్యామలవిగ్రహుండై యఖిలసత్త్వంబులఁ బ్రకాశింపం జేయుచు, జలనిర్మలాదర్శం
బునం దేజరిల్లుభాస్వంతునియందంబున మనుష్యభావంబునం బ్రకాశించునప్పురాణ
పూరుషుం డైననారాయణసహచరుం డగునన్నరావతారుం డితం డన నొప్పుచు
నిఖిలక్రియారంభఫలాలంకృతంబై జగద్విజయప్రతాపస్థానత్వంబున నుద్దీపించు న
య్యర్జును నిమీఁద నక్కిరాతబలంబు లుక్కుమిగిలి యొక్కమొగిఁ బన్ని మహాపర్వ
తంబునుం గప్పునీలాంబుదబృందంబుచందంబునం బొదివె నప్పుడు. ౧౩.

క. ఏగతి నైనను నితని నె, నే గెల్చెద ననుచు మునుపు ♦ నెతెఁ బల్కెడువా
నాగణయూథపులపుడే, మూఁగుచు మోహాంధులైరి ♦ మూఁగి వాతనిచేన్. ౧౪.

క. ఇటువలె నిశ్చయమేకద, దిటముగ ఘనుఁడైనవాని ♦ తేజము నుమతిరయ
త్కుటముగుచును బ్రతిబలభట, పటుతరపౌరుషముదీలు ♦ పఱచు నెకాదె. ౧౫.

క. ఒండొరు బాసట చేయుచుఁ, జండాపస్తంభశక్తి ♦ సాహాయ్యంసము
ద్దండతనందఱుఁ గవయుచు, వెండియు నతనికి నొడివిరి ♦ వీరుల్ప్రమథుల్. ౧౬.

తే. ప్రబలసాహాయ్యయుక్తిఁ ♦ బరఁగునట్టి, కార్యసిద్ధులు దామెట్టి ♦ ఘనుల నైనఁ
గదిసినప్పుడు సైన్యసం ♦ ఘములతోడఁ, గలఁగి తిరుగుడుపడఁ జేయుఁ ♦ గాదె యవని.

వ. ఆ సమయంబున. ౧౭.

మ. వరకాండాసనముక్తులుఙ్ఖకశర ♦ వ్రాతంబుపత్త్రధ్వనుల్
వఱల స్వర్లోకకాననంబునకుఁ బో ♦ వంగోరి పెన్గుంపులై
కెఱలం బాఱుచు మింటికిన్నెగయుప ♦ క్షివ్రాతముం బోలె న
త్త్వరలీలన్ దిశలెల్ల నిండి యొగసెన్ ♦ దండోపతండంబులై. ౧౮.

ఆ. శైలగుహలయందు ♦ సానుదేశంబుల, నిండెఁ బ్రతిరవములు ♦ మెండుకొనుచుఁ
జండవేగజనిత ♦ చాపనిర్ఘోషంబు, దిశలు బగుల మ్రోసె ♦ దీర్ఘముగుచు. ౨౦.

ఆ. భూనభోంతరాళ ♦ పూరితోష్మాంతమై, గహనభూరుహములు ♦ గంపిలంగ
ననిలసూచితాంబు ♦ దాతివృష్టియుఁ బోలెఁ, బ్రమథబాణరవము ♦ బరఁగె దిశల.

వ. అప్పుడు. ౨౨.

చ. అదనబుతుత్రయంబుపవ ♦ నాశనుఁడొటను జాలడస్సినన్
వదలుచు జాఱుకంచుకము ♦ వార్యరణోత్సుకతాతిరేకతన్
బొదలుచుఁ బొంగి పిక్కటిలి ♦ పూర్ణత నొందఁగఁ జేసె నయ్యెడన్
గదనసముత్సుఖుండయిన ♦ గాండివిదేహము భీషణాకృతిన్. ౨౩.

మ. ఘనరుత్క్రంపితుఁడైనపార్థునిరణో ♦ దగ్రప్రభావృష్టిత
ఘ్నసైన్యంబువినాశసూచకనిపా ♦ తస్ఫూర్జదుల్కాకృతిన్
దనరన్స్వర్గణభూనభోంతరదిగం ♦ తవ్యాప్తమైరోషముల్
బెనఁగంగప్పెనుదుర్నిరీక్ష్యమగుచున్ ♦ భీతిన్స్వైనంజేయుచున్. ౨౪.

సీ. ఈరీతినబ్బలం ♦ బెల్లనుగప్పుచుఁ, బ్రళయాంతకునిలీల ♦ రౌద్రమగుచు
దిక్కులెల్లనునొక్క ♦ దెసకుఁగూర్చెడులీల, గవిదీప్తినెగఁజిమ్ము ♦ క్రమముమీఱ
ననిలంబుభూగోళ ♦ మంతయునిండుచు, ఘూర్ణిల్లఁజేసెడు ♦ కొమరుమిగుల
నద్రులతోఁగూడ ♦ నవనిగంపిలఁజేయు, కరణినిబహుచిత్ర ♦ గతులనలరి
పార్థుఁడప్పుడుగ్ర ♦ బాహుదర్పంబున, నేనెనేనెగల్తు ♦ నితనిననుచు
నొక్కపెట్టుగవిరియు ♦ నక్కిరాతకబల, బహువిధాయుధములు ♦ పరఁగఁజూచి.

క. ఘనకార్యఫలవినాశన, మును జేసెడునట్టికాల ♦ మునుబోలెనుదా
సునిశితసాయకములనడు, మనెవేగమెతునియ నేసె ♦ మదమెలరారన్. ౨౬.

చ. అవిదితసత్ప్రయోగవిప ♦ దావహకారణమైయదృశ్యమై
తవిలిసమగ్రసత్ఫలయు ♦ తత్వవిదూరగతందలిర్చువ
మ్యవిరళబాణజాలముల ♦ నగ్గనుఁడత్తతివృద్ధినొందఁదాఁ
బ్రవిమలనీతిచేఁజతురు ♦ పాయములందగనొంచుకైవడిన్. ౨౭.

వ. అప్పుడు. ౨౮.

చ. అలరఁగభూనభోంతరము ♦ లందొదిగంతములందొ కానిలే
కలరవిబింబమందొమఱి ♦ యాఘనుపంచనొయొక్కసారిగాఁ
గలయవిముక్తమయ్యెమఱి ♦ కాకమునీంద్రునిదేహమందునా
వెలసెడునీశరౌఘమిది ♦ వింతనియెంచిరితద్గణావళుల్. ౨౯.

చ. అరయఁగమర్మభేదులగు ♦ నట్టివియేనియుఁదద్గణాధిపో
త్కరములమర్త్యలౌటవెస ♦ గాఁడుచుఁగ్రుంపకయుచ్చిపాఱిరా
శరములుస్వామికార్యమును ♦ జక్కఁగఁజేయునివానికైవడిన్
వసుసనధోముఖంబగుచు ♦ వ్రాలెనునాహిమశైలభూములన్. 30.

వ. ఇవ్విధంబునఁ బ్రకాశింపుచు నత్తపోధనధనంజయప్రచండకోదండవినిర్గతమార్గణాసారం
బక్కిరాతబలంబుపయిం బ్రసరించి మహాసంకటంబుగాఁ గంకటంబులు దూఱి నా
టుచు, పిష్టపేషణదోషంబుఁ దలంచి తద్వ్రణంబులయందుఁ బునఃప్రహారణంబు సేయు

నొల్లక కార్ముకపూర్ణంబుగాఁ దూర్ణప్రయోగలాఘవంబుఁ దెలుపుచు, తద్బలంబు నంత టం గలయం జుట్టుముండి మార్తాండప్రభాజాలంబు పంకజావళింబోలె సంకోచంబు నొందించుచు, స్వరూపప్రచారంబుల నవక్రంబై తేజస్సారంబులం బ్రకాశించుచు, నమోఘంబై మహారయంబున ఛేదనభేదనపాతనాదికర్మంబుల సమర్థంబై మహావీరో త్సాహంబునుంబోలె నుద్దీపించుచు, నప్రతిహతంబుగాఁ బ్రసరింపం బ్రయోగించుచు, న య్యర్జునుండు మహోగ్రేషుమయూఖౌఘంబులు వెలుంగ నేకదేశస్థుండై యుం డియు ననేకదేశాగతంబైన య య్యరాతికిరాతబలంబులయందుఁ బ్రతిభటముఖో ద్దీపితుం డగుతపను ననుకరించుచు, కోపోద్దీపితుండై మహారయంబునం బ్రవర్షించు శరవర్షంబునం బ్రచండానిలంబుచేతం గ్రీష్మోద్ధితం బైనపరాగంబునుంబోలె, తత్ప్రతి పక్షసైన్యంబు విభ్రాంతిం బొంది, యితండు తపోబలంబున బాణంబుల నదృశ్యాకారం బులు గావించి ప్రయోగింపుచున్నవాఁడో, కాదేని తదీయమాయావినిహతంబులై యస్మదీయాయుధంబులు మగిడి మమ్ముఁ దాఁకుచున్నయవియొ, కాక యితనివలని గుణాతిశయంబుననో భయంబుననో తిరోహితులై యమరులు ప్రయోగించుచున్న వారో, కాని యితరంబైన సముద్రతరంగంబులచందంబున నేతత్సాయకంబు లనేకా నీకంబులై పరఁగు టెట్లు? ఇతండు భండనంబు చాలించెనేని చరాచరంబులకు క్షేమం బగు, అట్లు గాదేని యిప్పుడ జగత్ప్రళయం బాపాదించునని భయంబునం దల్లడిల్లుచు, కోపోద్ధతుం డగువానిచేత శాంతప్రధానం బైనకార్యంబునుంబోలె మదోద్ధతునిచేతం బ్రియవచనంబుచందంబునఁ బ్రబలం బగుక్లైబంబుచేతం బౌరు షంబువిధానంబుఁ నాజిష్ణునిచేతం బ్రకాశింపకుండె. తత్సాయకసమూహంబులం బలభటనికాయంబులకాయంబులం గప్పి మార్తాండమండలప్రచండప్రభాతండంబు పరిశోషితంబైన జలంబులపయిం బ్రసరించుచందంబున, మండలాకారత్వంబు దిక్కులం బిక్కటిల్లుచుండ మహోత్సాహంబునం బొంగి జగదభ్యంతరపరిచ్ఛన్నంబుగా సం ధానమోక్షణంబు తెలియంగరాకుండ నతండు పరిమండలీభూతంబుగాఁ బ్రయోగించు నిశితాంబకనికురుంబంబున నత్యంతభీతిం గంపితవిజయం బగునప్వపమనయనానీకం బ య్యర్జునునిచేత నిర్జితంబై యాయుధంబులు విడిచి రణంబు చాలించి నిజపురో వర్తమండైన శంకరుం గనుంగొన నెఱుంగక భయభ్రాంతిం జెందుచు, నుక్కుచెడి వెక్కుతెఱంగుల నలుదిక్కులం బఱచిన నప్పుడు. ౩౧.

జయవాంఛవిడిచి నాడుచుఁ బఱచు నా ♦ సైన్యంబులం జూచినఁ
దయబుట్టెఁ మదిలోన నజ్ఞమనకుం. ♦ దర్కింపనట్లైకదా

భయులైచిక్కిననీచశత్రులదయం ♦ బాటించిరక్షించినన్
నయమున్ గీర్తిమహాత్ములౌనరులకె ♦ న్నంగా దెయుద్ధంబులన్. ౩౨.

క. కరవాలచాపబాణో, త్కరములతోఁబఱచుసేనలఁ ♦ గనితఱుముచును
క్కటినిలిచినసాధించుచు, హరుబలమునునొంచిమెఱసె ♦ నతిశుభయుతుఁడై. ౩౩.

క. నరుఁడిట్లుభీతిఁబఱచెడు, పెరసైన్యముమందగతిని ♦ పిఱుఁదందతిమెన్
ధరణిమహాత్ములువిరిగిన, తఱుముచుమతినొంపమదిని ♦ దలఁపరుగాదె. ౩౪.

వ. ఇవ్విధంబున వెఱచఱచి చిచ్చువడి పచ్చిపఱమి తత్ప్రమథానీకంబులం జూచి విస్మయ
మానమానసుం డగుచు సుస్థిరయశుం డగుట నబ్బలంబులు తిరుగుడుపడుటకు నుబ్బు
దక్కి తత్సైన్యంబు నిలువరింపం దలంచి యుద్ధంబు చొచ్చి శస్త్రణంబులకుం జేయి
వీఁచి యెలుం గెత్తి సేనానాయకుండైన కుమారస్వామి యిట్లనియె. ౩౫.

క. సమరముచాలింపకుఁడీ, సమయోధులుమీరలసుర ♦ సంఘము నెల్లన్
సమయించువారలితరుల, క్రమమునపకీర్తినొందఁ ♦ గానేమిటికిన్. ౩౬.

క. దినకరకరసంపర్కా, త, నిసుమడితేజమునఁబొలుతు ♦ రీరలువృథగా
ననినోడిపఱచుమీకీ, ఘనఖడ్గము లేలనవ్వఁ ♦ గారణమగుచున్. ౩౭.

క. వనచరసేనలఁగావక, వనమృగములజాడఁబఱమ ♦ వారికిమీకీ
ఘనశరములనగు వేదన, వినుఁడెందునమానననుచు ♦ వెసఁబరికింతున్. ౩౮.

ఆ. అతులమైనకీర్తి ♦ యమితప్రభావంబు, దీలవడఁగనిట్లు ♦ తెఱలుమీకు
నెందువలనఁబోవు ♦ నీయపకీర్తిదా, మెఱసిసాహసమునఁ ♦ దిరుగకున్న. ౩౯.

ఆ. అసురవరుఁడుగాఁడు ♦ నహికులుండునుగాఁడు, కొండవంటిరక్క ♦ సుండుగాఁడు
అనికినుత్సహించు ♦ నలరాజసుండైన, పురుషుఁడదియుఁగాక ♦ భూవరుండు. ౪౦.

క. ఈతనికీగతివెఱచుచు, భీతింబఱవంగనేల ♦ పిఱుతివకబలో
పేతులయియెదిరినిలిచిన, నాతతముగగెలువవచ్చు ♦ నశ్రమభంగిన్. ౪౧.

క. సునిశితబాణాసారం, బనుకంపతమందగతుల ♦ నడరింపుమఁదా
వెనుకొనిపశువులఁదోలెడు, ననువునమిముఁదోలియాడు ♦ వజ్ఞతగదురన్. ౪౨.

క. హతుఁడైనవాఁడుపురుషుఁడె, హతికిన్వెఱచఱచిపఱచు ♦ నతఁడొకభటుఁడే
పతియునుదానునునవినవి, హతుఁడగునాతండుపురుషుఁ ♦ డగుఁగాకెన్నన్. ౪౩.

ఆ. పుట్టుసహజగుణముఁ ♦ బోఁగొట్టుకొనకంటె, మిగులమూఢుఁడైన ♦ మేలుఁతలఁప
మణులులేకసేయు ♦ మణిభూషణములొప్పు, చెక్కుమణులునేర ♦ జెలువుగలదె.

మ. పరబలభంగవిస్ఫురద ♦ భంగశతాంగములిందులేవు న
త్వరితతురంగపఙ్క్తులును ♦ వారణబృంహితగంధసింధురో
త్కరములులేవయప్రతిహ ♦ తంబగుసైన్యములేదయీగతిన్
బఱవఁగనేలశత్రుజిత ♦ పౌరుషులైయపకీర్తినొందుచున్. ౭౫.

క. గిరియందునదైతేయుల, నవిరళగతి గెలిచివిజయ ♦ మందెదుమీకీ
ఘనినీచులకనిరిపుపైఁ, గవియకమఱిపాఱిపోవఁ ♦ గాఁదగదిటులన్. ౭౬.

వ. అదియునుంగాక భవదీయాధిపుం డైనశంకరుండు పన్నిన శాత్రవునకు వెన్నిచ్చి పఱచుచుండు మిమ్ముం జూచి దురాచారధారాపరిపాలనంబునం బొందువిధంబున నిష్పౌరుషత్వంబునం బొందుచున్నవాఁడు. పరిపంథినిర్మథనసమర్థంబులై భయంకరాకారంబులం బొల్చుచు నిర్భయంబునం బరిరక్షాదక్షులై దైవమానుషాతీతప్రజ్వలితానోన్యన్యసదృశగుణాతిశయంబులం బ్రకాశించు మీరిట్లు భేదింపంబడి ప్రతాపాభిమానంబులు విడుచుచుం బఱవ నిమిత్తం బేమి! నిశితాసికౌశలంబున నప్రతిహతం బగు తేజంబున వెలుంగుచు, రణపటిష్ఠుల మగు మమ్ముం బ్రతిఘటించి ప్రబలుండై రిపుండు విజృంభించి భాస్వత్కవచుండును మహోన్నతపక్షుండును నై విశ్వప్రాణాపహరణకారణమహారణనం బగురణంబునం జలంబునం జలింపకున్నవాఁడని రోషణంబున భీషణంబుగా మోహరించి నిలువం దగు; అట్లుంగాక, తదీయఘోరశరాసారవిదారితంబులై యురదంబులుం బఱవరా కుండునట్లుగా గుప్పఁగూలం బడియున్నతురంగంబుల వలనను, దంభోళిధారాసంభిన్నంబులై కూలిన కుంభినీధరంబులలీలం గనుపట్టు గంధసింధురంబులవలనం బ్రవహించు శోణితధారాప్రవాహంబులచేత నాకులంబై వియచ్చరుల కుత్సాహంబు దీపింప, నాయోధనధూర్వహసనాహినీనివహాన్యోన్యవినిర్జిత విస్ఫూర్జితపరస్పరవాక్కలహంబులను, మదగంధబంధురసింధురఘటాసంభరణవిజృంభణంబునను, ఇతరేతరవిజయోత్సాహంబులను, పరినర్తితానుకారసముత్పతితంబులగు బంధురకబంధంబులం గనుంగొని ప్రకంపితసారథికంబుగా భయాతురత్వంబున నరనంబు లద్దంబుగా నీడ్చుచుం బఱచుతురంగంబులవలనను, శూన్యతూణంబులుగా బాణంబులం బ్రయోగించి పరిపంథిమార్గణప్రహరణంబుల విహరణంబు లుడిగి హాహాకారంబుల మొత్తంబులుగాఁ గూలు రాహుత్తులవలనను, మహావీరుల కుత్సాహంబును, భయభ్రాంతులకుఁ గ్రోధోపహరణంబును నగునట్లుగా మహోత్సాహంబునం జెలంగు సింహనాదంబులను, ధనుష్టంకారంబులను, పుంఖానుపుంఖంబులై యసంఖ్యాకంబులై పరఁగు సురుశరగరుజ్ఝంపానిలస్వనంబులవలనను, గజఘంటికామహారావంబులను,

రథనేమినిస్వనంబులను, పటహారవంబులను, భేరీభాంకారనాదంబులను, కేతనపటపట
పటాత్కారంబులను, బహుతూర్యనినాదంబులను, బిరుదాంకితశంఖారవంబులను లోక
భీకరంబైన సురాసురసంగ్రామంబునుం బోలె నతిఘోరంబుగాని యీ యాహవం
బున కోహటించి పఱచుట కీర్తివంతులైన శూరుల కుచితంబుగాదు. తిరుగుండని య
క్కుమారుండు పురికొల్పం దెఱలి యనేకవిధంబులం బఱచు తత్ప్రమథానీకంబుల
నిలువరింపుచు మందస్మితసుందరవదనారవిందుం డై యంధకరిపుం డగునయ్యిందు
శేఖరుండు భండనోన్ముఖుండై గండుమెఱసి యీరవడించిన నా సైన్యంబులు రిపు
శరాగ్నిజ్వాలాజాలంబుల వేఁడిమిం బోఁడిమిసెడి పరిపంథి బాణార్ణవంబున మునింగి
యెద్దియునుం గానక దిగ్భ్రాంతులమై యున్న మమ్ముం దీరంబు చేర్చి రక్షించె
నని యకలంకంబుగా నా శంకరుం గొనియాడుచు సంతసంబునం బురికొని వెన్ను
దన్ని నిలిచె నంత. ౪౭.

క. హరుఁడు పినాకధ్వనిచే, హరిశైలము వగులదిక్కు ♦ లద్రువఁగ నరుపై
శరవర్షముఁ బరఁగించెను, మెఱయుచు భూధరముఁ గప్పు ♦ మేఘము బోలెన్. ౪౮.

క. హరుఁడును నరుఁడును బోరఁగ, ధరణీధరసదృశులైన ♦ తత్ప్రమథులాగిన్
వెఱచఱచి చిత్రరూపుల, కరణి నివిస్మయము నొంది ♦ కన్గొనుచుండన్. ౪౯.

క. నరుఁడు రవడించి యేసెడు, శరవర్షంబుడిపి యపుడు ♦ శంకరుఁడు సడిన్
గరలాఘవ మొప్పారఁగ, వరమార్గణ సమితిఁ బఱపె ♦ వాసవి మీఁదన్. ౫౦.

క. పురుహూతసుతుఁడు దానవి, కరముకు దుగఁద్రుంచి యుద్ధ ♦ కౌశల మొప్పన్
హరు మీఁద బాణవర్షముఁ, గురియుచుఁ జరియించుచుండె ♦ ఘోరాకృతియై. ౫౧.

క. చలితశరాసనముక్తో, జ్జ్వలకాండస్ఫూర్జదంశు ♦ చయములు నిగుడన్
వెలుఁగుచుఁ దోఁచెను నత్తఱి, బలభేదనతనయుఁ డపుడు ♦ భానుఁడు బోలెన్. ౫౨.

మ. హరకాండాసనముక్తఘోరశితబా ♦ ణాసారముం గప్పెన
ప్పురుహూతాత్మజమార్గణావలి వెసన్ ♦ బుంఖానుపుంఖంబుగా
వరుసం బర్వఁ జండభానుకిరణ ♦ వ్రాతంబులం గప్పు బం
ధురధారాధరభంగి నంతయును వి ♦ ద్యుత్కాంతిదీపింపఁగన్. ౫౩.

క. ఈరీతి నరుఁడు పఱపెడు, ఘోరశరాసారము డిపి ♦ గురుబాణవ్యా
పారమునఁ దపనమార్గము, ధీరత నరికట్టె హరుఁడు ♦ ధృతి మీఱంగన్. ౫౪.

మ. సమరామోఘభయంకరోరుశిఖిపిం ♦ ఛస్తోమసంజాతపుం
ఖములం బోల్చు శరంబు లేర్చి గుణసం ♦ గం బొప్పఁ బల్విఁటఁ దా

సమరంగూరిచిశంభుఁడేయనపియ ♦ య్యాకాశముంగప్పె హే
మమయూఖౌఘమువిస్తరిల్లఁగఁదటి ♦ న్మాలాసముద్దీప్యమై. ౫౫.

మ. నరుబాణంబులమీఁటిఘోరముగమే ♦ ఐన్నాటనవ్వేళవా
నరకేతుండును బిచ్చలింపఁగనగేం ♦ ద్రస్ఫూర్తిశోభిల్లఁదా
హరికాంతుండును భాసితుండును శివా ♦ గ్రాధిష్ఠితోద్దీప్యసు
స్థిరధీరోన్నతదుర్గ్రహత్వవిజయ ♦ స్థేమాభిరాముండునై. ౫౬.

ఉ. అంతటశంభుచేతవిశి ♦ లాంబకుఁడైనయుఁడగ్ని వోలెన
త్యంతముమండి పేర్చుచుబృ ♦ హజ్జటరాశి వెలుంగనోషధ్
సంతతిబ్రజ్జ్వరిల్లుహిమ ♦ శైలముచాడ్పుననొప్పిమార్గణా
క్రాంతము గాఁబురారివిశి ♦ ఖంబులుద్రుంచుచు నేసెనుగ్రతన్. ౫౭.

క. హాసఁడపుడుగ్రతేఁజూపుచు, గురమునఁగౌశలము మెఱయ ♦ దోర్బలవిజయో
ద్ధురతంబొలి చెడునరుపైఁ, బఱపెనమోఘాంబకోగ్ర ♦ పత్త్రాలువగుసన్. ౫౮.

మ. స్థిరభానూజ్జ్వలబింబసంభవితసం ♦ స్ఫీతాంశుజాలంబునా
హరకాండాసనమండలాంతరవిని ♦ ర్యద్బాణసంఘాతమున్
మఱలం జేయుచునప్పుడర్జునుఁడుభీ ♦ మంబైనగాండీవని
ష్ఠురనిర్ఘోషశరాలిఁగప్పెధనుర ♦ స్తోకప్రభావంబునన్. ౫౯.

క. శంభుఁడు నెంతయురణసం, రంభంబునఁబేర్చితచ్ఛ ♦ రంబుల నెల్లన్
సంభిన్నము సేసియువ, ష్టంభంబునననునిఁబొదివె ♦ శరవర్షమునన్. ౬౦.

ఉ. అప్పుడునర్జునుండునుమ ♦ హత్తరశాతహారాంబకౌఘమున్
గుప్పలుగూలమాటికిని ♦ ఘోరతఁద్రుంచిమహాగ్రహోగ్రుఁడై
యొప్పచుమానిసంఘముర ♦ జోర్విని జూపెననేకఫల్గునుల్
గప్పిరోయంచువిస్మయతఁ ♦ గన్గొనఁజేసెను జిత్రచారతన్. ౬౧.

సీ. గాండీవమండలా ♦ ఖండనిర్ముక్తప్ర, చండకాండౌఘము ♦ ద్దండమగుచుఁ
జండీశకోదండ ♦ సంఘాతమార్గణ, మండలిఖండించి ♦ మెండుకొనఁగఁ
జండదానవజయో ♦ ద్దండులౌప్రముఖులు, సారిదినచ్చెరువంది ♦ చూచుచుండ
శంభుపైఁజెనసియు ♦ జయలక్ష్మిఁజేకొనె, నత్యద్భుతంబిది ♦ యనుచుమునులు
తనువులుప్పొంగిపులకింప ♦ మనములందు, నెంతయునుబిక్కటిల్లెడు ♦ సంతసమునఁ
బార్థభుజవీర్యశౌర్యప్ర ♦ భావములను, బ్రస్తుతించిరిపొగడిరి ♦ పాండుసుతుని.

వ. ఇవ్విధంబునం బోగడు వడిసి యవ్విజయుండు శరాసారఘోరంబుగాఁ బోరునప్పు డారాతికదనకౌశలంబుఁ గనుంగొని కోపోద్దీపితుం డై యిట్లని వితర్కించు: ఏతత్సంగరంబున మదవినిస్రుతశ్యామాయమానానన కపోలభాగంబులఁ జెలువొందుచు, మహోన్నతంబులై యాక్షేపించుచు, అక్షీణం బగుదర్పంబున రణదక్షంబులై మహాపర్వతసన్నిభంబు లైనమత్తేభంబులమొత్తంబులు విహరింపవు. బహువిధకేతనమణిచ్ఛాయాకలాపంబులం జిత్రభానుప్రదీప్తలకుం జిత్రత్వంబు సంపాదించుచుం బయోధరగంభీరధ్వానానుకారపటునేమికారటంబునం బరఁగుమహారథప్రచారంబును లేదు. సముల్లసత్ప్రోస్త్రిమాలికావిరాజచ్చామలఫేనపుంజంబులను రంజిల్లుసముద్రోదకంబు వెల్లివిరిసినచందంబున దిక్కులు పిక్కటిల్ల ననర్గళప్రచారంబులఁ బరతెంచుఘోటకపటలంబును గనంబడదు. హతాహతోద్ధతధ్వనితవీరయోధప్రతిభటసముజ్ఝితతటిద్దీపితభాస్వద్దివస్వదంశుప్రజ్వలితాయతనిశాతహేతిప్రపాతంబునుం దోఁపదు. విలయకాలకాలప్రభాజాలవిశాలఘూసరితరథనేమికాకంఖాణరింఖాసంఘాతసముద్ఘాటితసముద్ధితోద్ధూతపరాగపటలంబు వియత్తలంబునం బ్రసరింపుచు, వీరవరణోత్సుకాగతసురవారసుందరీనయనతిరోధానత్వంబున నకాలరాత్రిం జేయదు. పృథుతరనేమికానిర్ఘోషభీషణం బగుతురంగమహేషారవంబులం బ్రబలంబుగా నిగుడు నవారణమదవారణబృంహితంబులు దుందుభినిర్ఘోషంబులం గ్రిందుపఱచవు. పౌరుషయశోభిమాను లగువీరయోధులాయుధప్రహతుల మూర్ఛిల్లినం దేరునట్లుగా జలవర్షధారాశీతలం బగుతదనేకానేకపకరశీకరాసారంబునుం గనుపట్టదు. అనర్గళం బగు సేనామార్గంబు పంకిలంబై దుర్గమంబై దురవగాహం బగుచు రక్తనదీప్రవాహంబునుం బ్రవహింపదు. మదద్విరదరదనక్షతంబు లగువక్షస్స్థలంబుల గగననిపతితంబు లగు బృందారకసముత్సుకోత్సర్జితమందారకుసుమదామంబులు మత్తద్విపంబులకు నెదిరించి సోలినవీరయోధులకు మూర్ఛలం దోఁప నీకయుండుపుటయుం గానరాదు. కరికరశీకరనికరపరివ్యాపితాధోరణధారణభర్మనిర్మితవర్మరత్నప్రభాపటలంబుమీఁదటం బన్నిభాస్కరతేజం బింద్రచాపఖండోత్పాదనంబు గావించుటయుం గనంబడదు. పక్షోపలక్షితం బగు మైనాకంబుచేతంబోలెఁ బరసామజంబులచేతం గలంచంబడి సైన్యాంబులు సైన్యంబునం బరిభ్రమించుచు సముద్రోదకంబులచందంబున ఘూర్ణిల్లకున్నయవి. ప్రతిభటసేనాగజంబులమీఁద నతిరయంబుగా నరదంబులు బఱపుమహారథికయూథంబులకుం బదావరోధకం బగునట్లుగా మూలంబులకుం దునిసిపడియున్న హస్తిహస్తంబులును విస్తరిల్లవు. గజారోహకులు ద్రెళ్లినం గూలునంకుశమూలంబుల

బిరుదుచిహ్నంబులుగాఁ గట్టినమయూరపింఛాకలాపంబు కువలయశేఖరంబులం జెలువొందు నిజకామినీశిథిలబంధం బగుకేశపాశంబువిధంబునం దదీయవక్షస్స్థలవిస్తృతంబునుం గాదు. కల్పాంతకాలంబునుంబోలె నసంఖ్యాకంబుగా మహావీరలోకంబు సమయుచుండ జగద్భక్షణలోలుపదీర్ఘజిహ్వాంచితోగ్రాననంబున నత్యుద్ధతం బైన మృత్యువిహారంబునుం దెలియంబడదు. మహారథికపరాక్రమంబును నిరసించు నస్మదీయసామర్థ్యంబు చంద్రతేజంబుపయిం బ్రచండమార్తాండదీప్తి వెలుఁగనియట్లీనీచసంగరంబునం బ్రకాశింపదు. ఇది విరుద్ధంబును నత్యద్భుతంబును నై యున్నయది. అట్టి మదీయశక్తివైకల్యంబు దైవమాయావిశేషంబొ, కాక యస్మద్బుద్ధివిపర్యయంబొ, లేక మత్పరాక్రమంబె నష్టం బయ్యెనో, యిట్లుంగాక నే నర్జునుండనుం గానో. మఱి యితరంబైనను గాండీవచండకోదండగుణవిముక్తనిశాతబాణవ్రాతంబు పూర్వంబున శత్రుసమూహంబులమీఁదం బోలె నిప్పుడీకిరాతానీకంబుపయిం బరాక్రమింపకుండునే! అదియునుం గాక యితండు ధనుర్ఘోషంబున నాకసం బవియింపుచుం గిరాతవేషంబున నుండుమహాపురుషుండు గాని నిశ్చయంబుగాఁ జేష్టావిశేషంబు లూహించినకార్ముకం బెడతెగక మ్రోయుచున్నట్లుగా గుణాకర్షణోద్ధరణసంధానమోక్షణంబులు లేనయ్యె. కరలాఘవంబున శరౌఘంబులం బ్రయోగించెడు సుస్థిరాసనశాంసశిరోధరసంధానం బనాయాసఘటనంబుగా నిర్వికారం బగుముఖంబు సంపూర్ణచంద్రానుకారంబై పొల్చెడు. కార్యవశంబున నాలీఢాదివిస్తారవిశేషంబుల సుస్థిరదేహుండై సౌష్ఠవంబు మెఱయఁ జలాచలలక్ష్యంబుల సమపాతంబుగా శరంబుల నాటించెడుసమయం బెఱింగి పరుని నొప్పించుచు నాత్మసంరక్షణంబు సేయుచుం బోరునైపుణ్యంబు భీష్మద్రోణాదులయందునుం గనుంగొనుట లేదు. వనచరుల కెట్లు సంభవింపనేర్చు. అట్లు గావున నీతం డెల్లభంగులం గిరాతుండు గాఁడు. ఇట్లసాధారణపరాక్రమంబునం బోరునిమ్మహాపురుషుని విక్రమంబు దివ్యాస్త్రమహిమం గాని నివారింప నలవి గాదు. అల్పంబైనను రోగప్రాయం బగుశత్రువివర్ధనం బనర్థంబు గావున సహించుట యుక్తంబు గాదని నిశ్చయించి యనివార్యవీర్యశౌర్యధుర్యుం డగు నయ్యర్జునుండు ప్రమథగణపరివృతుం డగుశాత్రవుం బరిభవింపం జాలు సమ్మోహనాస్త్రంబుఁ బ్రయోగించిన. ౬౩.

భీమదావానలో ♦ ద్దామగంభీరమై, నీలజీమూతంబు ♦ లీల మెఱసి
తపనతేజోనిరో ♦ ధకలీలభూనభోం, తర మెల్లఁగప్పియు ♦ ద్ధతిదలిర్ప

నిబిడాంధకారంబు ♦ నెఱయంగవనిఁగప్పు, తెఱఁగునయ్యస్త్ర ♦ తేజమపుడు
హరసైన్యములమీఁద ♦ నడరిబల్విడిఁబర్వి, ప్రజ్ఞావిహీనంబు ♦ పఱఁగఁజేసి
కడఁకఁజేష్టలుడిపి ♦ గర్వంబుఁదూలించి, సమరకౌశలంబు ♦ సమయఁజేసి
కరణపటిమదప్పి ♦ కడుభయంకరమైన, నిద్రనొందఁజేసె ♦ నెఱయనంత. ౬౪.

క. స్థిరతరగురుసారంబులఁ, గురువంశజులైనమిత్రి ♦ కులమునుబోలెన్
వరధనువులువిడువకకొం, దఱుద్రూన్పడియుండిరపుడు ♦ తత్పరవశులై. ౬౫.

ఆ. ధైర్యమువదలకయె ♦ ధరణీజములనూని, పొగరుకన్నులన్ని ♦ మూసికొనుచు
గజములట్లుద్రిందు ♦ కరములుద్రేలంగ, వివశులగుచుఁగొంద ♦ ఱవనిఁబడిరి. ౬౬.

ఆ. కాలయమునిలీలఁ ♦ గడఁగియుద్వృత్తిమైఁ, బాండవాస్త్రమపుడు ♦ ప్రతిఘటింపఁ
గర్తఫలముతెంచి ♦ కరములనుండక, కొన్నియాయుధములుఁ ♦ గూలెనవని. ౬౭.

వ. అంత. ౬౮.

సీ. మాయాతిరోహిత ♦ చ్ఛాయాశశాంకమౌ, శివునిశిరమునుండి ♦ యవిరళముగ
భానుబింబప్రభా ♦ పటలంబుకైవడి, దీప్యత్ప్రశంగోగ్ర ♦ తేజమడరి
యజ్ఞానమణఁచుత ♦ త్త్వజ్ఞానముతుబోలె, నిర్జరాస్త్రజమైన ♦ నిద్రనుడిపి
తెలివినెక్కొనఁజేసి ♦ జలదముల్పాటలి, తంబుగావించిని ♦ స్తరతనొంది
యుదయకాలముగతిఁజూడ ♦ నొప్పుసంధ్య, పగిదిఁదత్సైన్యములనేత్ర ♦ పంకజములు
వరుసవికసింపఁగాఁజేసి ♦ వఱలెనప్పు, డంతనద్దివ్యబాణంబు ♦ శాంతినొందె. ౬౯.

వ. అంత. ౭౦.

తే. తెలివిమీఱంగనానిద్రఁ ♦ దెలిసిలేచి, మబ్బువిచ్చినదిక్కులు ♦ మహితమగుచు
నడుగుణంబులఁదాల్చిన ♦ యొప్పుమీఱఁ, బ్రమథబలములువివిధాయు ♦ ధములుదాల్చి.

తే. అంతనార్తిగడచిన ♦ నంతరిక్ష, ముబ్బనెత్తెడుగతిదిక్కు ♦ లుజ్జ్వలతను
వెలసెనర్కాంశుజాలంబు ♦ విస్తరిల్లె, మొనసిదినలక్ష్మిరెండవ ♦ దినముఁగదిసె. ౭౨.

సీ. భుజవీర్యశాలియౌ ♦ విజయుండునవ్వేళ, సమ్మోహనాస్త్రంబు ♦ శత్రుచేత
దుర్గంబుదిగ్గజో ♦ ద్ధురతచేఁబోలెను, నప్రయాసతిభగ్న ♦ మయినఁబాను
సురగేంద్రబాణంబు ♦ నరిబోసియేసిన, నదితటిద్దీప్యద్వి ♦ షాగ్నులెగయఁ
గాలజిహ్వాభీల ♦ చాలనక్రియమీఱ, గడుభయంబునదేవ ♦ గణములాదుఁగ
నాకసముఁగప్పిదిగ్గజ ♦ హస్తరీతి, నీలమణిదీర్ఘకాయంబుఁ ♦ బోలిమెఱయ
లీలఁగగనాబ్ధికల్లోల ♦ మాలికనఁగ, కాలసర్పాళిగవిసెనా ♦ భీలమగుచు. ౭౩.

వ. ఇట్లు ఘోరంబుగాఁ గవిసి యా దుష్టోరగనికరంబు నిజఫూత్కారోద్గారితధూమా
వృతాంశుజాలుండై యుష్ణకిరణుండు శీతకరుండై తోఁప జగత్ప్రాణాపహరణభీషణ
విషదృష్టిపాత్రంబు లగు నేత్రంబుల వినిర్గతంబు లైనపిశంగకాంతులు దిక్కులు
వెలుంగం జేయుచు, విశాలజ్వాలాకలాపంబులు విస్ఫులింగాభీలంబుగా నిగిడింపుచు,
ననర్గళప్రచారంబులు మెఱయ విషాగ్నిధూమాకులదిగ్విభాగంబుగా భోగిభోగచ్ఛటా
పరిచ్ఛన్నం బై నభంబు శత్రుపరివృతం బైనపుటభేదనంబు ననుకరింపం జేయుచు, శత
సహస్రాయుతసంఖ్యాకంబులై తద్బలంబులం గప్ప నప్పు డప్పశుపతియును దప్పక
తార్క్ష్యోదయకారణమంత్రావిర్భూతం బగు వైనాయకాస్త్రంబు వరనాయకుండు నీతి
పారగత్వంబున రిపుకృతనిజమండలావరోధం బుడుపు తెఱంగున నబ్భుజంగాస్త్రంబు
భంగింపం బ్రయోగించిన నదియును గరుడశతసహస్రాయుతనియుతాకారంబులై
విద్యుత్సంకాశం బగు తేజంబున నాకౌకసనయనతిరోధానంబు గావింపుచు నభో
భాగంబునం బర్వి గరుత్సంజాతవాతోద్ధూతంబులై మహాఘనంబులు శీర్ణతృణౌఘం
బులునుం బోలె నభ్రమార్గంబునం బరిభ్రమింపం జేయుచు, మనశ్శిలాధాతువిశేషచ్ఛద
సన్నిభం బగు తేజఃపుంజంబు పశ్చాత్పురోభాగంబులం గప్పి గగనంబునం జరించు
విహంగమసంఘంబుల కపూర్వోద్ధత్యంబు గావింపుచు, సత్క్షణపక్షవిక్షేపంబునం బరి
భ్రమితసానుభాగంబై హిమాచలంబు మదరాగానుణితసురగణత్క్రాంతిపూరప్రపూ
రితమహాగుహాంతరాళత్వంబునం బ్రమత్తత్వంబునుంబోలెం గంపింపం జేయుచు, నక్తం
దివాంతరం బైనసంధ్యాకాలంబునుంబోలెఁ బ్రకాశించుచు, భూనభోంతరాళంబులం
బిశంగత్వంబు నొందింపుచు, నంశుమంతాంతర్హితంబు గావించి వనాంతరంబులం బ్రవే
శించుభీమోద్దామధామంబునం బర్వి యధ్వరవిధ్యపచారదోషంబు ప్రాయశ్చిత్తకర్తంబు
హరించు తెఱంగున నయ్యురగసమూహంబులం బరిభవించిన. ౭౪.

చ. అసదృశలీలఁ బూర్వకృత ♦ మైనశుభంబును బోలె శాత్రవో
ల్లసితపరాక్రమంబు సఫ ♦ లంబుగఁ జేయుచు నాగసాయకం
బసమగసంహృతంబయిన ♦ నత్తఱి నెంతయుఁ గ్రోధదీప్తుఁడై
యసమశిఖానలాంబకము ♦ నగ్గముఁడేసె నుగ్రమూర్తియై. ౭౫.

వ. అప్పుడు. ౭౬.

సీ. దీపితోర్ధ్వాధర ♦ తిర్యక్ప్రసారిత, జ్వాలాకరాళోగ్ర ♦ సటలు మెఱయ
నురుమేఘపఙ్క్తుల ♦ కుఱుకుసింహము బోలెఁ, బ్రాణికోట్లను మ్రింగు ♦ భంగి మెఱయఁ

ప్రళయాగ్ని నిగుడుచు ♦ భానుదీప్తిహరించి, విస్ఫులింగోదయ ♦ ప్రస్ఫురముగ
భిద్యమానాశ్మగం ♦ భీరధ్వనులుమీఱ, జంటపేన్మంటలు ♦ మింటికెగయ
వాయువశమునఁబసిఁడివ ♦ ప్రమును బోలెఁ, గనకతుంగోగ్రశిఖరిపై ♦ ఖరులఁదనరి
కాంచనానూనపట్టణ ♦ క్రమతకొంచు, కోరుపుష్పితవనరీతి ♦ మీఱె నపుడు. ౨౭.

ఆ. పల్లవములరీతి ♦ భాసిల్లుశిఖలచే, మెఱసి కాల్చె నీల ♦ మేఘసమితి
నభ్రమార్గమునను ♦ శుభ్రమైచూపట్టెఁ, బ్రళయకాలరౌద్ర ♦ శక్తిమెఱయ. ౨౮.

క. గోలాభీలవిశాల, జ్వాలల నాగ్నేయశరము ♦ సైన్యము నెల్లన్
కాలునిగతి సమయింపఁగ, శూలియు వరుణాస్త్రమేసె ♦ సుస్థిరభంగిన్. ౨౯.

వ. ఆ సమయంబున. ౩౦.

సీ. పర్వతోభయసమ ♦ ప్రాంతవిద్యుల్లతా, మేదురంబగునీల ♦ మేఘపటలి
దీపితాగ్నేయోగ్ర ♦ తేజంబుమాయఁగాఁ, బటునటత్పూత్కార ♦ బహుళమగుచు
దివినుండిగంగదాఁ ♦ బ్రవహించుపధమున, నవిరళజ్వాలిక ♦ లడఁగుచుండఁ
దప్తాయసముమీఁదఁ ♦ దలకొన్నవిధమున, నంబుధారాప్రవా ♦ హంబువొరఁగ
పూత్కృతులమించిమింటికిఁ ♦ బొగలునిగుడ, నడరియార్ద్రేంధనంబేర్చు ♦ నట్లుఫేన
తతులునిగుడంగనభ్రపం ♦ క్తులుబర్వ, భీకరాకారనిర్ఘోష ♦ భీషణముగ. ౩౧.

ఆ. చిత్రకేతుచాయ ♦ చీనాంబరములీల, ధూమసంవృతమయి ♦ తోఁచుచుండ
నింద్రచాపదీప్తి ♦ నెనఁగియాగ్నేయాస్త్రి, కాంతులపుడుచిత్ర ♦ గతులఁదనర. ౩౨.

క. జలవర్షముపైఁగప్పిన, బలుపగునిర్ఘోషమడరఁ ♦ బాండుప్రభచే
నలఘుతరధూమపటలము, వెలయంగాశాంతినొందె ♦ వెరవతియచటన్. ౩౩.

క. సింధూర్మిచయవిభాసిక, బంధాఘోచ్ఛిన్నమగుచుఁ ♦ బావకశరసం
బంధాగ్నులుజలదచ్ఛద, సంధ్యావృతరాగలీల ♦ సమసెంజూడన్. ౩౪.

క. నీలాద్రినదృశజలధర, జాలంబులుకలయఁబర్వ ♦ సంధ్యావృతమై
యాలోగగనమువికసిత, నీలోత్పలజనితశోభ ♦ నెరయవెలింగెన్. ౩౫.

వ. అంత. ౩౬.

క. నానావిధరణకోవిదుఁ, డౌనర్జునుఁడపుడుశత్రు ♦ హననోత్సుకుఁడై
నానాశరములనేసిన, వానినిదునుమాడెహరుఁడ ♦ వారణలీలన్. ౩౭.

మ. హరుఁడీరీతిఁదదీయబాణమునఁబ్ర ♦ త్యస్త్రంబులంద్రుంపఁగా
నరుఁడున్వైసరకేసియేసిమతియం ♦ తంబోకదివ్యాస్త్రముల్

నిరసింపంబడె బాహుదర్పవిలాస ♦ శ్లీలన్వెసం బోరెదక్
వెరపుం జేవయు లావుశౌర్యము ధరక్ ♦ విఖ్యాతి గాఁ బోరెదక్. ౮౯.

సీ. అనుచు ననూహింపుము ♦ నాపదల్ బాపఁగాఁ, జాలెదు దివ్యాస్త్ర ♦ జాలమప్పు
డటువంటిమిత్రుల ♦ యందును బోలెను, నంతర్హితములైన ♦ నంతనరుఁడు
పౌరుషంబును బోలెఁ ♦ బటుశరాసనమున, ధైర్యంబు నూల్కొల్పి ♦ శౌర్యమునను
సమరాభియోగోత్స ♦ వమునదీపించియు, శాత్రవోన్నతికార్త ♦ సైఁపలేక
మదిరికోపంబునను దేహ ♦ ముబ్బదఱిగి, పొగలుఁగప్పిన నగవహ్ని ♦ పగిదిఁ దవరి
శత్రుభీషణవీర్యతే ♦ జయులు వెలయఁ, బాదుకొని నిల్చి మత్తియౌన ♦ బ్బాహుబలుఁడు.

ఆ. శత్రుదుర్గమునకుఁ ♦ జంచలం బందక, ధీరభావమపుడు ♦ తేటపడఁగ
వంశమానములను ♦ వదలని కీర్తి చే, భార్య చేతఁ బోలెఁ ♦ బరితపించె. ౯౦.

క. హిమగిరి గెల్చెడుకొఱకువి, షమశయనుఁడు నిగ్రహించు ♦ జాహ్నవిరభస
క్రమమున నపకృతవీర్య, త్వము నొందుచుఁ గోపమడర ♦ దర్పోద్ధతుఁడై. ౯౧.

వ. ఇవ్విధంబున ధైర్యవీర్యశౌర్యంబుల నవార్యుండై పాల్చి నిల్చి యవ్విజయుండు శాబ్దికుండు శబ్దంబున భావార్థంబు సాధింపం దలంచు చందంబున సాయకంబుల విజయంబుఁ గొనం దలంచి సంగ్రామోన్ముఖుండై ప్రతాపోద్దీపితుం డగుచు పూర్వయుద్ధంబుల యం దిట్లు శక్తివైకల్యం బాపాదించు నే యనుచుం బరితప్తుండై భీషణ శేషోరగముఖోద్భూతమహావిషాగ్నిజ్వాలాకలాపంబునుం బోలెఁ గ్రోధంబువదనంబున నిండి వెలుంగం గోపారుణిత నేత్రంబుల బాష్పంబులు దొరఁగ నంగరవిభ్రమంబునం బరిభ్రమిత శిరస్కుండై సాంద్రరోషసంతప్తం బగుముఖంబు త్రైలోక్యపచారంబు సేయం దోఁచు తెఱంగున ఘూర్ణమానంబు నెరయం భృకుటిసంఘటితవికటిత చటులాననంబు మెఱయఁ గ్రోధాంధకారావృతుండై నీలనీరదపరిచ్ఛన్నత్వంబున వక్షోన్ముఖహేతుకం బగు నూర్ధ్వప్రసారితగభస్తిస్తోమంబులు ప్రసరిల్లం బ్రకాశించు చండమార్తాండుండునుం బోలెఁ బ్రదీప్తు డగునయ్యాఖండలనందనుండు దిగ్వేదండశుండాదండసముద్దండం బైనబాహుదండంబున భద్రగజం బద్రిశిఖరంబునుం బోలెం బయోధరగంభీరధ్వానం బునం బ్రచండం బగుకోదండం బఖండంబుగా మ్రోయించుచు, నప్పురారాతిపదాతి చేతోజాతంబులం జిత్తజుండు ప్రియజనధ్యానంబులచేతం బోలెం బ్రశాతబాణపాతం బులం బ్రతప్తంబు నొందింపుచు, నప్రతిహతఘోరశరాసారంబులం బరఁగించిన శాస్త్రి జ్ఞానియందు వాదిత్వంబును, పీతరాగులయెడల గుణాపేక్షయు, నగోచరం బైనపర బ్రహ్మంబునందు వాక్యంబునుం బనిగొనని విధంబున నమ్మహాదేవుని దేహంబునం దత్యా

యుకసముత్కారంబు నిష్ఫలంబై హైమంతభాస్వంతాంశుజాలంబువిధంబున మహో
న్నతం బైనశైలంబునుంబోలెఁ బ్రకాశించుచున్నప్పినాకపాణి నొప్పింపం జాల దయ్యె.
అప్పు డప్పశుపతియును వప్రక్రీడాసముత్థితం బగుదురంతదిగ్దంతిదంతప్రభేదనపాటవ
ప్రహారంబు హరియించు తెఱంగున నతనియపక్రమపరాక్రమం బుపసంహృతంబు గావిం
పుచు, రణోద్ధరణసమర్థం బగుప్రతాపం బుద్దవిజరాజనందనునకుం వల కొనునట్లుగా
బ్రహ్మాసిమూలకారణుం డగునాస్థాణుం డప్పాండవేయుమీఁదివాత్సల్యంబునం దదీ
యాభిభవంబు సైరింపుచు. ౯౨.

క. ప్రతిహతుఁడయ్యెనునీతఁడు, వితతపరాక్రమము వెలయ ♦ వేడుకతోఁ దా
నతులయశంబునముద్దే, పితుఁడయ్యెడుసూర్యుపగిది ♦ భీకరలీలన్. ౯౩.

ఆ. ఇతనిపౌరుషంబు ♦ నెల్లనుజూచుచు, భీతిఁదేజముడిగి ♦ పెంపుదఱిఁగి
కాంతిదఱుఁగుదీప ♦ కళికయుఁబోలెను, దర్పముడిగెసైన్య ♦ తతిదలంప. ౯౪.

క. మదముడుగుదంతిప్రతిగా, నెదిరించినమత్తకరికి ♦ నెంతయుగెలువన్
విదితంబగుగతినితనికి, నదనంగెలువంగసులభ ♦ మగుచుండెఁజెన్. ౯౫.

క. అనియీరీతివిశంభుం, డనుపమమగుపార్థుకీర్తి ♦ యరిమధ్యమునన్
గొనియాడుచుమత్క్రమమున, ననినాతనిగెల్చియోడు ♦ నయ్యెడఁదలఁచెన్. ౯౬.

వ. అంత. ౯౭.

సీ. తపసియౌవిజయుని ♦ యపరిమితంబైన, బాణావళినిభూత ♦ పతిబలంబు
నఖిలజీవులుభూమి ♦ నాజన్మసిద్ధమౌ, జాతిధర్మముమించఁ ♦ జాలనట్లు
సైరింపఁగాలేక ♦ సతతంబుభయమంది, యాకులంబగుచును ♦ గోకులంబు
నిశివేళలనువర్ష ♦ నిర్ఘోషమునుబోలె, ఘనబాణరచితాంధ ♦ కారమడర
నతఁడుబరఁగించుశరవర్ష ♦ వితతరవము, వీనులెల్లనుబగిలింపు ♦ వివశమగుచు
వినుచునంతంతనిలిచిక ♦ స్గైనుచునుండెఁ, జిత్రరూపంబుపగిదిని ♦ శ్చేష్టితముగ.

మ. అపుడప్పార్థుఁడుహస్తలాఘవసమ ♦ ద్యల్లీలబాణావళిన్
నిపుణుండైపరఁగింపుచున్ భయమునన్ ♦ నిర్విణ్ణులైనట్టియా
రిపుసైన్యంబులకుంగనంబడియెభూ ♦ రిప్రక్రియన్దుష్టరో
గపరీతంబగులోచనాళికినిశా ♦ కాంతుండుపెక్కాగతిన్. ౯౯.

వ. అంత. ౧౦౦.

సీ. సైన్యకంపంబున ♦ శంభుదేహముజలా, శయములకల్లోల ♦ చంచలముల
ఛాయామయంబైన ♦ ఛాయాధిపాకృతి, కరణిభేదతవిూఱఁ ♦ దరళమగుచు

నిర్వికారుండౌట ♦ నెరయఁ బెద్దలచేష్ట, లవితర్క్యములుగాన ♦ నపుడు నరునిఁ
గదిసియుఁ గోపంబు ♦ గదురక ఘనభుజ, విస్ఫార్యమాణమౌ ♦ వింటినారి
కుపితకాలోగ్రతోద్దండ ♦ గుణవిభాతి, దుష్టతక్షకసింహోగ్ర ♦ తులితగతులు
దసరనాకర్షణము సేయు ♦ చును వెలింగె, నుగ్రుఁడవ్వేళ ఘనరణో ♦ దగ్రుఁడగుచు.

చ. కుడి నెడమన్వడిం దిగియు ♦ ఘోరధనుర్గుణచండనిస్వనం
బడరఁగ నత్తఱిం బాలిచె ♦ హస్తిపకుండవలించి పల్కినన్
గడఁగి మదోద్ధతిం బెరుఁగు ♦ గంధగజంబను శంక పార్థులోఁ
బొడముఁగఁ జేయుచున్ గదచ ♦ భూరిభుజావిభవంబు మీఱఁగన్. ౧౦౨.

క. శరవర్షంబున ప్రతిగాఁ, బరఁగించెను పార్థుబాణ ♦ పఙ్క్తి మరల్చెన్
శరనిధిజలచరచయమునఁ, దఱుముగనదె నెదురువచ్చు ♦ తత్కులము బలెన్. ౧౦౩.

సీ. పరిపంథిమార్గంబు ♦ ప్రతిబంధముగఁ జేసి, యంతర్విభేదంబు ♦ నాచరించి
వివిధవిధ్వంసన ♦ విధిమీఱఁ జదివితో, సాయ ప్రయోగత ♦ పార్థివుండు
శత్రువిచ్ఛేదంబు ♦ పరగఁ జేసెను లీల, సగపినయ్యర్జును ♦ సాయకముల
నహరిపై గాకుండ ♦ నడుమ నే భేదించి, శరమోక్షసంధాన ♦ మెఱుఁగకుండఁ
జండకోదండగుణనము ♦ ద్దండరవము, నిండి బ్రహ్మాండమవియింప ♦ నిశితఘోర
సాయకాసారమడరించి ♦ శకలములుగఁ, జేసె నవ్వేళ నా చంద్ర ♦ శేఖరుండు.

క. ఈకరణి వితథమైనను, నాకవ్వడి క్రోధమడర ♦ నడరించు శరా
నీకము రయమున సభయా, నీకంబుగ వ్రాలె విపమ ♦ నేత్రుఁడు జూడన్. ౧౦౫.

ఆ. పార్థుఁ డేయ నిబిడ ♦ పద్ధతిఁ బరతెంచు, బాణవితతి హరుఁడు ♦ భంగపఱుప
సాధుజనులకనవ ♦ సరమునంగును బోలె, నపుడు ధృతి దొఱంగె ♦ నర్జునుఁడు. ౧౦౬.

క. వరుసనధోముఖమై పడు, నరసాయకనికరమెల్ల ♦ నడుమన ఱకియా
హరబాణపఙ్క్తి మెఱసెను, నిరుపమరణకర్మఫలము ♦ నెరయఁగ నంతన్. ౧౦౭.

ఆ. అప్పుడర్జునుండు ♦ నత్యంతలాఘవ, పటిమ మెఱయఁ బఱపు ♦ బాణరాజి
శంభుమార్గణముల ♦ సమయించి యాకుల, పడు బలంబు నాఁటెఁ ♦ బటురయమున.

క. నరుఁ డెచ్చి యురవణించినఁ, బురహరుఁడు నిదాఘవర్ష ♦ మును బోలె నుదాఁ
బరఁగించెను శరవర్షముఁ, గరలాఘవపటిమ మెఱయఁ ♦ గడు రభసమునన్. ౧౦౯.

ఆ. హరుఁడు ప్రియచికీర్షఁ ♦ దైపరఁగించెడు, మర్మపరిమృశోగ్ర ♦ మార్గణములు
పరమమిత్రునర్మ ♦ భాషణంబులలీల, నరునకపుడు ప్రీతి ♦ కరములయ్యె. ౧౧౦.

తే. ఆప్రభుని నిజశరంబు ◆ లతిరేకమునఁ బొందఁ, గరముక్తికీడఱుగ ◆ నరుని బాణ
పఙ్క్తిఁ జూచి ప్రమథ ◆ బలములు పెల్లార్వ, నధికమహిమ వెలయ ◆ హరుఁడు మించె.
సీ. ఘనతపోవీర్యంబు ◆ లనుసముద్ధతి మీఱఁ, గడవాఫ్తిఁ దరియింప ◆ మదిఁ దలంచు
నరుని బాణము లెల్ల ◆ హరియించెఁ దపనుండు, జలములని విరించు ◆ చందమునను
నంతినజ్జనుఁడు బా ◆ ణాంతర్హితంబైన, శూన్యతూణయుగంబు ◆ వన్యగజము
జలమెల్లఁ ద్రావిన ◆ శైలాగ్రగర్తంబు, నంచునుద్భాసచే ◆ హస్తియొకటి
కరము చాఁచినలీలను ◆ శరములున్న, వనుచు హస్తంబుఁ బలుమాఱుఁ ◆ జొనిపియప్పు
డర్థహీనతఁ జెప్పనో ◆ రాడకుండు, బంధువుని బోలెఁ బలుమాఱుఁ ◆ బరికృశించి.
క. ఘనతరబాణగ్రహణం, బునకై పలుమాఱు తూణ ◆ ములు నిజహస్తం
బున వెదకి వెదకి శరములు, గనఁబడకుండంగ నరుఁడు ◆ గతతేజుండై. ౧౧౩.
క. ధరగెలువఁగ మదిఁ దలఁచిన, ధరణీశుఁడు నీతివికల ◆ తనుగుందుచు దా
మతిమతి యూహించెడుగతి, శరధులు పలుమాఱుఁ దడవు ◆ సరభస మొప్పన్.
ఆ. ఇట్లు వెదకి వెదకి ◆ యిషులాభ మొందక, పరికృశించు నరుని ◆ పార్శ్వములను
శూన్యతూణయుగము ◆ జూపట్టె విగతాంబు, లైన పూర్వపశ్చి ◆ మాబ్ధులనఁగ.
వ. అప్పుడు. ౧౧౬.
ఆ. శూన్యతూణయుగముఁ ◆ జూచి యడపెఁ గాని, యమ్ములణఁగుటకెద ◆ నుమ్మలింపఁ
డయ్యెనతఁడు పెద్ద ◆ లాత్మమర్దశమాని, యాప్తశూన్యతకును ◆ నార్తిఁ బడరె. ౧౧౭.
వ. ఇవ్విధంబున నా కవ్వడి దివ్యాస్త్రంబులాదిగాఁగల నిఖిలాస్త్రంబులా శంకరుమహి
మానుభావంబున నంతర్హితంబులైనం బ్రతిక్రియ సేయ నెఱుంగక కృతోపకారంబు
లైనతూణీరంబులవలన మిత్రఫలంబుఫలంం గృతజ్ఞుం డైనసాధుజనుండు నుంబోలె బలా
త్కారంబున విశ్లేషత్వంబు నొంది యప్పు డయ్యర్జునుహస్తంబు పశ్చాత్కారణంబున
నత్తూణీరయుగళంబున కుపకారత్వంబును సంధింపం దలంప నుద్యుక్తం బై యుండె
నశ్లేకదా సంభావితుం డగువాఁడు సత్క్రియావైఫల్యం బగునెడం బ్రభుపురో
భాగంబునం బిఱుతివక నిలుచుట సాహసికత్వం బగుం గావున నివ్విధంబునం బురో
వ్యాపారకరవిహారుండై విగతశరవిహారిణంబునం బిఱుతివియక నిలుచు నా సంక్రందన
నందనుం గినిసి శంకరుం డహంకరించి తత్త్వార్థవిచారమధ్యంబున నిరుత్తరుం జేసి
నిఖిలార్థసంవేది యగునెఱవాది నిగ్రహస్థానంబునం బ్రతివాది నొప్పించుతెఱంగున
మహాపావకమయంబు లైనసాయకంబుల నాయంబుల నొప్పించి సత్వరంబుగా మణి
గణఘృణిప్రద్యోతితహైమరేఖావిశంకటం బగుతదీయకంకటంబు చండకిరణతిరోహిత

పరిమండలీకృతతటిత్సముంచితమగు దివ్యచ్ఛిన్నాభ్రఖండంబునుంబోలెఁ బ్రచండకాండప్రయోగలాఘవంబున హరించినం బ్రదీప్తుం డగుభాస్కరుండునుంబోలెం బ్రకాశింపుచు మహచ్చాపోత్క్షేపకరోత్కరాసివిశేషంబునం గంచుకవిచ్ఛిన్నం బగుమహానాగంబు చందంబునఁ బ్రతిబద్ధద్విపోన్ముఖనిబద్ధక్రోధోద్ధతప్రచండశుండాదండసముద్దండం బగుమత్తశుండాలం బగువిధంబునఁ బ్రావృట్సమ్ముఖమేఘసంఘాతభీషణనిర్ఘోషణసంబోధితమహామహీధరగుహాపనిర్గతనిరర్గళధ్వనితసముద్ధతరంహం బగుసింహంబు ననుకరింపుచు, ధూమరహితజ్వాలాభీలకాలాగ్నిసంకాశంబై మహాతీక్ష్ణత్వవైరనిర్యాతకత్వరణదుర్దమనస్థైర్యత్వతేజోధికత్వంబులం బ్రజ్వలితుండై యుండె నప్పుడు తనుత్రాణంబు తోడంగూడం దూణీరయుక్తం బచేతనం బయ్యును జేతనత్వాపేక్షితం బైనవిధంబున వాఙ్ముఖంబుగా భూతలనిపతితం బయ్యె. ఆ సమయంబున నిర్మలం బగునభస్స్థలంబునం బ్రకాశించుభాస్వంతుండునుంబోలె సత్వగుణప్రధానుండై యుండు నగ్గాండీవం గిట్టి విశ్వకర్మభాస్కరుంబోలె శస్త్రాభిమర్శితుం జేసినం దత్సాయకాసారంబులకుం జలింపక నిజరోషతనుత్రాణాయమానుండై యానుపూర్వ్యయుతబాహులీల లొప్పనను స్రవద్రుధిరసంలిప్తగాత్రుండై పార్ష్ణిప్రఘాతంబుల భూతలంబు గంపింప నార్చుచు మహాశనిసంకాశంబై శశాంకశకలాకారపాండురం బగుగాండీవచండశరాసనాగ్రంబున నయ్యుగ్రుం బొడిచి మదద్విరదంబు మహీరుహస్తంభంబునుం బోలెం బొడిచిన. ౧౧౮.

క. పొడిచినతద్ధనువప్పుడు, మృడునిమొడన్ లీలమయ్యె ♦ మిహిరునితేజం
బడరెను జహ్నుమహాముని, యొడనుద్ధతివచ్చుగంగ ♦ యింకినమాడ్కిన్. ౧౧౯.

తే. ఇట్లుచాపంబుపోయిన ♦ నింద్రసుతుఁడు, వితరణములేనిసత్కార ♦ గతినివాజి
కర్మమునకంతశక్తుండు ♦ గాకహరుని, శరవిదూరవిఘాతలఁ ♦ జాలడస్సె. ౧౨౦.

క. ఆసన్నశుభఫలోదయు, భాసురవీరవ్రతాను ♦ పాలకునియతిం
గాసిలెహరుశరములచుప, వాసాదులచేతఁదపసి ♦ పలెనవ్వేళన్. ౧౨౧.

సీ. అంతనయ్యర్జునుఁ ♦ డాపన్నివారక, మగునట్టిశరణంబు ♦ నందురీతి
ఘనకార్యసిద్ధిసా ♦ ధనతఁగాంచినలీల, నన్యగుప్తరితతే ♦ జోధికతను
దీపించుఘనదృష ♦ దివ్యఖడ్గంబందె, మూర్తితాహంకార ♦ మునుభజించు
చందంబునను గేల ♦ నందిశంకరుబాణ, వితతిఖండింపుచు ♦ వివిధగతుల
విలసదర్కాంశుపిహితోర్మి ♦ కలఁదలిర్చు, వారిరాశివిధంబున ♦ ధీరుఁడగుచు
ఖడ్గనిపుణులువిహరించు ♦ గతులుదనర, నరుఁడువిహరించెబీరంబు ♦ మెఱయనపుడు.

మ. సలిలాకాశములందు భానుఁడు ప్రతి ♦ చ్ఛాయాస్వరూపప్రభా
విలసన్మూర్తి యుగత్వమొందుచు మహా ♦ విస్ఫూర్తిదీపించులా
గులనయ్యస్త్రముఁడాకసంబునరణ ♦ క్షోణిం బ్రకాశించెపి
రలునవ్యాపిక రాసికాశలమహా ♦ ప్రాక్ప్రాణ్యోతల్ మీఱఁగన్. ౧౨౩.

మ. కఱకంటుండు ప్రస్తుఁ గ్రన్నాయకమునన్ ♦ ఖండింపనప్పార్థుచేఁ
గర మొప్పారుకరాసిదీప్తులడరం ♦ గానంతిఁదుత్తున్నకై
ఖరమీఁదం బడె భూరిమేఘనిహత ♦ త్సౌదామినీజాతవి
స్ఫురదగ్నిప్రభ మీఱ భూతిగణముల్ ♦ సూహింగఘోరంబుగాన్. ౧౨౪.

క. ఈపగిది నినిజఘనవఖ, ర్గాపహరతఁ గదనవిముఖుఁ ♦ డైనరుఁడంతన్
దీపింపనుండెను సహ్య, త్యాగంబునసమరభూమి ♦ దరినవ్వేళన్. ౧౨౫.

ఆ. ఇట్లు భంగమొంది ♦ యెంతయుఁ గోపించి, భుజసహాయుఁడయ్యు ♦ విజయవాంఛ
వృక్షసుగ్ణకరక ♦ వృష్టిఁ బోలెను బాష్పఁ, ద్దక్షనర్షనుప్ప ♦ డడరఁ జేసె. ౧౨౬.

చ. అడరుశిలాఘవితానముపు ♦ డాహరుఁడుగ్రశరబాణరాజిచే
నడఁగఁగఁ జేసె నన్నరుఁడ ♦ హంకృతి మీఱఁగఁ బాటవంబులన్
గడువడి భూనభోంతరముఁ ♦ గప్పి దిగంతములెల్ల నిండఁగా
బడిబడి నేసె బాహుబల ♦ భాసితుఁడై పిఱుతీయకెంతయున్. ౧౨౭.

చ. శకలములైన కొమ్మలను ♦ జక్కగుసర్వముడుల్లుపర్ణముల్
వికటతరాలుపుష్పముల ♦ విశ్లథమైనరసాంబుపూరతన్
వికలములైనమూలముల ♦ వృక్షవితానము దెల్లనే సెఁదాఁ
బ్రకటరణోర్వి దేవతకుఁ ♦ బారణచేసి నలీలశంభుఁడున్. ౧౨౮.

మ. నరుఁడంతన్ సరిదుత్తరస్తకరిచం ♦ దంబోప్పగంగాప్రవా
హరమోద్దండశరప్రవాహమునకై ♦ దానాభిముఖ్యంబుగాఁ
గర మొప్పన్వడివచ్చిశంకరునివ ♦ క్షంబుస్థలిన్ బాహువి
స్ఫురితోగ్రస్ఫుటముష్టిఘాతలవడిన్ ♦ స్రుక్కించెనౌద్ధత్యుఁడై. ౧౨౯.

సీ. కడఁగి యశోలక్ష్మి ♦ గలుగుచుపాయంబు, చింతించి తాశత్రు ♦ సేనతోడఁ
గినిసి దుర్లభమైన ♦ ఘనపరాక్రమమొందఁ, గోరుచు దగ్గరఁ ♦ జేయు నరుని
యౌద్ధత్యమప్పుడా ♦ హరుఁడు శైశవమందుఁ, గడుప్రియుండవదుఁడైన ♦ కొడుకు సేయు
దుడుకులు జనకుండు ♦ గడుకూర్మిసైరించు, చందాననోర్చువా ♦ త్సల్యమలర

సంతభుజయుద్ధసన్నద్ధుఁ ♦ డైనవాని, తోడ నెదిరించి తలపడె ♦ ధూర్జటియును
ముష్టియుద్ధంబు సేయంగ ♦ మొనసి యపుడు, పరఁగఁ దూణీరధనువులు ♦ పరిహరించి.

ఆ. ఘనకఠోరముష్టి ♦ ఘాతల నొప్పించె, నరుని హరుఁడు హరుని ♦ నరుఁడు వోడువ
ముష్టిహతులరవము ♦ మొనసి గిరులయందు, గుహలఁ బ్రతిరవంబు ♦ బహుళమయ్యె.

క. హరుఁ డపుడు రవడిఁ బొడిచెను, కరనిహతులు నరునకును సు ♦ ఖంబుగ నుండెన్
ఉరమున రౌద్రత నొందిన, నరునకు సుఖదుఃఖములు స ♦ మంబున గలవే. ౧౩౨.

క. నరునివరముష్టినిహతులఁ, దొరఁగెను రుధిరము నవోఁగి ♦ దోరంతరము
గ్గిరితటమున హరుఁ డొప్పెను, జరఠారుణరాగపిహిత ♦ జలధరభంగిన్. ౧౩౩.

క. హరుసహ్యగిరితటంబును, దఱుమగ వడిఁ దాఁకు జలధి ♦ తరగలభంగిన్
నరవరముష్టిప్రహతులు, కఱకంఠుని యురముఁ దాఁకెఁ ♦ గడురయ మొప్పన్. ౧౩౪.

మ. కఱకంఠోద్ధతహస్తయుగ్మవిలస ♦ ద్గాఢాయతాయత్తని
ష్ఠురసంఘాతలఁ గంధరంబ గలన ♦ క్షుల్ ఘూర్ణిలన్ సోలుచున్
వెరవొప్పంగను మూడు నాల్గడుగులన్ ♦ వేకిట్టి యప్పార్థుఁడా
హరునిం బాహులు బాహులన్ బెనచియు ♦ దృష్టిలఁ బట్టింగడున్. ౧౩౫.

ఉ. పట్టినబాహుశృంఖలిత ♦ బంధనవైఖరి మీఱఁ బాదసం
ఘట్టనముష్టిఘాతలఁ బ్ర ♦ కంపితభూధరలీల నిద్దఱున్
గిట్టుచుఁ బాయుచుం జెలఁగి ♦ కేవున నార్చుచుఁ బార్థశంకరుల్
చుట్టును ద్రిప్పి యొండొరుల ♦ స్రుక్కఁగ జేయుచుఁ బోరి రుగ్రులై. ౧౩౬.

క. ఇతఁడు నరుఁ డితఁడు శంకరుఁ, డతఁ డీతని పైనొరేక ♦ యితఁ డాతని పై
నతిరయమునఁ బడి రోయని, యతిభీతిఁ బ్రమథగణంబు ♦ లనఁ బెనఁగి రొగిన్. ౧౩౭.

శా. ఈలీలం దగ వారు వోరి రపుడేం ♦ తే తద్భరం బోర్వకా
శైలం బాత్మవిభీతిచే బలెనుద ♦ చ్చాంచల్యతం గంపిలన్
లీలన్ నిల్చిన నిల్చుచుం గదిసి కే ♦ లిన్నిక్కి నన్నిక్కుచున్
గాలోద్యద్భుజదర్పములెవ్వలయనా ♦ క్రాంతోద్ధతిం బొల్చుచున్. ౧౩౮.

వ. వెండియు నివ్విధంబున నొండొరులం గదిసి విశృంఖలవిహారం బొప్ప మల్లయుద్ధసన్నద్ధులై శృంఖలాయమానంబుగా బాహువులు బాహువులం బెనచి పదంబులు పదంబుల బంధించి మల్లరణకరణనైపుణంబు మెఱయం బట్టువదలి పశ్చాల్లంఘన క్రాళలం బొప్ప పిఱిందిదెసకుం బాయ లంఘింపుచు, మల్ల చఱచి కంఖాళించి భుజా

స్ఫాలనంబులు సేయుచుఁ దిర్యక్ప్రసారితవామహస్తమధ్యాంగుళిప్రచాలనంబు మెఱయఁ దదంతరవివర్తితసవ్యకరముష్టిప్రచారంబులు దీపింపం జెందించుచు, పరస్పరోచ్చారితతర్జనభర్జనవీరాలాపంబులు వెలయం బరిభ్రమణంబు సేయుచు, పదఘాతనిపతితశతటోత్పతితజలాక్రామితపరిత్పతిస్థలం బగునట్లుగా సముద్ధతిం గదిసి పట్టి యితరేతరకరలాఘవంబులు మెఱయం బటురయంబున ధరణీధరసహితంబుగా ధరాతలంబు గంపింపం బట్టువదలక భూమిం బడి దృఢముష్టికరంబులు వెలిగాఁ బ్రసారింప నితరేతరశిరఃప్రహరణంబులు సేయుచు, కులాలకచక్రభ్రమణానుకారంబుగాఁ గరచరణకరణపరిచయంబు మెఱయం దిరుగుచు, సముత్పతితోల్లంఘనచాతుర్యంబు వెలయం బట్టువదలి కుప్పించి పాయ నుఱుకుచు, కరపదపరిముక్తభూతలముహుర్ముహురుత్పతితోద్ధతిం బొల్చుచు, గగనభాగంబున కెగసి మండలప్రచారంబుల విహరింపుచుం బోరు నెడ, వియదుత్పతితుం డగు నమ్మదనదమను పదయుగళంబు నిజకరద్వయంబునం బట్టి భూతలంబు చిక్కం ద్రొక్కి దోర్బలంబు మెఱయ నిక్క యక్కపిధ్వజుండు ధరణీతలంబునం బడం దిగిచిన విస్మయం బంది యప్పాపకర్మనాశంకరుం డగు శంకరుండు నశ్రమం బైన యప్పాండుసూనుం బట్టి విశ్లేషాశ్లేషంబున వక్షఃపరిపీడితుం గావించి యతండు గాఢంబు మహాత్తపంబునకంటె నత్యంతసంతోషావహం బగు నాహవంబునకుం బ్రీతుండై మహోత్సాహంబునం బొంగె నట్లు కదా మహాత్ములైనవారలకు నిఖిలగుణప్రకాశకారణం బగు తపస్యాచరణంబునకంటె నతిరిక్తంబైన నిజసత్వంబును నత్యాశ్చర్యకరంబుగా నుపకారకారణం బయ్యె. ఇవ్విధంబున నవ్విజయుని ధైర్యవీర్యధౌరంధర్యత్వంబునకు సంతసిల్లి కిరాతరూపంబు విడిచి హిమవచ్ఛుభ్రభస్మపరిస్నిగ్ధాంగుండును శీతమయూఖరేఖావిరాజితజటామకుటశేఖరుండును ననర్ఘమణిభూషణవిభూషితుండును వృషభాధిరూఢుండును నై యత్యంతమనోహరాకారంబునం బ్రసన్నుం డైన యప్పరమేశ్వరుం గనుంగొని యయ్యర్జునుండు పునఃపునఃప్రణామంబు లాచరింపుచు, తత్సాన్నిధ్యవిశేషంబున నిజతూణీరకార్ముకవర్మాసిధారియై పూర్వాకారంబునం బొల్చుటకు విస్మయంబునం బొంది నిశ్చలుం డై యుండె నా సమయంబున. ౧౩౯.

మందారనవచిత్ర ♦ మహితపుష్పంబులు, భువినిండవర్షించె ♦ నవిరళముగ
బోరునసురదుందు ♦ భులుమ్రోసెదివినుండి, తాటింపఁబడకహ్ల ♦ ద్యంబుగాఁగ
నింద్రాదిదిక్పాల ♦ సాంద్రవిమానౌఘ, రత్నావళీప్రసా ♦ రతనుదనరి
తారకావ్యాకీర్ణ ♦ తనుబొందినటువలె, గగనంబుసదమల ♦ కాంతిమెఱయ

నఘనసిద్ధవిమానంబు ♦ లప్పుడు మెఱసెఁ, గింకసంలగ్నఘనరణ ♦ ఘంటికాని
రావమలరంగవచ్చును ♦ రాశిరాజ, పక్షవిక్షేపములుమింటఁ ♦ బరఁగెమఱియుఁ.

క. గోరాడారూఢుండగు, గౌరీశ్వరుమీఁద నెరసి ♦ కల్పకసుమనో
దారస్రజరాజివితా, నాగన్యసుఖావహంబు ♦ వనిలము సేసెన్. ౧౪౧.

క. అంతటఁ బ్రమథులుతనుఁగనుఁ, గంతునమునఁ బొగడఁ బవ్య ♦ సాచియుఁదాన
త్యంతముదంబున సాత్రిపు, రాంతకుఁ గొనియాడెనిట్లు ♦ లనుమక్ భక్తిన్. ౧౪౨.

దండకము. శ్రీశాంకరీనాథయోంకారబోధాజగన్నాథయోగీంద్రబృందారకేంద్రాదిదిక్పా
లసంసేవ్యమానాంఘ్రిపంకేజపంకేజరాజీసుహృత్తారకాధీశవైశ్వానరోదారనేత్రత్రయ
స్ఫూర్జదాశీవిషోష్ణీషకాపాలమాలాపరిస్ఫీతశీతాంశురేఖామయూఖౌఘసంజాతసచ్చం
ద్రికానూనసంతోషితోద్యచ్చకోరాయతాలోకనాంచద్గణానీకమూర్ధప్రభాజాతసం
స్ఫీతవిస్తారితోద్యజ్జటాంధారధారాధరశ్యామసత్కంధరోద్దామకాపాలమాలాసముద్భాసి
రుద్రాక్షభద్రాక్షనిర్ణిద్రధామానమస్ఫీతసుస్ఫాటికానర్ఘహారావిహారాంచితోరస్థలా
నూనదాక్షిణ్యమూర్తిప్రభోదారధారాసముద్భాసితార్ధాంగభాస్వన్మణిస్ఫారనానావి
భూషాసముద్వృద్ధకూలోదయోద్భాసివామాంగసద్భాగభాగీరథీతోయసంజాతకంజా
తపత్త్రభ్రమోద్గమ్యమానేందురేఖాసముల్లాసితోద్దీప్యకోటీరకోటీరకోటీసముద్దీపితాన
ర్ఘరత్నప్రభాపూరితవ్యోమసంక్రామితోద్దామసుభ్రాభ్రసంభిన్నమధ్యానుసంధాన
సాంగోదయోజ్జృంభిజంభారిచాపప్రభాపూర్ణపూర్ణారుణాభాసిసంధ్యాసముల్లాసకృ
త్తాండవవ్యాధ్యత్కరోచ్చ్యాననాగేంద్రసాంద్రాజినవ్యాప్తపశ్చాద్ద్వయోద్భాగచండా
ట్టహాసోదయోద్ఘాతతామిస్రపూర్వాంబరప్రస్ఫురద్భాగభాగద్వయప్రస్ఫురత్కుండలీ
కుండలోచ్చాలనోల్లాసిగండస్థలోద్దామవామస్ఫురద్రత్నకేయూరసత్కంకణాభాసభా
స్వన్మణిస్తోమసంకల్పితానూనపాదాంగదోల్లాస వేదంబులు నీవ నాదంబులు నీవ
వాదంబులు నీవ శాస్త్రంబులు నీవ యజ్ఞంబులు నీవ తత్త్వంబులు నీవ భూతం
బులు నీవ భూతప్రభూతుండవు నీవ యాగంబులు నీవ భోగంబులు నీవ యోగం
బులు నీవ నిత్యంబును నీవ చిద్రూపము నీవ విశ్వంబును నీవ విశ్వప్రభూతాది
భాస్వన్నిధానంబును నీవ తత్కర్తవుం భర్తవుం హర్తవు నీవ సర్వంబును నీవ
తత్సాక్షివి నీవ మూర్తిత్రయాధారము నీవహంకారము నీవ యోంకారము నీవ
దివ్యప్రభావా మహాదేవ దేవాదిదేవా నమస్తే నమస్తే నమోస్తు. ౧౪౩.

ఆ. శరణుశరణునిత్య ♦ సదయాళుశంకర, శరణుశరణుదీన ♦ జనశరణ్య
నిన్నుశరణుబొంది ♦ నిర్జితమృత్యులై, యఖిలజనులుమనుదు ♦ రాదిపురుష. ౧౪౪.

ఆ. సకలలోకములకు ♦ శరణంబు నీవె కా, కరయ పేరుగలద ♦ యజితయభవ
యమరదైత్యమాన ♦ వాదులభయమొంద, కుండఁగాచు రక్ష ♦ కుండవీవ. ౧౪౫.

క. ఎందాక నీకు నతియొనర్పం, డందాకను వానిఁ బొందు ♦ నాపదలెల్లన్
బొందవు సంపదలును మఱి, నిందింతురు సకలజనులు ♦ నీచత గదురన్. ౧౪౬.

క. దానము సేసెడు వారలు, ప్రాణికి నినుఁ గూర్చి సేయఁ ♦ బొగడొందును సా
దానము భవదుఃఖంబును, భూనుత నినుఁ గొల్వఁ ♦ బాసిపోవు మహేశా. ౧౪౭.

క. కోరిన నిచ్చుట చిత్రమె, కారుణికత్వంబు వెలయఁ ♦ గాభక్తిమెయిన్
వారక నీకును మ్రొక్కుచుఁ, జేరని ఫలమిత్తువిదివి ♦ చిత్రము మేశా. ౧౪౮.

ఉ. ధారుణిఁ దీర్ఘమాడఁగను ♦ దవ్వుల కేఁగఁగ నేలనిన్నుఁ దాఁ
జేరుక సన్నుతించినను ♦ శీఘ్రమె కల్గును దేవలోకమున్
గోరెడు వారికిన్ ఫలము ♦ గొబ్బున నిచ్చు చుఘోరమైన సం
సారము మాన్చి ముక్తిని నొ ♦ సంగెడు తీర్థఫలంబు నీవె కా. ౧౪౯.

సీ. నినుఁ బ్రీతితోడఁ గొ ♦ ల్చిన వారు కైవల్య, పదవిఁ గాంతురు వేగ ♦ భక్తవరద
దుర్బుద్ధులైనన్ను ♦ చూచెడు వారలు, మొఱకులై పడుదురు ♦ నరకమునను
నిశ్చలంబగు భక్తి ♦ నీయెడ నిరతంబుఁ, గలుగుట యిది జన్మ ♦ ఫలము గాదె
నిర్వికారత నుండు ♦ నీకు నొక్కఁడె నైన, వైషమ్య బుద్ధియా ♦ వంతలేదు
జంతుజాలంబు నిజకర్మ ♦ సమితి చేత, నుర్వి సుఖదుఃఖముల నొందు ♦ చుండుఁ గాని
కర్మఫలమిచ్చు నల జగ ♦ త్కర్తవీవు, సర్వసముఁడవు గా జగ ♦ జ్జాలమునకు ౧౫౦.

సీ. ప్రణుతదాక్షిణ్యని ♦ పటుదక్షిణామూర్తి, నిజముగాఁ దెలియంగ ♦ నేరకున్న
నవని రాగద్వేషు ♦ లైనను సద్భక్తి, నీనామకీర్తనఁ ♦ బూని సేయ
నపవర్గసిద్ధియౌ ♦ నదిగాక ధరలోనఁ, దత్త్వదృష్టిని జూడఁ ♦ దగిన యట్టి
వస్తువుఁ దగఁ జూచి ♦ వసన సేయఁగఁ దగఁ, గర్మముల్ వెనఁ జేసి ♦ నిర్మలతను
ననఘ నిరపాయముక్తిసా ♦ ధనతఁ గాంతు, రరసి యొవ్వాఁడు నినుఁ గాంచు ♦ నతఁడు జ్ఞాని
సాధుజనములలోనెల్ల ♦ జగతిలోన, నగ్రగణ్యుండు వాఁడెయ ♦ నాదిపురుష.

క. వ్యాసాదులు తమ యోగా, భ్యాసాదులఁ దారు ముక్తు ♦ లైరి హితశాస్త్రా
దేశము నజనులకు పకృతి, వాసిగఁ జేయుదురు గాదె ♦ వారని కరుణన్. ౧౫౨.

క. అవిచింత్యమహిమఁ గలనీ, వవిరళగతిఁ బొందునట్టి ♦ యనఘాత్ములకుం
దవిలిన దుష్కర్మంబులు, భువి నాశము బొందకున్నె ♦ పురుషవరేణ్యా. ౧౫౩.

క. మాయానిబద్ధభువనా, త్యాయతదౌర్గత్యభయము ♦ హరియించుటకై
మాయావిష్టుఁడవైయీ, కాయముధరియింతువిట్లు ♦ కరుణామయతన్. ౧౫౪

సీ. అనఘాత్మనీచిత్త ♦ మనురాగియును గాదు, దేహంబుశృంగార ♦ మోహనంబు
మదనవికారంబు ♦ మదినింతయును లేదు, సగముతానైయుండు ♦ మగువయపుడ
బిచ్చమెత్తుటెకాని ♦ లచ్చియింతయు లేద, యరయమిత్రమునిధా ♦ నాధిపుండు
భుజియించుటకునల ♦ పునుకయేకంచమా, నుండెడునిల్లన ♦ నెండికొండ
అబ్జభవముఖుల్సేవింతు ♦ రనుదినంబు, నిదివిచిత్రంబునీమాయ ♦ యెవరికైనఁ
దెలియఁగారాదుదుర్లభ ♦ మలఘుచరిత, జగతినీమాయవాగగో ♦ చరముగాదె.

సీ. అదిగాకమతియును ♦ నస్పృశ్యరోమార్ద్రి, సామజకృత్తిప ♦ చ్ఛదముగాఁగ
రత్నదీపితవిషో ♦ రగరాజిమొలకట్టు, నవరత్నయుగ్రశ ♦ వంబుగాఁగ
గళదేహములనమాం ♦ గల్యంబులైనట్టి, యెముకపేర్లశవము ♦ నేర్చుబూది
స్రక్చందనములుగా ♦ సంధించునివియెల్ల, వరచంద్రరేఖతో ♦ సరిగమెఱసెఁ
గడఁగినిన్నాశ్రయించిన ♦ కతనయట్టి, మలినవస్తువులైనను ♦ మహితములయి
జగతిఘనవస్తువులతోడ ♦ సమముగాఁగఁ, దేజరిలుఁగావిసర్వేశ ♦ దేవదేవ. ౧౫౫

వ. అదియునుంగాక జగత్పరిపూర్ణుండవు గావున నీవిగ్రహం బగోచరం బైనను నస
దృశుండ వను హేతువుచేతం బ్రకృతిపురుషుం డవను నామధేయంబు ధరియించితి.
ఇట్టి నీకలంకారభూతంబు లైనపూర్వోక్తవేషాభరణంబులు లోకవిరుద్ధంబు లైనను
నత్యంతరమణీయంబులై యున్నయవి. మొదల నశరీరుండవు దేహంబుఁ దాల్చుట విరుద్ధం
బదియునుంగాక స్త్రీపురుషరూపంబు లేకాకారంబుగా ధరియించు టత్యద్భుతం
బేమని వర్ణించెద. భవదీయమహిమానుభావంబు నాగతీతంబు నీవు శరీరాదిభూత
సంఘాతంబునుంబోలె జన్మజరామరణాదులం జెందవు. తత్కారణంబున భువనా
తీతుండవును లోకోత్తరుండవును నై యుపమానోపమేయత్వంబున భవాదృశుండు
గలం డనుమాటయే కాని యన్యదర్శనీయుండవు స్థావరజంగమాత్మకం బైనజగంబులకు
నాశకర్త వీవ. త్వన్మూలంబున నే జగంబులును జీవించు. మోక్షార్థు లైనయోగీశ్వరులకుఁ
గర్మఫలంబుల నిచ్చి రక్షించుటకు హేతుభూతంబ వీవ. పృథివ్యాదిపంచమహాభూతం
బులకుం గారణం బైనశబ్దస్పర్శరూపరసగంధాదికంబులకుం గారణంబ వీవ. సుర
నరగరుడగంధర్వయక్షరాక్షసదైత్యాదులచేత లోకంబులయం దవికలాధిపత్యంబునం
బొందుచు, శరణాగతజనభయనివారకుండ వైననిన్నుఁ బావనం బైననమస్క్రియాధి
కాన్నత్యంబు పొందుంగాని యితరులఁ జెంద నేరదు. అదియునుంగాక మహాజవంబున